శ్రీ

# భాగవతకథ

( శ్రీ మద్భాగవత దర్శనము )

## సప్తదశ భాగము

(17)

హిందీ మూలము

శ్రీగంలా ప్రభు దత్త బ్రహ్మచారి మహారాజు

ఆంధ్రానువాదకులు, శ్రీరామ శరణ్

శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

శ్రీ వేంకటేశ్వరార్ష భారతీ ధర్మసంస్థ

హైదరాబాదు.

సర్వ స్వామ్య సంకలితము

తృతీయ ముద్రణము

2000 ప్రతులు

1985



వెల రూ॥ 5

ప్రతులు లభించుచోటు

దివాకర్ల పబ్లికేషన్సు

శంకరమఠము

నల్లకుంట

హైదరాబాదు - 500 044.

# తొలిపలుకు

బ్రహ్మ సృష్టిలో మానవుఁ డుత్తమోత్తముఁడుగా పరిగణింపఁబడుచున్నాఁడు. అందు కితర జీవజంతువులకు లేని జ్ఞాన మతని కుండుటయే కారణము. భగవంతుఁడు కరుణాళువై ప్రసాదించిన యీ జ్ఞానము సాహాయ్యమున మానవుఁడు తురీయ పురుషార్థమైన మోక్షమును బొందుటకు యత్నింప వలయును. అతఁడట్లు చేయనిచో నాహారభయ నిద్రాదులతోఁ గాలము పుచ్చుచుండు నితర జీవులకును అతనికిని ఆకారమున మాత్రమే భేదముండును. మోక్షప్రాప్తికి మన పూర్వులు మూఁడు మార్గములను నిర్దేశించి యుండిరి. అవి జ్ఞాన, కర్మ భక్తి మార్గములు. ఈ కలియుగమున వీనిలో మొదటి రెండు మార్గము లను అవలంబింపఁ జాలువా రరుదుగా నుందురు. ఇంక మూఁడవదైన భక్తి మార్గమును స్త్రీలనక, పురుషులనక, బాలురనక, వృద్ధులనక, పండితులనక, పామరులనక అందఱు ననుసరించి మోక్షసౌధమును జేరవచ్చును.

వేదార్థోపబృంహణార్థమై భగవంతుఁడగు కృష్ణద్వైపాయనుఁడు బ్రహ్మసూత్ర శ్రీమద్భాగవతములతోపాటు పదునెనిమిది మహాపురాణ ములను ఉపపురాణములను కూడ రచించియుండెను. ఇవి కథోపాఖ్యాన పూర్వకముగా వేదవిక్షిప్తములైన ధర్మ నీతితత్త్వములను జిజ్ఞాసువు లంద ఱికిని సుబోధ మొనరించును. పదునెనిమిది పురాణములలో భాగవత మొకటి. ఇది శ్రీమద్భాగవతమా, దేవీ భాగవతమా. అను విషయమున పండితులలో వివాదమున్నది. కాని పలువురది శ్రీ మద్భాగవతమేయని

భావించుచున్నారు. ఇది యెంత మనోహరమో, భాషాభావము లందంత క్లిష్టమైనది. అందుచేతనే "విద్యావతాం భాగవతే పరీక్షా" అను నానుడి యేర్పడుటయు, పోతరాజు "భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు శూలికైనఁ దమ్మిచూలికైన" నని చెప్పుటయు సంభవించినది. "భగవతః ఇదమ్" (భగవంతునికి సంబంధించునది) అని భాగవత శబ్దమునకు వ్యుత్పత్తి. ఇందు భగవన్మాహాత్మ్య బోధకములైన విషయములు కథలు అనేకములుండును.

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశాను చరితము అను పంచలక్షణములు పురాణమునందుండును. శ్రీమద్భాగవతము పురాణమగుటచే నిందా పంచలక్షణములును కలవు. వీనితో పాటిందు శ్రీమన్నారాయణునికి సంబంధించిన ఏక వింశత్యవతారములును (21) వర్ణింపఁబడియున్నవి. "యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత" "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే" అని శ్రీమద్భాగవద్గీతలో భగవంతుఁడు చెప్పినట్లాతఁడు ధర్మ సంస్థాపనము కొఱకును, సాధురక్షణ, దుష్టశిక్షణముల కొఱకును భూమిపై నవతరించుచుండును. ఆ యవతారముల విషయమే శ్రీమద్భాగవతము నందు ప్రపంచింపఁబడినది. మత్స్యకూర్మాద్యవతారములన్నియు నవతార ప్రయోజనములను నిర్వహించినమాట వాస్తవమేయైనను "కృష్ణస్తు భగవాన్ స్వయ" మ్మను సూక్తి ననుసరించి యిందు దశమస్కంధమున శ్రీకృష్ణుని జన్మాది వృత్తాంతములు విపుల తరముగా వివరింపఁబడినవి. భాగవత తారహారమునకు దశమస్కంధము తరళ ప్రాయము.

శ్రీ మద్భాగవతమున కర్మజ్ఞాన విషయములు కూడ ప్రతిపాదింపఁబడినను భక్తికే అందు ప్రాధాన్యము. మోక్షప్రాప్తి కదియే పరమసాధనమని యది బోధించును. అందలి కథోపాఖ్యానములన్నియు భక్తిమహత్త్వ ప్రతిపాదనము నందే పర్యవసించును. జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు కూడ భక్తిని నిరసింప లేదనుటకు "మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని వివేకచూడామణిలో చెప్పియుండుట నిదర్శనము. సత్యముకూడనంతే. కలియుగము నందలి జనులు కర్మజ్ఞాన మార్గముల నవలంబింపఁజాలని వారగుటచే భక్తినే ఆశ్రయింపవలయును. సంసార సాగరతరణమున భక్తియే నిరపాయమైన నౌక. వ్యాసభగవానుఁడు భాగవతము నిగమ కల్పతరువు నుండి జాఱిన ఫలమని చెప్పియుండెను. అది కల్పతరువువలె భక్తులకు సర్వాభీష్టములను సిద్ధింపఁజేయును.

వ్యాసుఁడు సంస్కృతమున రచించిన శ్రీ మద్భాగవతమును మహాభక్తుఁడును, కవిపుంగవుఁడునైన బమ్మెర పోతరాజు గద్య పద్యాత్మకముగా తెలుఁగున కనువదించెను. ఆతఁడు రచించిన భాగవతము నందలి కొన్ని భాగము లేకారణము చేతనో శిథిలమగుటచే వాని నతని మిత్రులో శిష్యులోయైన గంగన, సింగన, నారయ యను వారు పూరించిరి. అయినను తెలుఁగున భాగవతము మాట విన్నంతనే పోతరాజే తలంపునకు వచ్చును. ఆంధ్ర దేశమున నతని భాగవతమున కున్నంత ప్రచారము మఱే గ్రంథమునకును లేదనుటలో నతిశయోక్తి లేదు. అందుకతని పద్యములందలి ధారాశుద్ధియు నానృతో దృశ్యమైన మాధుర్యమును కారణములు. అందలి పద్యము లొండో, రెండో

నోటికి రాని అక్షరాస్యుఁడు మొన్నమొన్నటి వఱకు ఆంధ్ర దేశమున నుండెడివాఁడుకాదు. కాలవైపరీత్యముచే నిప్పుడందలి పద్యములను కంఠగతము లొనరించుకొనువారి సంఖ్య చదువుకొన్న వారిలోనే చాల తక్కువైనది. పోతరాజు సంస్కృత భాగవతమును యథాతథముగా నాంధ్రీకరించియుండలేదు. భక్తిభావ భరితమైన భాగముల నాతఁడు పెంపొందించి యుండెను. అది గాక పద్యకావ్యముల నర్థము చేసికొనఁ గలవా రిప్పుడెందరో యుండరు. అందుచే సంస్కృత భాగవతమునకు రెండు మూడు వచనానువాదములు కూడ వెలసినవి. భాగవతమువంటి ఉత్తమ గ్రంథమెంత అధికముగా ప్రచారము పొందిన లోకమున కంత మేలు కలుగును.

తపోనిష్ఠాగరిష్ఠులు, యోగిపుంగవులు, భక్తశిఖామణులునైన శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు జగద్ధితార్థమై శ్రీ భాగవతము నందలి విషయములను కథాదృష్టాంతానుభవపూర్వకముగా సరళసుందర మైన హిందీభాషలో నఱువది సంపుటములుగా వచన రూపమున రచించి యుండిరి. అది హిందీ భాషాభిజ్ఞుల అదృష్టము. వానిని భక్తవరేణ్యులు శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకటనర్సయ్య గురుపుంగవులు సర్వసు బోధమైన భాషలో తెలిఁగించి యుండిరి. భక్తిప్రధానమైన శ్రీ మద్భాగ వతమును భక్తవరేణ్యుఁడైన పోతరాజాంధ్రీకరించుటవలన నాంధ్ర లోకమున కెంత మహోపకారము జరిగినదో భక్తచూడామణులైన శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి గారి హిందీ గ్రంథమును భక్తిసముద్రులైన శ్రీ కుందుర్తి గురుపుంగవు లాంధ్రీకరించుట వలన నంతమహోప కారము జరిగినది. ఆ గ్రంథమునకు శ్రీ మద్భాగవతదర్శనమను పేరు

సార్థకము. అది రెండుసార్లు ముద్రితమైనది. కాని ప్రతులిప్పుడు లభ్యములగుటలేదు. అది చూచి నిత్యధర్మకార్యపరాయణులును వదాన్య శేఖరులునైన భక్తులొక రా సంపుటములను పునర్ముద్రించుట వలన లోకమునకు మేలు కలుగునని అందుకు సంకల్పించిరి. వారు సిద్ధ సంకల్పులు. వారి సంకల్ప బీజము వృక్షమై యిప్పుడీ గ్రంథముల రూపమున ఫలించినది. ఆంధ్రులా ఫలమును ఆస్వాదించి ఆనందపారవశ్యము పొందుదు రనుటలో సందేహము లేదు.

ఆ భక్తులే శ్రీ వేంకటేశ్వరార్షధర్మ భారతీధర్మ సంస్థను స్థాపించి దాని పక్షమున అష్టాదశ మహా పురాణములను తెలుగు లిపిలో తాత్పర్య సహితముగ ముద్రించి ఆంధ్రులకు మహోపకారము చేయుచున్నారు. ఈ భాగవతకథా సంపుటములు కూడ, శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతీ ధర్మ సంస్థ పక్షముననే ముద్రింపఁబడుచున్నవి.

శ్రీ వేంకటేశ నామ్నా
భారత సంస్కృతి ప్రవర్ధనార్థాయ
సంస్థాపితేయం ధర్మ
సంస్థార్షా జయతు భగవతః కృపయా,

—దివాకర్ల వేంకటావధాని

నిగమకల్పతరో ర్గళితం ఫలం
శుకముఖాదమృతద్రవ సంయుతం
పిబత భాగవతం రస మాలయం
ముహురహో రసికా భువి భావుకాః

—సంస్కృత భాగవతము

లలితస్కంధము కృష్ణ మూలము శుకా
లాపాభిరామమ్ము మం
జులతాశోభితమున్ సువర్ణ సుమన
స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తమ్ము మహాఫలమ్ము విమల
వ్యాసాలవాలమ్మునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వు
ర్విన్ సద్ద్విజశ్రేయమై

—శ్రీ మదాంధ్ర మహాభాగవతము



# విషయ సూచిక

# దక్ష ప్రజాపతి

## ప్రచేతసపుత్రుఁడగు దక్షుఁడు ప్రజావృద్ధికి తపమొనర్చుట

శ్లో॥ తమబృంహితమాలోక్య ప్రజాసర్గం ప్రజాపతిః ।
విన్ధ్యపాదానుపవ్రజ్య సోఽచరద్దుష్కరం తపః ॥

శ్రీభాగ. ౬ స్కం. ౪ అ. ౨౦ శ్లో.

వ. ఇట్లు దక్షప్రజాపతి ప్రజాసర్గంబు సాలక చింతించి మంతనంబున లక్ష్మీకాంతుని సంతుష్టస్వాంతుం జేయువాఁడై.

క॥ మోదంబై పరిదూషిత
ఖేదంబై శాబరీద్ధకిలికించిత దృ
గ్భేదంబై బహు సౌఖ్యా
పాదంబై యొప్పు వింధ్యపాదంబునకుఁ.

వ. ఇట్లు వింధ్యపాదంబున కరిగి యఁదఘమర్షణంబను తీర్థంబు సర్వదురిత హరంబయి యొప్పు దాని ననుసవనంబు సేవించి యతిఘోరంబైన తపంబు సేయుచు హరి బ్రసన్నుం జేసి హంసగుహ్యంబను స్తవరాజంబున స్తుతించె.

శ్రీ మదాంధ్రభాగవతము

భగవంతుఁడే వ్యక్తినే కార్యమునకుఁ బంపినాఁడో వానికా కార్యముండానక్తి యుండును. అధర్మ ప్రచారమునకు నియోగింప బడినవాఁడు, అనేక యుక్తుల చేత, వివిధ తర్కముల చేత, నానావిధ ప్రక్రియలవలనను అధర్మమును ధర్మముగఁ జెప్పి దానిని లోకముకుఁ బ్రచారమొనరించును. ఇట్టిజీవుల కర్మములం దాసక్తి లేకున్నచో నీ సృష్టినడక నడువదు. కాని యీ సృష్టి అనాదికాలమునుండి యిట్లే యున్నది. అనంతకాలము వరకిట్లే యుండును. ఏలయనఁగా భగవంతుఁడు దీనితో నాడును. ప్రాణు లందరుఁ బాతని కాటబొమ్మలు. శుభాశుభకర్మాసక్తివలననే యీ సంసార చక్రము పరిభ్రమించుచున్నది.

సూతుఁడిట్లనెను - మునులారా! పరీక్షిన్మహారాజు శుక మహర్షిని ఆదిరాజగు స్వాయంభువమనువంశవిస్తారమునుఁ గూర్చి యడిగెను. అంత నా గురుదేవుఁడు మనుపుత్రులగు ప్రియవ్రత, ఉత్తానపాదుల వంశము గూర్చియు, ఆ వంశమునఁబుట్టిన ముఖ్య ముఖ్య ప్రసిద్ధులగు రాజులగూర్చి వర్ణించితిని. ప్రియవ్రతుని వంశము వర్ణించుచు నాతని వంశములోఁ బ్రసిద్ధ ధార్మికరాజగు విరజుని వరకుగల వంశపురుషుల చరిత్రను జెప్పితిని. ఉత్తాన పాదునకుఁ బరమ భాగవతుఁడగు ధ్రువుఁడు పుత్రుఁడయ్యెను. ఆతఁడు గొప్ప భగవద్భక్తుఁడు. ఆతఁ డిప్పటివరకు ధ్రువలోక మున నివసించుచు నుత్తానపాదుని యశమును నినుమడించుచున్నాడు ఆతని పుణ్యయశోవర్ణనము ప్రచేతసుల యజ్ఞమందు నారదుఁడొనర్చి యుండెను. అంతఁ బరీక్షిన్మహారాజిట్లడిగెను- స్వామీ! ఈ ప్రచేతను

లెవరు? ఈప్రశ్ననువిని ధ్రువుఁడు మొదలుకొని ప్రచేతనులవరకు ఉత్తానపాద వంశవర్ణనము శుకుఁడొనర్చెను. చివరకు ప్రచేతనులుపది మందికి సింధుముద్ర సంగమస్థానమునఁదపస్సు చేయుచుండ భగవద్దర్శనమైనదనియుఁ జెప్పితిరి కండుమహాముని గర్భమున ప్రమ్లోచ యను నప్సరసయందొక కన్యక కలిగెను. ఆమెను వృక్షములు పోషించుటచే వార్క్షియనుపేరఁ బ్రసిద్ధిజెందినది. ఆమెను వివాహమాడుఁడని భగవంతుడుచెప్పఁగా నాతని యాజ్ఞచే వారాకన్యకను వివాహమాడిరి. ఆమెయందేఁ బ్రచేతనులవలన బ్రహ్మపుత్రుఁడగు దక్షుడు శివశాపముచే-వచ్చి పుట్టి యీసృష్టిని వృద్ధిఁబొందించి, యీమన్వంతరమందు సమస్తలోకమును జీవులతోనింపివేసెను. ఇంతవరకుఁ జెప్పి యీకథా ప్రసంగమును వదలివేసెను. ఇప్పుడు పరీక్షిన్మహారాజచ్చటనుండియే ప్రశ్నించుచున్నాడు. ఆతఁడు శుకేకునితో నిట్లనెను- స్వామీ! చాక్షుష మన్వంతరములో బ్రహ్మపుత్రుఁడైన దక్షుఁడు స్వాయంభువ మన్వంతరములో దేవా, సుర, మనుష్య, సర్ప, మృగ, పశు, పక్ష్యాదులను సృష్టించెనని చెప్పతిరి స్వామీ! నేనీ సృష్టిక్రమమును విస్తారముగ వినఁదలఁచినాను. ఇదివరలో మీరు మిక్కిలి సంక్షేపముగ సంకేతమాత్రమునఁ జెప్పితిరి ఇప్పుడీవిషయమును విస్తారముగ వినిపింపుడు."

ఇదివినినవ్వుచు శుకుండిట్లనెను- "రాజా! నీవుమాటిమాటికి సృష్టినిగూర్చి ప్రశ్నించెదవేల? ఈ నీరస ప్రసంగమున నీకేమి యానందము గలుగఁగలదు?"

ఇదివిని పరీక్షిన్మహారాజిట్లనెను- స్వామీ! నీరసమో సర సమో? నిద్రించినను, మేల్కొన్నను, నిలుచుండినను, గూర్చుండి నను నెనిమిది జాములు నీసృష్టి మనహృదయమున నృత్యముచేయు చునే యుండును. ఈసృష్టిచక్రమే మనలను భ్రమింపంజేయు చున్నది. దీని మూలకారణము మనము తెలిసినచో నీచక్రమునుండి మనము బయటపడవచ్చును. స్వామీ! సుందరబాలునిగాంచి, వాని తల్లి విషయము దెలిసికొన వలయుననుకొనుట స్వాభావికమే. ఈ చిత్రవిచిత్రమగు జిత్తము బలాత్కారముగఁ దనవైపున కాక ర్షించుచున్న యీసృష్టితనకు దానుత్పన్నముకాలేదు. భగవంతుని శక్తిచేతనే ఇదియుత్పన్నమై వృద్ధిపొందుచున్నది. ఆశక్తిపరిచయ ముకలిగినచో శక్తిమంతుని పరిచయమును గలుగఁగలదు. సర్వ శక్తిమంతుఁడాశ్రీహరియే. నాప్రశ్న యీరాళ్లురప్పలు, అస్తిమాంస ములుగల ప్రాణులకు సంబంధించినదికాదు. నేను సృష్టిప్రశ్న మును సృష్టిజ్ఞానముకొరకై అడిగితిని."

రాజిట్లుపలుకగాఁ విని శుకమహర్షి నవ్వి యిట్లనెను- "రాజా! నీవు శ్రీకృష్ణకథాశ్రయ సంబంధమగు ప్రశ్నగాక అన్యవిషయక మగుప్రశ్న నడుగవని నాకు తెలియును. మంచిది. వినుము. నేను స్వాయంభువమన్వంతర సృష్టివృత్తమును గూర్చి నీకు సంక్షేప ముగఁ జెప్పెదను వినుము. ఇంతటి పెద్దసృష్టిని గూర్చి విస్తార ముగఁ జెప్పుటకు బ్రహ్మాయువుకూడా చాలదు, నారదుఁడు పురం జన పురంజనీ ఉపాఖ్యానమును జెప్పి జ్ఞాన మొసంగిన ప్రాచీన బర్హిమహారాజుకుఁ బదుగురు ప్రచేతనులు పుత్రులై పిత్రాజ్ఞచేఁ భది

సముద్రముల జలమునందు బ్రవేశించి తపస్సును జేయుచుండిరి.
వారి తపమునకు భగవంతుఁడు ప్రసన్నుఁడై వార్షియను కన్యను
వివాహమాడుఁడని చెప్పెను. వారు సముద్రమునుండి వెలువడి
బయటకు వచ్చునప్పటికి భూమిపైనంతటను వృక్షములతో నిండి
యుండెను. వృక్షములసృష్టి తప్ప వేఱొకసృష్టి వారికి కనఁబడక
పోఁగా వారికి కోపమువచ్చెను. వారు తపోఽగ్నిని బ్రజ్వలింపఁజేసి
వృక్షములన్నిటిని గాల్చ మొదలిడిరి. చాల వృక్షములు మండి
పోయెను. నేలమీఁదనున్న వృక్షములన్నియుఁ దగులఁబడఁగా భూమి
నివసించుటకు వీలుగనుండెను. కాని ప్రచేతసులింకను వృక్షముల
నాశముజేయు ప్రయత్నముననే యుండిరి. వారి హఠమునుగాంచి
బ్రహ్మ తన శ్వేతహంసనెక్కి తెల్లపాగా జుట్టుకొని, తెల్లని పూల
మాలను ధరించి తెల్లతామరను ద్రిప్పుచుఁ బరువిడుచుఁ బ్రచేతసుల
కడకు వచ్చి యిట్లనెను- రాజకుమారులారా! మీరిదేల నుపద్రవ
మును గావించుచున్నారు? ఛీ! ఛీ! ఇంతటి క్రోధమా? మీరు ప్రజా
పతులు. సృష్టికి భర్తలు, భరణభూషణచేయువారిని భర్తలందురు.
సంకటముల నుండి రక్షించి పాలించువారినిఁ బతియందురు తల్లి
దండ్రులు బాలకులకుఁ బతులు వారెంతో బాలకులను గనిపెట్టుకొని
యుందురు. తల్లి కథాశ్రవణము చేయుచునేయుండును. కాని ఆమె
దృష్టి పిల్లవానిమీఁదనే యుండును. ఆతని గతివిధులందే మనస్సుం
చును. ఆతఁడు సుఖముగ నాడుచున్నంత వరకు తల్లి యట్లే
యుండును. సర్పము, వృశ్చికము, శస్త్రాగ్నులు మొదలగున
స్పర్శించుట సంభవించెనా పరువిడివచ్చి, వానిని రక్షించి, చంక

కెత్తుకొని పాలిచ్చును. ఇదే విధముగ స్త్రీకి రక్షకుఁడు పతి. ఇంటి నుండి యెంతదూర మెచ్చటికి పోయినను ఆతని మనస్సింటిలోనే యుండును. ఆమె భరణపోషణము, అన్నవస్త్రాదులు, శయ్యా భరణాదులు పతియే కూర్చవలసి యుండును. రాజా! సాధువు చిన్నవాఁడైనను, ఆతఁడిల్లు వదలి బిచ్చమెత్తుకొనుచున్నను వానిని బాబా యనియే యందురు. మన తండ్రియు బాబాయనియే పిలుచును. మన తాతయు బాబాయనియే పిలుచును, జగత్తులో నిట్టి బాబాలందరకు బ్రతిగృహస్థు ప్రొద్దెక్కఁగానే గృహస్థు జ్ఞాపకమునకు వచ్చును. ఆతనికడకు బోఁగానే భిక్షదొరకును. ఆతఁడు గొప్ప సాధుసేవకుఁడు. సాధుభిక్షకుల భరణపోషము గృహస్థుల ద్వారా జరుగును. గావున గృహస్థు సమస్తాశ్రమముల వారికి భర్తయుఁ బాలనకర్తయునై యున్నాఁడు. అజ్ఞానులకుఁ బతి జ్ఞాని, చిన్న చిన్న బాలకులను బట్టుకొనివచ్చి జ్ఞానియగు గురువు దగ్గఱకుఁజేర్చును. గురువెట్లాడించిన నట్లాడును. ఒక్కొక్క ప్పుడు గ్రుద్దులు గ్రుద్దును, ఇంకొక్కప్పుడు బెత్తముతోఁ గొట్టును. ఒక్కొక్కప్పుడు గ్రుడ్లురుమి గద్దించును, మఱొకప్పుడు పనులు చెప్పును. ఇంకొక్కప్పుడు కొన్ని పనులను జేయవలదని నిషే ధించును." ఇట్లుచేసినను బాలురు వినితీరవలెను. ఇదేవిధముగ వత్సలారా! సమస్త ప్రజలకుఁ బతిరాజు. రాజందరను రక్షింప వలయును. ఈ వృక్షములు మీ ప్రజలే, పాలనీయములు, రక్ష ణీయములు. వీటినేల వృథాగాఁ గాల్చుచున్నారు? మీరింత తప స్సొనరించినను బాలులేయైతిరి. సర్వాంతర్యామియగు ప్రభువు సచ

రాచర ప్రపంచమంతటను గలఁడు గావున నంతయు భగవంతుని నివాసస్థానమని అన్నిటిని సత్కరింపుఁడు. అన్నిటిని బూజింపుడు. ఇట్లుచేయుటచే భగవంతుఁడు శీఘ్రముగ సంతుష్టుఁడు కాఁగలడు. తనహృదయములోఁబుట్టిన భయంకర క్రోధమును ఆత్మవిచారము ద్వారాతనలోనే శాంతింపఁజేసికొనినవాఁడే త్రిగుణతీతుఁడుకాగలడు. కామ, క్రోధ, లోభమునకు వశీభూతుఁడైనవాఁడు త్రిగుణమయ భయంకర సంసారమందుబడును. కావున నీవృక్షములపైఁ గ్రోధ మును వీడుఁడు. వీనిచేఁబాలింపఁబడుచున్నది వార్షియను చిన్నది. ఆమెను వివాహమాడుఁడు. వివాహమాడిన తర్వాత నీవృక్షములు మీకు మామలుకాగలరు. తండ్రివలె గురుస్థానీయులగుదురు. కావున వీటికి మీరాదర సత్కారములు కావింపవలయును."

వృద్ధపితామహుఁడగు బ్రహ్మ చెప్పఁగాఁ జిన్నవారగు ప్రచే తనులుతలలూపి యంగీకరించిరి. అంతఁ బహ్మమిక్కిలి ప్రసన్నుఁ డయ్యెను. వారిశిరస్సును మూర్కొని, మాటిమాటికి వారిపైఁ జేతిని నిమురుచు నాశీర్వదించి తనలోకమునకుఁబోయెను. అంత వివాహ మయ్యెను. ఆమె గర్భమునుండి పూర్వము బ్రహ్మపుత్రుఁడగు దక్షుఁడిప్పుడు క్షత్రియుఁడైపుట్టెను. ఉత్పన్నుఁడగువానికి సృష్టినిఁ బెంపొందింపు నుద్దేశ్యము కలుగుటస్వాభావికము ఈతనియుత్పత్తి బ్రహ్మసృష్టికొరకు జేసెను. కావునఁబూర్వసంస్కారానుసారముగ నీతఁడు పుట్టఁగానే సృష్టివృద్ధికావింపఁ బ్రారంభించెను. ఆతఁడు ముందుగా మనస్సుతో దేవాసుర మనుష్యాదులను సృష్టించెను. కాని గొంతెమ్మ కోర్కెలవలనఁ దాత్కాలికముగ మనఃప్రసన్నత కలుగు

గాని ఆఁకలితీరదు. ఇదేవిధముగ జలచర, స్థలచర, నభచరాది యనేక జీవులను మానసికముగ సృష్టించినను బ్రహ్మ వృద్ధి కలుగలేదు,

శుకుఁడిట్లనెను- రాజా! తన యిచ్ఛానుసారముగఁ బ్రజా సర్గము వృద్ధికాకుండుటనుగాంచి దక్షప్రజాపతి తపముద్వారాశక్తిని సంపాదించి యీసృష్టిని వృద్ధిఁజెందింపనిశ్చయించెను. ఇట్లు నిశ్చయించి యతఁడు వింధ్యాచల పర్వతతలమునకుఁబోయి పరమ పవిత్రమగు అఘమర్షణమను తీర్థమునకుఁబోయి ఘోరమగుతపస్సు సేయసాగెను. ఆతఁడచ్చటనియమసంయమములతో నుండసాగెను. కొన్నాళ్లు ఫలపుష్పములనుదినియు, గొన్నిదినములు జలములను ద్రాగియు, గొన్నిదినములు వాయుభక్షణమొనర్చియుఁ దపమొనరించెను. ఆతఁడు తపస్సునందు నిరతుఁడై కమలనయనుఁడగు వాసుదేవుని హంసగుహ్యాకమను స్తోత్రముచే స్తుతించెను."

అంతశౌనకుఁడిట్లనెను- "సూతా! హంసగుహ్యకమగుస్తోత్ర మెట్టిది? దానివర్ణనము నీవుమాకు వ్యాఖ్యతో జేయుఁడు"

అంత సూతుఁడిట్లు జవాబిచ్చెను- మహాభాగా! దేవీస్తోత్ర ములనుగూర్చి వేరువేరుగా నొక్కసారిగ వర్ణించెదను. ఇప్పుడిఁక మీరు ముందుకథనే వినుఁడు,"

ఇది విని శౌనకుఁడిట్లనెను :- "మంచిది. నీ యిష్టము. కాని సంక్షేపమున సారవిషయమును కొలఁదిగఁ జెప్పుము. తర్వాత నే మైనది?"

సూతుఁడిట్లనెను :- "కొంచముండుము. ఏమైనదో దానినిఁ జెప్పెదను, హంసగుహ్యాక స్తోత్రము జ్ఞాపకము రాగానే నాకు భగవద్రూపము స్మరణమునకు వచ్చినది. కొంచెము సేపు ధ్యానించి కథను జెప్పెదను."

## దక్ష ప్రజాపతికి భగవద్దర్శనము

శ్లో॥ ఇతి స్తుతః సంస్తువతః స తస్మిన్న ఘమర్షణే ।
ఆవిరాసీత్కురుశ్రేష్ఠ భగవాన్ భక్తవత్సలః ॥

శ్రీభాగ. ౬ స్కం. ౪ అ. ౩౯, 30 శ్లో ॥

వ. ............ ఆ పరమేశ్వరుండు మదీయ మనోరథంబు సఫలంబుసేయుంగాక యనుచు భక్తిపరవశుండై యుక్తివిశేషంబుల స్తుతియించుచున్న దక్షునికి భక్తవత్సలుండై శ్రీవత్సలాంఛనుండు ప్రాదుర్భావంబునొందె"

శ్రీమదాంధ్రభాగవతము

భగవంతుండు కల్పవృక్షము వంటివాడు. అనన్యభక్తి భావముతో భజించిన వారికి మోక్షఫలమును [illegible] అర్థార్థులై భజించినవారికి అర్థమును, ధర్మార్థులకు ధర్మవృద్ధిని [illegible]

కొఱకు భజించినఁగామమును, మోక్షేచ్ఛచే నారాధించినవారికి మోక్షమునొసంగును. ఆ సర్వేశ్వరునికడ నే వస్తువునకును గొదు వలేదు. ఆతఁడు కామార్థిపై నలుగఁడు ఏలననగా నాతఁడు తన కామనాపూర్తికొఱకు ఇతర సాంసారిక శక్తి నాశ్రయింపక ప్రభు వునే నాశ్రయించినాఁడు కావున నట్టి సకాము భక్తునకుఁ బ్రత్యక్షమై యభీష్టవరములొసంగును. సమస్తకర్మములు కృష్ణార్పణమని భావించు భక్తుల యిచ్ఛ యందు భగవదేచ్ఛయే కలదు కావున వారి కోరి కలను నెఱవేర్చుట భగవత్కార్యములను నెఱవేర్చు టేయగును.

శుకుఁడిట్లనెను :- రాజా! ప్రచేతనుల పుత్రుఁడగు దక్షుఁడు అఘమర్షణతీర్థమందు ప్రజావృద్ధినిమిత్తమై యుపాసన నారంభిం చెను. ఆతఁడు నియమముతో హంసగుహ్యక స్తోత్రమును నిరంత రము జపపాఠములొనర్చుచుండెను. ఆతఁడిట్లు భగవంతునిఁ బ్రార్థిం చుచుండెను హే ప్రభూ! నీ మహిమ అపారము. నీకు నమస్కా రము భూతభవిష్యద్వర్తమానము లన్నియు బ్రహ్మమే. అట్టి సర్వ వ్యాపకుఁడవగు నీకు నమస్కారము నామరూప రహితుడవయ్యు నీచరణకమలముల భజించు వారికిఁ గృప జూపుటకై దివ్యజన్మ కర్మలద్వారా దివ్యనామరూపములను ధరించిన పరాత్పరుఁడు పామరుఁడనగు నా పైఁ బ్రసన్నుఁడయ్యెదవుగాక! అంతర్యామి అనంతప్రాకృతిక జ్ఞాన మార్గము ద్వారా మానవుని భావనానుసార ముగ భిన్న భిన్న దేవతలు, ఇష్ట దేవతా, అర్చా విగ్రహ రూపమున నున్న ప్రభువగు నీవు నాపైఁ బ్రసన్నుఁడ వయ్యె దవుగాక!"

ఈ విధముగ దక్షుఁడొనర్చిన స్తుతికి గరుడధ్వజుఁడగు మహావిష్ణువు అష్టభుజములతో దక్షునకుఁ బ్రత్యక్షమయ్యేను. ఆతని శోభ విలక్షణమైనది. ఆతఁడు తన చరణములను గరుడుని మూఁపుపైనుంచెను. సర్పశరీరమువలె నునుపై, యాజానులంబిత ములైయున్న నష్టభుజంబులందు శంఖ, చక్ర, గదా, పద్మ, ఖడ్గ, ధనుర్బాణ, పాశములను, డాలును ధరించియుండెను. ఆతని శోభా యుక్తమగు శరీరము సజల జలధరమువలె శ్యామ వర్ణముగ నుండెను. ఆకాశముననున్న మెఱుఁగుతీఁగెవలెను, నీలవసనధారి యగు నాయకుని ప్రక్క పీతవసనధారిణియగు నాయిక శోభించు చున్నట్లాతనిపైఁ బీతాంబరము శోభించుచుండెను. పూర్ణచంద్రుని వలె నాతని మనోహర వదనారవిందము నవ్వుచుండెను. నేత్ర ములు శీతలమై ఉత్ఫుల్లకమలములవలెఁ బ్రసన్నములై, మధు మయ నురాగపరాగ యుక్తమైయుండెను. ఆతఁడు విశాలమకుటము చేతను, గటకములచేతను, తళతళలాడు మకరకుండలములను కాంచీ అంగుళీ, కంకణ, నూపురాంగదాది దివ్యాభరణములచే విభూష తుఁడైయుండెను. ఆతని శోభ అవర్ణనీయమై యుండెను. సిద్ధచారణ గంధర్వాదులచేఁ బరివృతుఁడైన స్వప్రాకృతాఽద్వితీయ సామ్రాట్టు వలె నారద నందసునందాది ప్రియపార్షదులచేఁ జుట్టుకొనఁబడి యుండెను.

త్రిజగన్మోహనకాంతితో నకాత్తుగాఁ బ్రకటమైన భగవ ద్రూపమునుగాంచి దక్షప్రజాపతి నిర్భ్రాంతిపోయి, కిం కర్తవ్యతావి మూఢుఁడై, పూజోపచారములేవియుఁ జేయకయే చేతులు జోడించు

కొనుచు నక్లేచూచుచు నిలువఁబడిపోయెను. భగవంతునిఁ తన సమ్ముఖమునఁగాంచఁగానే తన నేత్రములపైఁ దనకు విశ్వాసము లేకుండెను. ఆతఁడు మరలఁగనులను నలుపుకొని త్రిభువనకమనీయమగు ననుపమమాధుర్య రూపమునుగాంచి భయపడి ప్రేమ భారభరిత హృదయమున మానసిక కృతజ్ఞతను ప్రకటించుచు సాష్టాంగ దండప్రణామము కావించెను. రాజా ! ఆసమయమున దక్షునిస్థితి నే నేవిధముగ వర్ణింపఁగలను. అది అవర్ణనీయము. వాక్కునకందనిది. భాష మూఁగదై పోయినది. భావము నా శబ్దములతో వ్యక్తమొనర్ప నసమర్థుడను గంధమాద పర్వతముపై అలకనందయందు కొండవాగులనేకము లొక్కసారిగాఁ గలకలరవములొనర్చుచు గలియఁగా నా ప్రవాహమతివేగముగఁ బూర్ణముగ నున్నట్లు పూర్ణానందవేగమున మనస్సు ఇంద్రియములగతి యగుటచే స్తుతింపవలయునని యుండియు స్తుతింపఁజాలక పోయెను. వాక్కు గద్గదికముకాఁగా బ్రయత్నించినను బ్రేమాతిరేకమున నాతఁడేమియును బలుకఁజాలకపోయెను.

తన భక్తు డేదియో చెప్పుకొనఁదలఁచియున్నాడనియు గాని ప్రేమవిహ్వలుఁడై పలుకఁజాలకున్నాఁడనియుఁ దెలిసికొని, యెట్టెనను దానే సంభాషణము సాగింప నుద్దేశించి యాతడి సంకోచము బోఁగొట్టుమ మేఘగంభీర వాక్కుతోఁ బలుకనారంభించెను.

భగవానుఁ డిట్లనెను- "ప్రజాపతీ ! దక్షా ! ఇప్పుడు నీవు నిశ్చింతుండవగుము నీవు కృతకార్యుఁడవు. ఏ కోరికతో నీవు

తపమొనరించుచున్నావో ఆనీకోరిక నెరవేరినది. నీకిప్పుడు సిద్ధికలి నది, సమస్త సాధనములకు ఉత్తమఫలమ్ము నాయందు దృఢాను రాగము కలిగియుండుటయే నీతపస్సు సర్వశ్రేష్ఠమగు తపస్సు.

అదివిని మిక్కిలి కష్టముతో దక్షప్రజాపతి ఇట్లనెను- "స్వామీ! నాదేటితపసు. నేను వ్యాపారివణిజుఁడను. కామిని మన స్సులోఁ గోరికనుబెట్టుకొని సకామ ఆరాధనము చేయుచుంటిని.

భగవంతుఁడు నవ్వుచునిట్లనెను- "కాదు నాయనా! నీతపస్సు నీనిమిత్తముకాదు నీవీతపస్సుచే శరీరేంద్రియముఖముల యభి వృద్ధినిఁ గోరుటలేదు. నీవువిశ్వవృద్ధినిఁ గోరుచుంటివి, అందువలన నేను నీయెడలఁ బ్రసన్నుఁడనైతిని పరోపకారేచ్ఛ స్వార్థముకాదు పరమార్థమే."

దక్షప్రజాపతి చేతులు జోడించుకొని వినీతభావముతో నిట్ల నెను- "స్వామీ ! ప్రజావృద్ధి కావలయున్న నాలోని వాసనను, లోపలికి కోరికలను నేనాపుకొనఁజాలకుంటిని."

భగవంతుఁడిది వినినవ్వి యిట్లనెను- "రాజా! ఇదినాకోరికే. సమస్తజీవులు అభివృద్ధి కావలయునని నేనుకోరుచున్నాను నాయిచ్ఛ వలననే సమస్తప్రాణుల యుత్పత్తికి హేతుభూతులగు బ్రహ్మ రుద్రేంద్రమను ప్రజాపతులు మొదలగువారు పుట్టిరి. వీరందరును నావిభూతులే. వీరునాకుభిన్నులుగారు. వీరికి పృథక్సత్తాలేదు. నేనుం డుటవలననే వీరిప్రాదుర్భావము ఈవిశ్వమంతయు నామరూపమని

తలంచును. దక్షప్రజాపతి యిట్లనెను- "స్వామీ! నీరూపము నేవిధముగఁ జింతింపవలయును?"

భగవానుఁడిట్లనెను- నాకనేకరూపములు, అనేకభావములు కలవు. అనేకాకృతులుగలవు. తపమును నీవు నాహృదయముగ భావింపవలయును. విశ్వము నాశరీరము. ఆకృతికర్మ, యజ్ఞము నాశరీరావయవములు. ధర్మము నామనస్సు. ఈదేవతాబృందమంతయును నా ప్రాణస్థానీయులు ఈ సమస్త దృశ్యమాన సృష్టికాదియందు నారంభమందును జిన్మాత్రమును, నవ్యక్తమును, సమస్త దిక్కులసంసుప్తమువలె నేనొక్కఁడనే యున్నాను. వేరుగాక లోలను బయటను ద్రష్టాదృశ్యములేవియును లేవు. నాతో లోకపితామహుఁడును నజుఁడును, సృష్టికర్తయునగు బ్రహ్మ యుద్భవించినాఁడు."

దక్షప్రజాపతి యిట్లనెను - "ప్రభూ!" మీవలన స్వయం చతురాననుని యుత్పత్తి యెట్లైనది.

భగవంతుఁడిట్లనెను- 'రాజా! అచ్యుతుఁడను. అనంతుఁడనగు నాయందెప్పుడు మాయాయోగముచే గుణమయమగు బ్రహ్మాండశరీరము ప్రకటమైనదో, ఆ సమయమున నీ బ్రహ్మాండరూపమగుఁ గమలమునుండి అయోనిజుఁడును గమలాసనుఁడునగు బ్రహ్మ యుద్భవించెను. ఆ దేవ శ్రేష్ఠుఁడు నా వీర్యముచే నుత్పన్నుఁడై అభివృద్ధినిఁజెందెనో అప్పుడాతఁడు నా

యిచ్ఛను వశీభూతుఁడై సృష్టికార్యమొనర్ప నుద్యుక్తుఁడయ్యెను. ఆతని మనస్సులోఁ బ్రజాసృష్టి చేయవలయునను దీర్ఘేచ్ఛ జాగృతి వహించెను. కాని ఆతఁడా కార్యములో నసమర్థుఁడనే యనుకొనెను."

అంత దక్షప్రజాపతి యిట్లడిగెను- అయితే తర్వాత నేమైనది స్వామీ! ఆతని కోర్కెను మీ రెట్లు నెరవేర్చితిరి ?"

భగవంతుఁడిట్లనెను :- "చతురాననుఁడగు బ్రహ్మ కింకర్తవ్యతావిమూఢుఁడు కాఁగా నే నవ్యక్త వాక్కులతో నాతనితో రెండు శబ్దముల బలికితిని. అందు మొదటిది "త" రెండవది "ప" ఆతఁడు నా యభిప్రాయము గ్రహించి తపము చేయసాగెను. దివ్య సహస్ర వర్షములట్లు తపము చేయగా స్వతః ఆతనికి సృష్టిరచనా సామర్థ్యము కలిగెను. మునుముందుగా నాతఁడు మీ తొమ్మిదిమంది ప్రజాపతులను సృజించెను. అప్పుడు సృష్టి వృద్ధికాసాగెను."

ఈ మన్వంతరమందును ప్రాచీనసృష్టివలెనే సృష్టిజరిగెను. దానిని నీవు నా ప్రేరణచే వృద్ధిగావింపఁ గోరినచో నా మాటలను వినుము."

చేతులు జోడించి దక్షుఁడిట్లనెను- 'స్వామీ! మీయాజ్ఞప్రకారమే నాకుకర్తవ్యకర్మకు ఆదేశమురావలయును"

భగవంతుఁడిట్లనెను- "నీవుచేయుమానసిక సృష్టివలనసృష్టి యెన్నటికిని వృద్ధికాదు. మానసకసృష్టిచే బుట్టినవారు శుద్ధాంతఃకర

ఖులుగానే యుందురు. వారు సృష్టిజంజాటములో నేలరబడెదరు ? నీవు మైథునసృష్టినిగావింపుము.స్వాభావికముగ స్త్రీమీఁదఁబురుషునికి బురుషునిమీఁద స్త్రీకిని బ్రేమయున్నచో సృష్టిదానికదియే వృద్ధికాఁగ లదు.సంధ్యావందనము చేయుఁడనియు, సత్యము అహింస, బ్రహ్మ చర్యము లాచరింపుడనియు నెన్ని యుపదేశము లొసఁగినను వేయికి, లక్షకు ఒక్కనిపైఁ బ్రభావముపడును, కాని సంతానోత్పత్తివిషయ ములో జీవులకు స్వాభావిక ప్రవృత్తియుండును సంతానోత్పత్తి సమయములో తల్లికెంతో బాధకలుగుచున్నను దానిని లక్ష్యపెట్టక ఆతల్లులు స్వేచ్ఛగా మరలమరల సంతానమునుగనెదరు. సంతా నము లేనివారు దుఃఖించి, సంతానముకొరకు యంత్రములు, తంత్ర ములు, మొక్కుబడులు, మందులు, మ్రాకుల ఒక్కటేల ననేకాను చితకార్యములొనర్చుచుందురు. పురుషులును పదమూఁడు పదునాల్గు సంవత్సరములు వచ్చునప్పటికి స్వతఃసంతానవృద్ధి పుణ్యకార్య ములోఁ బ్రవృత్తులగుచుందురు. కావునరాజా! సృష్టి వృద్ధికార్యమే సరళము, సుగమమునగు నుపాయము. పంచజనుఁడను నొకప్రజా పతి యుండెనువాఁడు అతనికత్యంతసుందరి అసిక్నియను కన్యక కలదు. ఆమెను నీవగ్నిసాక్షిగా నియమముతో వివాహమాడి భార్య గాఁచేసికొనుము అంత నీవు దాంపత్యసంబంధమగు రతిధర్మముచే మైథునమున నాధర్మపత్ని యందు బ్రజలనెందరినో ఉత్పన్నము చేయుఁగలుగుదువు. అంతనిదియే సదాచారము కాఁగలదు, పెద్ద వారేమిచేయుదురో తర్వాత వారును దానినే అనుసరించెదరు. నీ తర్వాత వచ్చిన స్త్రీపురుషసంతతి వివాహములు చేసికొని రతి

ధర్మమున నెవ్వరును జెప్పకయే మైథునసృష్టినిఁ బ్రసన్నముగఁ గావించెదరు. మానసికసృష్టిచే లాభములేదు. సృష్టి వృద్ధిగాఁగానే అందరు నన్నారాధించెదరు. దీనివలన నీవు గొప్ప పుణ్యము లభింపఁగలదు. దానధర్మములు చేయువారు కన్యాదానమును సర్వశ్రేష్ఠముగ నెన్నెదరు. ఏలయనఁగా దీని వలన వంశవృద్ధి కాఁగలదు.

శుకమహర్షి యిట్లనెను :- "రాజా ! ఈ విధముగ దక్ష ప్రజాపతికి ఉపదేశ మొసంగి భగవానుఁడచ్చటనే దక్షుడట్లు చూచు చుండఁగనే అంతర్ధానమయ్యెను."

## మైథునధర్మముచే దక్షుఁడు హర్యశ్వులను గనుట

శ్లో ॥ తస్యాం స పాంచజన్యాం వై విష్ణుమాయోపబృంహితః
హర్యశ్వ సంజ్ఞానయుతం పుత్రానజనయద్విభుః॥
శ్రీభాగ. ౬ స్కం. ౫ అ. ౧ శ్లో॥

వ....దక్షుఁడు విష్ణుమాయో పబృంహితుఁడై పాంచజని యగు నసిక్ని యందు హర్యశ్వసంజ్ఞల వినుతిఁ జెందియున్న యయుత సంఖ్యాపరిగణితులైన పుత్రుల దశ సహస్రంబుఁ బుట్టించె."
శ్రీమంద్రాంధ్రభాగవతము.

భగవన్మాయ యెంతటి ప్రబలమైనదో కాని జ్ఞాని, అజ్ఞాని పండితుఁడు, మూర్ఖుడు, చిన్న వాఁడు, పెద్ద వాఁడు. పశువులు, పక్షులు తిర్యక్కులు, మనుష్యులు వేయేలనందరును మాయకు వశీభూతులై కార్యములొనర్చుచున్నారు. ఇతనిమాయలేక సృష్టిలేదు, సంబంధము లేదు, సంసారములేదు, దుఃఖములేదు, క్లేశములేదు, మరణములేదు. బంధములేదు, మోక్షములేదు, ఇదిలేదు, అదిలేదు. నేనులేను నీవు లేవు, ఎంతనిచెప్పఁగల నేమియును లేదు. ఆతఁడే యున్నాఁడు. ఈమోసపుమాయ అడ్డమువచ్చి యీగోలంతయు తెచ్చిపెట్టినది. పిల్లలనుగనుము, సృష్టించుడు, వివాహము చేసికొనుము, వదలిపెట్టుము, గ్రహించుము అనునవన్నియు దీనిలోనేకలవు. ఈమె యెట్టిగుణమ యమగు నూతనవధువనఁగా నీవిశ్వరూపమను నత్తవారింట నామె యెప్పుడు పాదముపెట్టినదోకాని అప్పటినుండి యామెక్రొత్తచీరెలను మార్చుచూనేయున్నది. ఈమెయెన్నటికిని ముసలిదికాదు. జబ్బు పడదు. శరీరము ముడతలుపడదు, వృద్ధావస్థవలనవచ్చిన కురూ తపయులేదు. సదానిత్య నూతనమై వయ్యారపు మెరంగులతో సింగారించుకొని దిరుగు చుండును. మనబోటి యజ్ఞానుల మాటేమిటి, గొప్ప గొప్ప అద్వైత వేదాంతజ్ఞానులు సదసద్వివేచనము చేయఁగలిగి యుండియు నీమె ముసుఁగునెత్తి యథార్థ స్వరూపమును దెలియఁదలఁచియు నింతవరకు నిశ్చితనిర్ణయమునకు రాఁజాలకపోయిరి అడుగుటెందుకు? ఈమాయలాడి 'సత్' అందుమా తలనాడించెదరు, పోనిండు ఇదిపూపమెఱుంగుల పూఁబోడివలెనంద అభ్రమలోఁ బడవేయుచున్నది కాఁబట్టి 'అసత్' అందుమా దానికిని

తలనుజేతులను గాదని యూఁపుచు గంభీరముద్రతోఁ గన్నులఁ దెరచి కాదయ్యా! ఇదిఅసత్తుకాదని పలికెదరు. అప్పుడు మనము చిక్కులోఁబడవలసినదే. అట్లైన నిదినత్తుకాదు, అసత్తునుగాదు కలగా పులగమువలె రెండును గలిసినదనినచో వారునవ్వియిట్లందురు :- ఇదికలగా పులగముకూడకాదు. అనిర్వచయనీము. దీనినిఁబుట్టించిన వాఁడు దీనికిమాయయనియు ,అనిర్వచనీయమనియు రెండుపేర్లుపెట్టి యుండవలయును. కాకున్న ననిర్వచనీయమునకేమియును నర్థము లేదు. 'ఉన్నది' అనుశబ్దమునకర్థము కలదు. దానిని జ్ఞానులే యెరు గఁగలరు. అజ్ఞానులీదేవికి దూరమునుండియే దండమిడి, ఆమెపతి పాదపద్మములనుఁ బ్రణమిల్లెదరు. ఈమెవిషయము నడగనే యడు గరు. ఇంతగొప్ప పూజలముందరనా స్త్రీచర్చ, అదెట్లునన్న ఎవ రును వారివారి స్వభావములను వదలనప్పుడు మనము దీనిస్వభావ మును కులగోత్రములచర్చ యేలచేయవలెను. సాధువునకు భిక్షతప్ప యీాయనిర్వచనీయములతో నేమిపని? ఆమాయనాశ్రయించిమాయా పతి యీాసృష్టిరచనను గావించునని మనమెల్లప్పుడును వినుచునే యున్నాము. ఆమాయకు వశీభూతుడవై భగవదేచ్ఛచేఁ బ్రజాపతు లందరును సృష్టిరచనయందు బలవంతముగ నుత్సాహముతోఁ బ్రవృత్తులగుదురు. ఈప్రకృతి పురుషులులేక ఒక్కఅడుగైనా జరు గదు. కావునఁ బ్రకృతిరూపిణియగు స్త్రీసృష్టి, బ్రహ్మ మునుముం దుగాఁ బురుషునితోఁజేసెను. ౧ మరియు ౧ కలిసిన ౧౧ అయినది. అందుకనియే వివాహసమయమున వేదము స్త్రీకిట్లాదేశించినది - నీ ఒక్కతేవు. నీపతియుక్కడు, మీరిద్దరునుగలిసి నీపతినిఁ బదునొకం

దవవానినిఁగాఁ జేయుము. అద్వితీయుడుఁగ నొక్కఁడే యున్నచో మెదలకుండ యుండవలసినదే, ఇద్దరైరా అచ్చట గోవిందాయ నమోనమః కాఁగలదు, దానిపేరే జగత్ప్రవాహము.

శ్రీశుకమహర్షియిట్లనెను- "రాజా! భగవంతుఁడు దక్షుని వివాహముచేసికొనమని యాజ్ఞాపింపఁగా నాతఁడు భగవదాజ్ఞను శిర సావహించెను. పరమసుశీలయు, గుణవతియు, రూపవతియు, లజ్జా వతియునగుఁ బంచజనుని పుత్రికను బ్రజాపతి వివాహమాడెను. వివాహానంతరమాతఁడు తనపత్నినిఁబొంది పరమప్రసన్నుఁడ య్యెను. ఆతఁడు సాధారణునివలె విషయాసక్తుఁడుకాఁడు. పరమ యశస్వియు, తేజస్వియు, తపస్వియు విష్ణుశక్తి పరిబృంహిత పర మైశ్వర్యశాలి. ఆతఁడు మైథునముతో మంత్రతంత్ర యంత్రముల ప్రభావముచే ముందుగా బదివేలమంది పుత్రులను గనెను."

అంతశౌనకుఁడిట్లనెను- "సూతా ! ఇదిమాకు విశ్వసింపఁ దగినదిగాలేదు. ఒకరో యిద్దరో, నల్గురో అయిదుగురో యగుచో నమ్మదఁగియుండునుగాని ఒక్కసారి పదివేలమంది పుట్టినారనినది మన బుద్ధికందని విషయము. నీవుభక్తికలిగించుటకై యెంతచెప్పి నను జెప్పవచ్చునుగాని మహాభాగా! ఇది మనస్సునకెక్కఁదు."

అంత సూతు డిట్లనెను:- "స్వామీ! వారు సాధారణ మాన వులుకారు. వారు సంకల్పముచేతనే అనేకవిధముల సృష్టి చేయఁగలు గుదురు. మంత్రబలమున వారికి పదివేలమంది పుత్రులు గలుగుట

గొప్పవిషయముకాదు. ధృతరాష్ట్రుఁడు గాంధారివలన నూర్గురు పుత్రులను గనెను. ఒకతిత్తిలో నూరు బీజములచే నుత్పన్న మొనర్చి, అవివేఱు వేఱుగ నేతి దుత్తలలోఁ బెట్టఁబడెను. అవి అందు పెరిగెను. అంత విధివిధానమున నవి తీయఁబడెను. కలియుగ మందును వైజ్ఞానికోపాయములచే రజోవీర్యములను గ్రహించి మాతృగర్భమునఁగాక వేఱుగ సంతతిఁగలిగించు నుపాయములొనర్చెదరు. ప్రాణశక్తి సంచారము కలుగుటకు దానిలో వీలున్నది; కాని వారీ కృత్రిమోపాయములచే మనుష్యులను బుట్టింపఁజాలరు. ఆ దినముల లోనివారు సామర్థ్యముకలవారును, సత్యసంకల్పులుగ నుండెడు వారు. వారు వారి యమోఘవీర్యము నెన్ని భాగములుగ విభజించిన నంతమంది కలుగుదురు. ఈ సంకల్పముద్వారా సృష్టికొఱకు పరితపించు దక్షుఁడు శుద్ధమైన మనస్సుతో రతి లేకయే, వీర్యసంసర్గము లేకయే పదివేలమంది పుత్రులను బుట్టించెను. రజోవీర్యములు సంసర్గమాత్రములే. వాస్తవమున వారు శుద్ధచిత్తముతో నుత్పన్నము కావింపఁబడిన మానసికపుత్రులే. వారియందు మాయా లేశములేదు. విశుద్ధాంతఃకరణమున వారు పవిత్రులు. వారియందు మోసము, కపటము సంభోగేచ్ఛ కొంచెమైనను లేవు. పాలుద్రావు పసి పిల్లలెంతో వారు నట్లే యమాయకులు, తండ్రి తపఃప్రభావముచే నుత్పన్నమైనవారు అల్పకాలమునకే యువకులైరి. వారు నమ్రతకలవారు. సుశీలురు. సరళస్వభావులు. వారు చేతులు జోడించుకొని బాలసులభ యమాయకత్వమునఁ దండ్రి నిట్లడిగిరి :- "జనకా! మే మేమి చేయవలయును."

తండ్రి కడు ప్రేమతో నిట్లనెను :- "వత్సలారా ! ఎదుట మీకు గనఁబడుచున్న దదేమి?"

వారిట్లనిరి :- "జనకా ! ఏమున్నదో మాకు తెలియదు"

దక్షప్రజాపతి అత్యంత మమతాస్వరమునఁ బ్రేమతో వారిని ముద్దిడుకొనుచు నిట్లనెను :- "మీరు చాల అమాయకులే? నాయనలారా ! ఇదంతయును సృష్టి. దీనిని వృద్ధిచేయ వలయునని భగవదాజ్ఞ నేనొక్కఁడను మిమ్ములను బదివేల మందినిఁ బుట్టించినట్లు మీరును నొక్కొక్కరు నొక్కొక్క పదివేలమందినిఁ బుట్టింప సమర్థులు. అట్లుచేసిన నెందఱో మనుష్యులయ్యెదరు. ఈ వన, శైల, కాననపూర్ణమగు పృథివి మానవులతో నిండిపోఁగలదు."

పిల్లలిట్లనిరి :- "మహారాజా, ఇంతమందిగాఁ బెరిగిన మన కేమి ప్రయోజనము ?"

దక్షుఁడు ప్రేమతో నిట్లనెను :- ఏమిప్రయోజనమా? అందఱును బుట్టి నదనదీవనపర్వతముల సమీపమున నిండ్లు కట్టుకొని నివసించెదరు. భగవత్ప్రీతిగ యజ్ఞయాగముల నొనర్చెదరు. గొప్పగొప్ప ఉత్సవములొనర్చెదరు, కథాకీర్తనానందము కలుగును. అందఱును బరస్పరము మాట్లాడు కొందురు. హృదయములు కలుపుకొని ప్రేమను బ్రకటించు కొందురు. భగవద్గుణాను నాదగాన మొనర్చెదరు. భగవచ్చర్చ కలుగును. దానివలన మీకు గొప్ప పుణ్యము లభించును."

హర్యశ్వులను నా పుత్రులిట్లనిరి. "ఇంతమందిని బుట్టించు శక్తి మా కెట్లు లభింపగలదు తండ్రీ!"

దక్షప్రజాపతి ప్రేమతో నిట్లనెను- "ఏ మానవుడును దనశక్తిచే నేమియును జేయజాలడు. అందఱకును శక్తినొసంగువాడా శ్రీహరియే. మీ రందఱును గలిసి ఆతని శరణువేడుడు అతనిని ఘోరతపస్సుచే బ్రసన్ను నొనర్పుడు. నేను ఘోర తప మొనర్చి భగవంతుని బ్రసన్న మొనర్చుకొంటిని. ఆతని యాజ్ఞప్రకారమే నేను వివాహ మొనర్చుకొని మిమ్ములనందరను బుట్టించితిని. ఇప్పుడు మీ రందఱును సృష్టిచేయవలెనను కోరికతో శ్రీహరి నారాధింపుడు."

హర్యశ్వు లిట్లనిరి- "తండ్రీ! మే మెచ్చటికి వెళ్ళి తప మొనర్పవలెను?"

దక్షప్రజాపతి యిట్లనెను- "మీ రిచ్చటనుండి పశ్చిమ దిశగాబోయి ఎచ్చట శాంత, ఏకాంత, స్వచ్ఛ, పవిత్ర, తీర్థ స్థానము గాంచెదరో, అచ్చటనుండి ప్రజావృద్ధికొరకై శ్రీహరి నారాధింపుడు."

హర్యశ్వులు తన తండ్రియాజ్ఞను శిరసావహించిరి. అందరును గ్రమముగ నాతని చరణములకు నమస్కరించిరి. ప్రదక్షిణముగా నందరును బశ్చిమదిక్కుగా వెడలిరి.

వారు వనోపవన పర్వతములను దాటుచు బోవుచుండిరి. ఫారిచిత్రవిచిత్ర సృష్టిని మిక్కిలి కుతుహలముతో జూచుచు

వెళ్ళుచుండిరి. వెళ్ళివెళ్ళి వారు పుణ్యనదియగు సింధునది సాగరములోఁ గలియుచోటకుఁ జేరుకొనిరి. ఆ కచ్ఛదేశమందు పరమ పవిత్రమగు నారాయణ సరోవరమను నొక పరమపుణ్య ప్రదమగు తీర్థము కలదు. ఆ తీర్థముః దేవ, సిద్ధ, చారణ, ఋషిముని గణముల చేతను, ఇతర పుణ్య పురుషులచేతను సేవింపఁబడుచుండును. అచ్చట సౌందర్యమునుగాంచి సోదరులందరు బరమ ప్రసన్నులైరి. వారు వెళ్లఁగానే తీర్థములో స్నాన మొనర్చిరి. స్నానము చేయఁగానే వారి శరీరములు పూలవలె దేలికయై చిత్తమునకు మిక్కిలి ప్రసన్నత గలిగెను. మార్గశ్రమ యంతయు నశించెను. అంతఃకరణములోని మాయి కమలము తుడుచుకొని పోయెను. వారిదివరకు శుద్ధచిత్తులరే. అయినను పితృసంసర్గముచేత, సంకల్పముచేత మనస్సున నుద్భవించిన యత్కించి త్ప్రవృత్తిమార్గ వాసనయుఁ దీర్ఘస్నానముచే నశించినది. వారి బుద్ధి పారమహంస్య ధర్మమున లగ్నమయ్యెను. వారికి సృష్ట్యాదియందు గల సృష్టి వృద్ధి లంపటముఁబడుట రుచింపలేదు. అయితే సృష్టి వృద్ధికై తపస్సు చేయవలయునని పిత్రాజ్ఞ. ఈ కారణముచే వార నిచ్ఛాపూర్వకముగ పిత్రాజ్ఞయని తపమునందుఁ బ్రవృత్తులైరి. మోక్షధర్మమున కధికారులైనవారీ క్షుద్రసాంసారిక విషయములందు మునిఁగి ప్రవృత్తిమార్గమందగ్ర సరులగుట నారదునకు రుచింపలేదు. ఆతఁడు వీరి కల్యాణమునకు మార్గమాలోచించు చుండెను.

సూతుఁడిట్లనెను- "మునులారా ! అడుగకున్నను యోగ్యులగువారిపైఁ గృపఁ జూపుటయే కృపాళులయొక్క స్వభావము.

వారు కృపఁజూపక యుండఁజాలరు. అందువలననే నారదున కిట్టి యిచ్ఛయుదయించినది. ఇఁక ముందు జరుగఁబోవు మనోరంజక సంవాదము మీరు దత్తచిత్తులరై శ్రవణము చేయుఁడు.

## హార్యశ్వులు నారదుని పది గూఢప్రశ్నలడుగుట

శ్లో॥ ప్రజావివృద్ధయే యత్తాఞ్ దేవర్షిస్తాఞ్ దదర్శహ ।
ఉవాచ చాథ హర్యశ్వాః కథ స్రక్ష్యథవై ప్రజాః ।
అదృష్ట్వాంతం భువోయూయం బాలిశాబత పాలకాః ॥

శ్రీ భాగ ౬ స్కం. ౫ అ. ౬ శ్లో.

వ. ... ... ... ... ప్రజాసర్గంబుకొరకుఁ దండ్రియను మతంబున నుగ్రతపంబు సేయుచుండ వారికడకు నారదుండు వచ్చి యిట్లనియె.

సీ. మీరతిమూఢులు మీఁదటిగతిగాన
రెన్నంగఁ బసిబిడ్డలన్నలార
పుడమి దానింతని కడఁ బరికింపరు
ప్రజలఁబుట్టింప నే ప్రతిభగలదు ?

శ్రీ మదాంధ్ర భాగవతము

ప్రపంచములో నెవరెట్టి ప్రకృతి కలిగియుందురో వారట్టి వారినే ప్రేమించుచుందురు. ప్రపంచములో నందఱును దనవంటి వార్తే యుండవలయునని కోరుకొనుచుందురు, తన మతమభివృద్ధి

చెందవలెనందురు. త్యాగులు అందరు త్యాగులుగ నుండవలెననియు రాగులందఱు నందరు రాగులుగ నుండవలయు ననియుఁ గోరు కొందురు. పిల్లలు నడుచుచుఁ బడిన, జారిన, బురదలో నిరుకు కొన్నను దయాళువులగువారు వారిని లేవఁదీసి విపత్తినుండి రక్షిం చెదరు. మంచి మార్గముకుఁ దీసికొనివచ్చెదరు. ఇట్లు చేయుట వారు స్వార్థమునకు, బారితోషికమునకు వశీభూతులై కాదు. వారి స్వభావము దారితప్పినవారిని సరియైన మార్గమునకుఁ దెచ్చుటయే.

శుకుఁడిట్లనెను- "రాజా ! దక్షప్రజాపతి యొక్క పదివేల మంది పుత్రులందరు విశుద్ధాంతఃకరణము కలవారనియు, వారిలో కించిన్మాత్ర మేర్పడిన మాయ నారాయణ సరోవర స్నానముచే తుడిచిపెట్టుకొని పోయినదనియుఁ దెలిసికొని బ్రహ్మలోకములో సంచరించు నారదుఁడు తెలిసికొనెను. ఇట్టి శుద్ధాంతః కరణము కలవారు పిత్రాజ్ఞలకు లోఁబడి సంసార బంధనమునఁ బడుట ఉచి తము కాదు. ఇంతటి అమాయకులు మాయలోఁబడగూడదు. సంసా రమనఁగానే భార్య అలిగి కూర్చుండును, భృత్యులపరాధ మొన ర్చెదరు. వారిపైఁ గోపపడవలసియుండును. పిల్లలు పుట్టనే పుట్టరు. పుట్టినను జబ్బుపడెదరు. అప్పుడు మందులు తీసికొనిరా మ్రాకులు తీసికొని రమ్మందురు. యంత్రములు, మంత్రములు, తంత్రములు చేయించవలెను. రాత్రింబవళ్ళు దిగులుకూడే. చింతల మూటను బుద్ధిపూర్వకముగ నెత్తికెత్తుకొనుటకే గృహస్థాశ్రమము యొక్క తాత్పర్యము. ఈ పిల్లలు పొరబడినారు, వీరిని దారికిదీసికొనిరా వలెను." అని అనుకొని మించిపోలేదని భావించి, ఆతనికేమియును

వాహనాదులవసరము లేదు కావున వెంటనే వీణను జేతఁబట్టుకొని క్షణములో నారదుఁడు నారాయణ సరోవర సమీపమునకుఁ జేరు కొనెను.

వీరితో ప్రజావృద్ధికై గృహస్థాశ్రమములోఁ బడవలదని చెప్పిన, పితాజ్ఞాపరిపాలనా ధర్మమునకుఁ గట్టుపడిన వీరు వినరు, వీరికింకొక విధముగఁ జెప్పవలయును. నేను వారితో సూటిగా, జెప్పక, తమంతటఁదామే యీ బంధమునుండి తప్పించుకొనునట్లే దైన నొక యుక్తినిఁ బన్నవలయునని నారదుఁడాలోచించి వారి కడకుఁబోయెను. వారందఱు స్నానమొనర్చి నారాయణ సరోవర జలమందు నిలుచుండి మంత్రజపము చేయుచుండిరి. అందరు గన్నుల మూసికొనుటచే నాతఁడు దగ్గరకువచ్చినను వారాతనినిఁ జూడలేదు. నారదుఁడు సర్వబ్రహ్మవిభూషితమగు వీణతో స్వర మును మీటుచునిట్లు కేకవేసెను. దక్షతనయులారా! హర్యశ్వు లారా! జయజయ శ్రీ సీతారామ! నమోనారాయణాయ.

ఇది వినఁగానే అందరు శీఘ్రముగ నాచమన మొనర్చి పరువిడివచ్చి నారదునకు నమస్కరింప మొదలిడిరి. ఒకరిద్దరైనచో ద్వరగాఁ దేలిపోయెడిదే. పదివేలమంది సైనికులవలె నేనుముందర నిన ప్రతివారును దామే ముందాయన పాదముల ముట్టవలయునని ఒకరి నొకరు నెట్టుకొనుచుండిరి. నారదుఁడు తన వీణను సవరించు కొనుచు నిట్లనెను- "అబ్బాయిలారా! నెమ్మది నెమ్మదిగాఁ బ్రణామ మొనర్పుఁడు. ఒకరినొకరు నెట్టుకొనకుఁడు." ఈ విధముగ నంద

రును బాదములఁ బ్రణమిల్లిన మీఁదట నారదుఁడు వారొసంగిన తృణాసనమున గూర్చుండి మిక్కిలి ప్రేమతోఁ గుశల ప్రశ్న లొనర్చెను.

కుశలప్రశ్నానంతరము నారదుఁడిట్లనెను- "నాయనలారా! మీ రందరును సోదరులు. సుకుమారులు మీ యా కృతి ప్రకృతులును, శీలస్వభావము, సదాచారము వేషభాషలు నొకేరీతిగనున్నవి మీరు మీ పితృగృహమును వీడి యీ యడవికేల వచ్చితిరి ? ఈ యూబినేలలో నేలఁదిరుగు చున్నారు."

వారిలో నొక్కరిట్లనెను - "స్వామీ! మేము పిత్రాజ్ఞచే సృష్టి వృద్ధిసేయగోరుచున్నాము. సృష్టి వృద్ధియైనచో నీ ప్రజలకుఁ బ్రజాపతులమై ప్రేమపూర్వకముగఁ బాలింప గలము."

నారదుఁడు నవ్వి యిట్లనెను - "ప్రజాపాలన మనునది బుద్ధికి సంబంధించినది కావున ననుకొనవచ్చును గాని యూరక మాటలతోనగునా ?"

వారిట్లనిరి - "లేదు స్వామీ! ప్రజాపాలనమునకు గొప్ప బుద్ధికావలెను."

అంత నారదుఁడు నవ్వి యిట్లనెను - "అట్లయిన మీరు ప్రజాపాలన మెట్లొనర్పగలరు ? మీ రందరును బ్రజాపతులని చెప్పుకొందురు కాని అందరును నిరర్థకులే. ఈ భూమి యెంత వరకున్నదో దాని నంతను జూడనిది, తెలియనిది మీరు దీనినెట్లు

పాలింపఁగలుగుదురు ? సంపూర్ణ భూమండలమును జివర వరకుఁ జూడుఁడు.''

ఇదివిని హర్యశ్వులు విచారమునఁబడిరి. పాపమువారు సరళచిత్తులు కావున వారిట్లనిరి :- ''స్వామీ ! ఈ పృథ్వీమండలము యొక్క అంతమును మేముచూడలేదు.''

నారదుఁడు రోషస్వరమున నిట్లనెను :- ''ఏమిచూచితిరి మీరు మట్టిని! పృథివియేదియో తెలియకుండిన మీరేమివస్తు వని ప్రేమించెదరు? ఒక పాదము విశ్వబ్రహ్మాండమున్నది. దీని కావల విశుద్ధత్రిపాద్విభూతికలదు. ఏమియును దెలియకయే సృష్టితత్పరు లైతిరి. దీనివలన నేమిప్రయోజనము? మంచిది. నేను మీ బుద్ధిని బరీక్షించుటకు మిమ్ములను బది ప్రశ్నల నడిగెదను. వాటికి విచారించి సమాధానము చెప్పగలుగుచో మీరు సృష్టిచేయఁగలరని నమ్మవచ్చును."

సూతుఁడిట్లనెను :- ''మునులారా! ఈ పరీక్షనొసంగుట అన్నిటికంటె నధిక సందేహాస్పదమగు కార్యము. అడుగడుగున కును సందేహమే. ఇదివఱకు పరీక్షనిచ్చినవాఁడే దీని యనుభవమును జక్కఁగాదెలిసికొనఁ గలుగును. భగవంతుఁడే విపత్తునైనఁ దెచ్చుఁ గాక పరీక్షాబంధములోఁ బడవేయకుండుఁ గాక! పరీక్షలో నుత్తీర్ణులగువారు పడిపోయెదరు అనుత్తీర్ణులగువారు రెంటికినిఁజెడిన రేవడలగుదురు అట్టివారెల్లప్పుడును విచారములోమునిఁగియుండవలసినదే.

శుకమహర్షి యిట్లనెను :- ''రాజా! నారదుఁడు వారికి పరీక్షసూచన నీయఁగా, వారు చేతులు జోడించుకొని పరీక్షనొసంగుటకు

సన్నద్ధులై వారిట్లనిరి :- మీరు మమ్ములనేమి యడుగఁదలఁచితిరో అడుగుఁడు"

ఇదివిని నారదుఁడు గంభీరుఁడై యిట్లడిగెను "నా మొదటి ప్రశ్న యేమనఁగా మీరీభూమికి అంతమును జూచినారా?'

వారందఱును చేతులు జోడించుకొని యిట్లనిరి :- "లేదు స్వామీ ! మేమీభూమి యంతమును జూచియుండలేదు."

అంత నారదుఁడిట్లనెను :- "అట్లైన మీ రెట్లు సృష్టి కావింపగలరో యీ విషయమును మీ బుద్ధులతో నాలోచింపుఁడు. నాకు ఇప్పుడు నా రెండవ ప్రశ్నకు సమాధానమీయవలయును. నాకు చతుర్దశ భువనములందు నవ్యాహతగతిగలదని మీ రెఱిగినదేగదా! ఒకసారి నేనొక గొప్ప దేశమునకు వెళ్లితిని. అంత గొప్ప రాష్ట్రములో నొక్కఁడే పురుషుఁడు కలఁడు. ఆతనిని మీరు రాజనుఁడు ప్రజయనుఁడు మంత్రి యనుఁడు పురోహితుఁడనుఁడు స్త్రీ పున్నపుంసకులలో నెవరైననను‌ఁడు మీరా రాష్ట్రపతియగు నేకైక అద్వితీయపురుషు నెఱుగుదురా?''

హర్యశ్వులిట్లనిరి :- "మేమా రాష్ట్రపతి నెఱుఁగము ఆతనిని మే మెట్లు తెలిసికొనఁగలము?''

నారదుఁడు రోషమున నిట్లనెను :- మీ రిట్టి బుద్ధి బలముతో డనే ప్రజావృద్ధిచేయ సాహసించుచున్నారు. ఆతనిని దెలియకున్న నన్నియు వ్యర్థములే ఇప్పుడు నా మూఁడవ ప్రశ్నకు జవాబొసగుఁడు నేనొకసారి ఒకబిలమునఁ బ్రవేసించితిని దానిలో నింకను జాలమంది జీవులు ప్రవేసించిరి. నేను బ్రవేసించితిని

గాని దానిలో నిరంతరము భ్రమించినను దానిలోనుండి బయటకు వచ్చుటకు మార్గముదొరకలేదు. ప్రవేశించినవాఁడు తిరుగుచునేయుండును తిరుగుటకు మార్గముబిలములోఁ కలదుగాని బయటకువచ్చుటకు మార్గముమిక్కిలి కఠినమైనది. మీరిట్టి బిలమును గాంచితిరా?"

హర్యశ్వులిట్లనిరి:- "లేదుప్రభూ ! మేమాబిలమును జూడనేలేదు."

నారదుఁడు ప్రేమతోనిట్లనెను- "నాయనలారా! ఆ బిలము యొక్క మర్మమును దెలసికొనక మీరుసృష్టిచేయుట వ్యర్థము. దానిలో మహత్వమేమియునులేదు, ఇప్పుడు నానార్థవప్రశ్నకు జవాబొసంగుఁడు నేనొక స్త్రీనిఁజూచితిని ఆమెక్షణక్షణము రూపమును మార్చుచుండును. ఒక్కొక్కప్పుడు నీలిచీరె కట్టుకొనును. ఇంకొక్కప్పుడెఱ్ఱని మేలి ముసుఁగును వేసికొనును మరొకప్పుడు కొంగరెక్కవలె స్వచ్ఛమగు తెల్లనిదుప్పటిని గప్పుకొనును. ఒక్కొక్కప్పుడు వెండ్రుకలతో జారుజడవేసికొనును ఇంకొక్కప్పుడు ఉంగరములుతిరిగిన వెండ్రుకలను విరియఁబోసికొనును. ఒక్కొక్కప్పుడు వెనకవెండ్రుకలను గత్తిరించుకొని నూతన ఫ్యాషను ప్రచారము కావించును. మరొక్కప్పుడు ముసుఁగు వేసికొనును ఒక్కొక్కప్పుడు చంద్రునివలె ముఖమును విప్పును ఇంకొక్కప్పుడు శిరమున ముసుఁగును వేసికొనక నిర్లజ్జయైస్వచ్ఛందముగ దిరుగును ఒక్కొక్కప్పుడు కాటుక, బొట్టు, సురమా పెట్టుకొనును మరొకప్పుడు వేశ్యయగును ఇంకొక్కప్పుడు కులవతివలె నభినయించును. ఒకయెడ నవ్వును, ఇంకొకయెడ నాడును, మఱొక

ప్పుడు గానమొనర్చును ఒక్కొక్కప్పుడు తినును. ఇంకొక్కప్పుడు త్రాగును, క్షణక్షణమునకు, నిమిషనిమిషమునకు రూపమును మార్చుచుండును బహు రూపిణియగు బాలలనను మీ రెన్నఁడైనను జూచియుంటిరా?''

హర్యశ్వులిట్లనిరి :- ''స్వామీ! ఆమె మాయెదుట కెన్నడును రాలేదు?''

నారదుఁడు గద్దించి యిట్లనెను :- ''ఓరీ! మీరు వెఱ్ఱివారివలె నున్నారే.'' ఆ మోసకత్తె యెవ్వరికిని సిగ్గుపడదు. అందఱ ముందఱ నాడును, మీరామెను జూచుచుండియుఁ జూడలేరు ఇదియే మూర్ఖత ఇఁక అయిదవ ప్రశ్నను వినుఁడు. తానే గొప్ప కులీనుఁ డననియు, సదాచారుఁడననియుఁ బిలువఁబడు నొక పురుషునిఁ గాంచితిని. కాని యాతని భార్య ఆతని ముందే వ్యభిచార మొన రించును. అతఁ డెప్పుడును దీనినిఁ జూచుచుగాని యేమియు ననఁడు.''

హర్యశ్వులిట్లనిరి :- ''స్వామీ! మేమిట్టి నర్లజ్జపురుషు నెన్నడును జూడలేదు.''

నారదుఁ డిట్లనెను:- ''అయితే మీరేమియును జూడలేదు. నా ఆఱవ ప్రశ్నకైనను సమాధానమీయఁ గలిగన నిండు. నేనొక నదినిఁజూచితిని అది ఉత్తరమునకు బ్రవహించును దక్షిణమునకును బ్రవహించును దాని నెన్నడైన మీరు చూచితిరా?''

హర్యశ్వు లాశ్చర్యచకితులై యిట్లనిరి :- ''స్వామీ!

మీ రెట్టిప్రశ్నలు వేయుచున్నారు. నదులన్నియు నుత్తరము నుండి దక్షిణమునకుఁ బ్రవహించుట మేముగాంచితిమి; కాని రెండు వైపుల బ్రవహించు నుభయవాహినీ నదిని మేమెన్నఁడును జూడలేదు."

నారదుఁడిట్లనెను- "మీరిప్పటికింకను బాలురు, అపక్వబుద్ధులరు. సత్యహృదయులు. ప్రియులారా! ఈప్రశ్నలను మననము చేయుఁడు విచారించుడు ఇఁక నాయేడవ ప్రశ్నను వినుఁడు. నేనొక సుందర చిత్రవిచిత్రరంగులుగల ఇరువదైదు తత్వములచేఁ జేయఁబడిన గృహమునుగాంచితిని. జీవిదానిలోఁ బ్రవేశింపఁగానే యదార్థ తత్వముమరచిపోవును. మీరు దానినిఁ జూచితిరా? అది యేదియో చెప్పుడు."

హర్యశ్వులాలోచించి యిట్లనిరి - "స్వామీ! చూచియుండవచ్చును. కాని యిప్పుడు జ్ఞాపకములేదు."

నారదుఁడిట్లనెను- "ఇదియేయజ్ఞానము. అందకనియే యీ యల్పబుద్ధి సహాయమున మీరెట్లుసృష్టి చేయఁగలరు? ఇప్పుడు మా యెనిమిదవప్రశ్నకుఁ బ్రత్యుత్తర మొసంగుఁడు. చిత్రవిచిత్రములగు ననేక రంగులుగలిగి దగ్గఱనే యెగిరెడు హంసను మీరుచూచితిరా?"

హర్యశ్వులిట్లనిరి- "కృపానాథా! మేము తెల్లనిహంసలను జాలఁగ జూచితిమి కాని చిత్రవిచిత్రములగు రెక్కలుగలిగినహంసను మేమింతవరకు చూడలేదు."

నారదుఁడిట్లనెను- "నాయనలారా! చూచుచుండియును

జూడకపోవుటయే మూర్ఖత. దీనినే యజ్ఞానమందురు. అజ్ఞానుల శిరస్సునఁ గొమ్ములు, తోఁక. నాలుకాళ్లుండవు. కాని పశుసమానుఁడే. ఇప్పుడు నాతొమ్మిదవ ప్రశ్నకు సమాధానమొసంగుడు."

తనంతటదానుదిరుగు నొకచక్రము కలదు. అది వజ్రముతోఁ జేయఁబడినది. మిక్కిలి తీక్ష్ణమైనది. ఒకప్పుడునుఆగదు."

హర్యశ్వులిట్లనిరి – "దయాసాగరా ! మేమాచక్రమును జూడలేదు."

నారదుఁడిట్లనెను – "మీరు వట్టిబండలవలెఁ గనఁబడుచున్నారే ! మీరు సర్వజ్ఞుడగు మీతండ్రియొక్క వాస్తవికాజ్ఞను అర్థముచేసికొన్నారా! లేదా?"

హర్యశ్వులిట్లనిరి– "స్వామీ! మాతండ్రి సర్వజ్ఞుఁడగునో కాఁడో మాకుతెలియదు. మాకొసగిన యాజ్ఞవాస్తవికమో అవాస్తవికమోకూడ మాకుతెలియదు. ఆతఁడు సృష్టివృద్ధి కావించుటకై తపమొనర్పనాజ్ఞాపించెను.దానినిఁ బరిపాలింప మేమిచ్చటకువచ్చితిమి."

నారదుఁడిట్లడిగెను–"దక్షుఁడు మీకు నిజమగు తండ్రికాఁడు. నిజమగుతండ్రి వేరుఁగగలఁడు, తపమును దరువాత చేయవచ్చును గాని ముందుగా నా యీ పదిప్రశ్నలనుగూర్చి విచారింపుడు. మీరు ప్రశ్నలనువింటిరి. ఇఁకనిప్పుడేకాగ్ర చిత్తులరై మననముచేయుఁడు. నిదిధ్యాసన మొనర్పుఁడు చివరకేనిర్ణయమునకు వచ్చెదరో దానిని యథార్థమగు తండ్రియొక్క వాస్తవికాజ్ఞయని తెలిసికొని చేయుఁడు."

శ్రీశుక దేవుఁడిట్లనెను–"రాజా! నారదుఁడిట్లుచెప్పి, తనవీణను దీసికొని రామకృష్ణగుణగాన మొనర్చుచుండెను. అమృతబీజములను నాటి నివృత్తుఁడయ్యెను. ఫలించినఁ దినిఆనంద నిమగ్నుఁ డగుటయే తడవు.

## నారదుని కూటవచనములపై హర్యశ్వుల విమర్శ

శ్లో॥ తన్నిశమ్యాథ హర్యశ్వా ఔత్పత్తిక మనీషయా!
వాచః కూటం తు దేవర్షేః స్వయం విమమృశుర్ధియా॥

శ్రీ భాగ. ౬ స్కం. ౫ అ. ౧ శ్లో॥

వ......అని నారదుండు బోధించిన హర్యశ్వులు సహజ బుద్ధిచేత నారద వాక్యంబులఁ దమలో నిట్లని వితర్కించిరి."

శ్రీమదాంధ్ర భాగవతము.

సద్గురువు ప్రత్యక్షముగ నుపదేశము తక్కువగనొసంగును. యోగ్యుఁడు, బుద్ధిమంతుఁడు, అధికారియునగు శిష్యునకు సంకేతముగ నీయఁబడిన ఉపదేశమును గ్రహించును. ఒక కథగలదు. దేవతలు, అసురులు, మనుష్యులు కలిసి లోకపితామహుఁడగు బ్రహ్మకడకుఁబోయి మాకు సర్వోత్తమోపదేశ మొసంగుడని యడిగిరి. బ్రహ్మ యిదివిని మూఁడుసార్లు ద, ద, ద అనెను.

అధికార భేదమునుబట్టి వారాయాయర్థములను దీసికొనిరి. దేవతలు సాధారణముగ నజితేంద్రియులుగ నుందురు. గావున బ్రహ్మ వారికి 'దమ'ము నాశ్రయింపవలయునని యుపదేశించినట్లర్థము గ్రహించిరి. అసురులకు బ్రాయికముగ దయయుండదు కావునఁ దమకు వివరించి 'దయ'ను ఉపదేశించెనని అర్థముచేసికొనిరి. మానవులు సాధారణముగ ఫలహేతువుచేఁ గృపణులై పనులుచేయుచుందురు కావున హంసవాహనుఁడు వారికి "దానము" నుపదేశించెనని అర్థముచేసికొనిరి. ఇదేవిధముగఁ దమబుద్ధిచే విమర్శచేసుకొని, ఎవరెట్టియధికారులో ఆయా యధికారమునకుఁ దగినట్లర్థమునుదీసికొందురు. అధికారుల కుపదేశించుట వ్యర్థము; ఆతఁడెన్నటికిని దానిని గ్రహింపఁడు.

శుకమహర్షియిట్లనెను- "రాజా! గూఢాభిప్రాయముగ మాట్లాడిన నారదుని కూటవచనములవిని హర్యశ్వగణము తమయొక్క స్వాభావిక విచార శీలబుద్ధిచేఁ బునఃపునః అర్థవిచారము చేయసాగిరి. వారిప్పుడు ప్రజావృద్ధికై తపమొనర్పవిస్మరించి, దేవర్షినారదుఁడు మధ్యలోవచ్చి యిచ్చిన పదిప్రశ్నలకు సమాధానము నాలోచించుచుండిరి.

వారిట్లాలోచించిరి - "మీరు పృథివియొక్క అంతమును జూడక ప్రజలనెట్లు సృష్టించెదరని నారదుఁడనెను. ఆతని యభిప్రాయమున నీపృథివి యననేమి? అంతము చూచుటేమిటి? ప్రజాసృష్టియననేమి? విచారణ చేయఁగా జేయఁగా వారిశుద్ధాంతః కరణమిందీవిషయముల కర్థము ప్రస్ఫుటితమయ్యెను. షోడశకళాయు

క్తుఁడగు జీవునిలింగ శరీరమేభూమి. ఇదియే నిత్య శుద్ధముక్త స్వరూపమగునాత్మకు అనాదిబంధనము. దీనినంతము జూడ కున్నంతవరకును, దీనిపరిణామము దెలిసికొన నంతవరకును అనఁగా, గర్మనాచరించుటచే నెనుఁబదినాల్గులక్షల జీవస్థానములను సిద్ధము చేసుకొనుచున్నట్లే కావున నాకర్మ మోక్షమునకుపయోగింపదు. కావున దానినాచరించుటచే లాభమేమికలదు? కావున మనము ముందుగా జీవబ్రహ్మ వివేచనమొనర్చి యీకర్మ యథార్థస్వరూపము దెలిసికొనవలయును ఇదియేవీణాపతియగు నారదుని ప్రథమ గూఢ ప్రశ్నయొక్క భావార్థము.

దేవర్షినారదుని రెండవప్రశ్న యేమనఁగా 'ఒకానొక రాష్ట్రములో నొక్కఁడే పురుషుఁడుకలఁడు" అదియెవరని. రాష్ట్రమనఁగా నీనానారూపములాగఁ గనఁబడుజగత్తు. ఇందుఁ గనఁబడు విభిన్నత్వము భ్రమ. వాస్తవమున సర్వత్ర ఆయీశ్వర తత్త్వమొక్కటే వ్యాపించియున్నది. "ఏకమేవా ద్వితీయమ్." బ్రహ్మతప్ప వేరువస్తువులేనేలేదు ఈజగద్రూపమగు రాష్ట్రమందు బ్రహ్మయను పురుషుఁ డొక్కఁడేకలఁడు. అజ్ఞానియై సత్కార్యము లొనరించుచుండుట వ్యర్థము కావున మునుముందుగ నాజాగ్రత్స్వప్నాది సమస్తావస్థలకు సాక్షియై, స్వాశ్రయముననే యుండువాఁడు, స్వయంప్రకాశుఁడు, ప్రకృతి కతీతుఁడు, నిత్యముక్త శుద్ధ, బుస్వరూపమగు నాపరబ్రహ్మనే తెలిసుకొనవలెను. ప్రాథమిక కార్యములలోఁ బ్రవృత్తినిఁ జెంది యుండుటవలన లాభము లేదు.

నారదుఁడు చెప్పినమూఁడవ విషయమేమనఁగా- "ఒకా నొకబిలముగలదు. దానినుండి బయటకువచ్చు మార్గము లేదు యథార్థముగ నాబిలమేది? వారాలోచించి యిట్టినిష్కర్షకు వచ్చిరి. "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతీ" బ్రహ్మవిత్ బ్రహ్మయే కాగలఁడు అబ్రహ్మ రూపమను బిలములోనికి వెళ్ళితిరిగిరాఁడు. అనఁగా వానికిఁ బున రావృత్తి సమాప్తమైనదన్న మాట. భగవంతుని పరమధామమునకు వెళ్ళిన తర్వాత నెవఁడును దిరిగిరాఁడు. ఆ బ్రహ్మ రూపమగు బిలము దెలిసికొను కార్యము లను గాక అన్యకార్యము లొనర్చుట అనుచితము,

నారదుఁడడిగిన నాల్గవ విషయమేమనఁగా - బహురూపము లనుధరించు నొకానొక స్త్రీకలదు అది యీబుద్ధియే. ఇది నానావిధ రూపములను ధరించి జీవితమును భ్రమలోఁ బడవేయును కృష్ణ వర్ణము, శ్వేతవర్ణముగల మేలిముసుఁగుల ధరించుననఁగా నీబుద్ధి గుణమయమైజీవుని నొకజన్మనుండి మరియొక్క జన్మమునకుఁ ద్రిప్పుచుండును. సూక్ష్మదర్శియగువాఁడు దీనినిఁ బూర్ణముగఁ దెలిసికొనక వృద్ధిరూపమగు నసత్కార్యములందు లగ్నమగుట బశుత్వమే కాఁగలదు.

నారదుని అయిదవ ప్రశ్న యేమనఁగా :- "వ్యభిచారిణీ స్త్రీయొక్క పతితో మీకు పరిచయమున్నదా ?" ఈ వ్యభిచారిణి స్త్రీ గుణమయయగు బుద్ధియే. ఈమెకు పతి మాయా మోహితజీవి,

ఆత డీమె సంసర్గముచే - సంగదోషమునఁ బతితుఁ డయ్యెను. స్వస్వరూపము మఱచెను. తన పద ప్రతిష్ఠ బోఁగొట్టుకొనెను, ఐశ్వర్యభ్రష్టుఁడై ఆతఁడు దానికి లొంగిన కింకరుఁడయ్యెను. అది యెట్లు చెప్పినటనట్లు చేయుచుండును. అది సుఖముగ నుండినఁ దాను సుఖపడినట్లు భావించును. అది దుఃఖించినఁ దాను దుఃఖించు చున్నట్లు భావించును. ఇట్టి స్వైరిణీ పతియగు మాయామోహిత జీవుఁడు తన స్వస్వరూపము యథార్థముగఁ దెలిసికొనఁ జాలనంత వరకు మానవుఁడీ ప్రపంచమున వివేక శూన్యుఁడై మిథ్యా కర్మ కలాపములందు బడిన నేమిలాభము ? అసత్కార్మము లొనర్చుటచే నసల్లోకములే లభించును."

దేవర్షి నారదుని ఆఱవ ప్రశ్న ఏమనగా:- "మీరు రెండు వైపులను బ్రవహించు నది నెరుఁగుదురా!" ఈ మాయయే ఉభయ వాహినీనది ఈ మోహినీ మాయవలననే యీ జగత్తు యొక్క యుత్పత్తి సంభవించుచున్నది. దీని ద్వారముననే సంహార కల్ప నయు సంభవించుచున్నది శబ్ద, స్పర్శ, రూప, రస, గంధజన్య ములగు నిహలోక సుఖములు విమాన అప్సర, సుధా, కల్ప వృక్షాది పారలౌకిక సుఖములు మాయ నరితా ప్రవాహములే. ఇది నిరంతరము విశ్రాంతిలేకయే వేగముగఁ బ్రవహించుచుండును ఈ నదిని గూర్చి యథార్థముగఁ దెలిసికొనఁ జాలనివారు, తెలియని వారై ఉన్మత్త గజమువలెఁ దీనిలోఁ బ్రవేశించి క్రీడింతురు. వాని నీనది తన ప్రబల వేగముచేఁ దీక్ష్ణప్రవాహమ లోనికిఁ గొనిపోవును ఇట్టి ప్రమత్త పురుషుని కార్యములవలన నేమి లాభము ?"

నారదుని యేడవ ప్రశ్న యేమనఁగా :- "మీరు ఇరువ ద్దైదు పదార్థములచేఁ జేయఁబడిన విచిత్ర గృహమును జూచితిరా?"

ఈ పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, పంచ భూతములు, పంచ తన్మాత్రలు, మనస్సు, బుద్ధి, అహంకారము, ప్రకృతి పురుషుఁడు నీ యిరువదైదు పంచ వింశతి (౨౫) తత్త్వములు. ఈ పంచ వింశతి తత్త్వములకు అద్భుతమగు నాశ్రయము అంతర్యామి పురుషుఁడు. కార్యకారణ సంఘాతమున కధిష్ఠాతయగు నాపురుషుని సత్స్వరూపము నెరుఁగక వ్యాపారమునఁ బ్రవృత్తమగుటకే అసద్వ్యాపారమని పేరు. అట్టి అసద్వ్యాపార మొనర్చుటచేఁ బ్రయోజనమేమియు నుండదు.

దేవర్షి యెనిమిదవ ప్రశ్న యిది :- "చిత్ర విచిత్రముల ఱెక్కలుగల హంసను జూచితిరా?" ఈ శాస్త్రమే చిత్ర విచిత్రముల హంస. దీని ద్వారానే ప్రవృత్తిమార్గ జ్ఞానము నివృత్తిమార్గ జ్ఞానమును గలుగును. దీనివలననే బంధమోక్ష వివేకము కలుగును. ఈశ్వర ప్రతిపాదితమగు శాస్త్రములను బరిత్యజించి కామ్యభావముచేఁ గర్మప్రవృత్తుఁడగుచో సిద్ధి కలుగఁజాలదు. వానికి సుఖముగాని, పరమ గతిగాని లభింపదు. ఇది జడము, ఇది చైతన్యమనియు, ఇది గ్రాహ్యము, ఇది త్యాజ్యము, ఇది జ్ఞేయము, ఇది ప్రేయము, ఇది విధి, ఇది నిషేధమనియుఁ జెప్పినవి శాస్త్రములు. వీని జ్ఞానము లేక బహిర్ముఖకర్మ లొనర్చుటవలన లాభమేమి కలదు? కార్యాకార్య వ్యవస్థకు ప్రమాణము శాస్త్రమని భగవదాజ్ఞ.

నారదుని తొమ్మిదవ ప్రశ్న యిది - "మీరు వజ్రముతోఁ జేయఁబడి స్వయముగఁ దిరుగు చక్రమును గాంచితిరా ?" ఇది నిరంతరము అవిశ్రాంతిగాఁ దిరుగు కాలచక్రమే. ఇది సమస్త జగత్తునుఁ ద్రిప్పుచున్నది. ఇది అన్నిటి నాకర్షించుచున్నది. ఇది అతి స్వతంత్రమై పరమ దుర్నివారమై, యెన్నడును వ్యర్థముకాని తీక్ష్ణచక్రము. దీని విధినిఁ దెలిసికొనక కర్మలందుఁ బ్రవృత్తినిఁ జెందుట సర్వమునర్పించి దుఃఖమును గొనుటయే.

దేవర్షి యొక్క దశమప్రశ్న యిది- "మీరు సర్వజ్ఞుఁడగు వాస్తవిక తండ్రియొక్క ఆజ్ఞను దెలిసికొనక ఆతని కనురూపమగు సృష్టి నెట్లు చేయఁగలరు ? శాస్త్రమే వాస్తవికమగు తండ్రి. ఇందు బ్రహ్మవాక్యములు కలవు. కాని అవి యాతని వాస్తవికాజ్ఞలు కావు. నివృత్తి పరమగు వాక్యములే శాస్త్రముయొక్క ముఖ్యోద్దేశ్యము. ఆ నివృత్తి వాక్యములను దెలిసికొనక గుణములపైఁ బ్రీతినుంచువాఁడు నివృత్తి మార్గమునఁ బ్రవృత్తుఁడెట్లు కాఁగలఁడు ?"

శుకుఁ డిట్లనెను - "రాజా ! ఇట్లాలోచించి వారందరును నారదుని కడకుబోయి చేతులు జోడించి యిట్లనిరి - "మహర్షీ ! మాకు నివృత్తిమార్గదీక్ష నొసంగుఁడు. శాస్త్రమర్మమును జెప్పిన నిజమగు చంద్రులు మీరే."

నారదుఁ డిందులకే వచ్చెను కావున నిట్లనుకొనెను - "బాగున్నది. ఒక్కసారిగా పదివేలమంది శిష్యులు లభించిరి." అని

వారందరకుఁ గౌపీనములొసఁగి సాధువుల నొనర్చెను. వారు శ్రద్ధాభక్తులతో గురుదేవునకుఁ బ్రదక్షిణము గావించి ఆతని యాజ్ఞచే మోక్షమార్గమును బట్టిరి. అందులో నొక్కఁడును దిరిగిరాలేదు. తనపని నెరవేరినందులకు నారదుఁడు సంతసించి వీణమీఁటుచు వెడలిపోయెను.

## పుత్రవియోగ దుఃఖితుఁడగు దక్షుఁడు మరలఁ బుత్రోత్పత్తి కావించుట

శ్లో॥ నాశం నిశమ్య పుత్రాణాం నారదాచ్ఛీలశాలినామ్
అన్వతప్యత కః శోచన్సుప్రజస్త్వం శుచామ్ పదమ్ ॥
సభూయః పాంచజన్యాయామజేన పరిసాన్త్వితః ॥
పుత్రానజనయద్దక్షః శబలాశ్వాన్సహస్రశః ॥

శ్రీ భాగ. ౬ స్కం. ౫ అ. ౨౩, ౨౪ శ్లో॥

క. అప్పుడు దక్షుఁడు దనయులఁ
దప్పి మహాపథముగనుటఁ దగ నారదుఁడే
చెప్పినఁ గప్పిన శోకము
ముప్పిరి గొని చిత్తవృత్తి మూరింబోవన్ ॥

చ. అడలుచునున్న వచ్చి కమలాసనుఁడూఱడిల్లఁగబల్కి మున్
పడసిన లీలఁబుత్రుల నపారగుణాఢ్యులఁ గాంచుచున్న నా
పడతుకయందు బల్వురను బన్నుఁగడా శబళాశ్వసంజ్ఞులన్
బెడఁగగువారిఁ బుణ్యములఁ జేర్చినవారి సహస్ర సంఖ్యలన్

శ్రీ మదాంధ్ర భాగవతము

ఆశాభంగమగుటచే గొప్ప దుఃఖము. తన ఆశాలత పల్లవిత, పుష్పిత, ఫలితమగుటను గాంచుటయే గొప్పసుఖము సుపుత్రునియందు మనము వివిధములగు నాశల బెట్టుకొందుము. ఆతని భవిష్యదున్నతిని మనస్సులో నుంచుకొని వివిధ మనోరథములను బెట్టుకొందుము. అట్టి పుత్రుఁడు మరణించినను, నెచ్చటకైన గృహమువదలి వెళ్ళిపోయినను మనోరథములన్నియు విఫలములగును. ఆ సమయమున చిత్తమునకు మిక్కిలి క్లేశముకలుగును. ప్రపంచమంతయు శూన్యముగఁ దోఁచును. ఏపనిమీఁదకు మనస్సుపోదు. మనస్సునఁ జింత వ్యాపించును.

శ్రీశుకమహర్షి యిట్లనెను - "రాజా! దక్షుని పదివేల మంది పుత్రులు హర్యశ్వులనువారందరును సన్న్యాసులైరి. నారదునికడ దీక్షనుఁగొని మరల నెచ్చటికిని సంసారమార్గమునకుఁ దిరిగిరాని మార్గము బట్టిరి. కొన్నాళ్ళ వరకు తాతఁడు తన పుత్రుల కొరకు ప్రతీక్షించుచుండెను. తీర్థ యాత్రలొనర్చుచు నొకనాఁడు ఋషులు మునులు దక్షమహారాజుకడ కేతెంచిరి. కుశల ప్రశ్నలు

కాఁగానే దక్షప్రజాపతి యిట్లడిగెను- "మునులారా! పరమసుశీలురు గొప్ప ధార్మికులునగుఁ బదివేలమంది పుత్రులు తపస్సు చేసికొనుట కిచ్చటనుండి పశ్చిమ దిశగాఁబోయిరి. ఇంతవరకేలకో తిరిగిరాలేదు మీరీపృథివినంతయుఁ దిరుగుచుండెదరు. మీరెచ్చటనైన నా పుత్రుల చూచియుండినచో వారి సంగతిని నాకుఁజెప్పుఁడు వారెప్పటికి తిరిగి రాఁగలరో తెల్పుఁడు."

ఆ మునులలో నందరకంటె వృద్ధుఁడగు ముని గంభీరుఁడై యిట్లనెను- "రాజా! ఇప్పుడు నీ వాపుత్రులయాశ వీడుము. మరలఁ దిరిగిరాని మార్గమునకు వారందఱును బోయిరి."

ఇది విని యాశ్చర్య స్వరమున దక్షుఁడిట్లనెను- "స్వామీ! ఇట్లు పలుకుచుంటిరేల ? మీరు నా పుత్రుల నెచ్చటఁ గాంచితిరి ? వారికెట్లు మృత్యువు సంభవించినది ?"

వెంటనే ముని యిట్లనను- "రాజా! వారు మృతులుకాలేదు అమృతులైనారు. వారు మృత్యువును గూడ త్రొక్కివేసినారు. వారందఱు మోక్షధర్మావలంబులైనారు. వారందఱు తలలు బోడులు చేసికొని, కౌపీనము ధరించి సన్న్యాసులైరి. నారదుఁడు వారంద రకు గొఱిగించినాఁడు. వారిలో నొక్కనికైనను సృష్టిచేయవలయు నను బుద్ధి లేదు. రాజా! ఇప్పుడు నీవు వారు తిరిగివచ్చెదరను నాశను వదలుకొనుము."

ఇది విని దుఃఖిత మనస్కుఁడై దక్షుఁడిట్లనియె :- "స్వామీ మీరిది యెవరినోటనైన వినియున్నారా లేక ఎచ్చటనైన స్వయముగఁ జూచినారా? నారదుఁడు నా యెడల ఘోర అన్యాయ మొనర్చినాఁడు. ఆతఁడు నా మీఁద నేజన్మ పగనో తీర్చుకొనుచున్నాఁడు నేనతని కేమియు హానియొనర్ప లేదే"

దక్షప్రజాపతియొక్క యీ మాటలను విని యా వృద్ధ ముని యిట్లనెను :- "రాజా ! నీవింతటి జ్ఞానివి, ధ్యానివి, బుద్ధిమంతుఁడవయ్యు నిట్టి పొరపాటుమాటలు మాటాలాడెదవేల ? నారదుఁడు వారికి గొప్ప యుపకార మొనర్చినాఁడు. మీ కులము దరింపఁజేయుటచే నాతఁడు నీకును ఉపకార మొనర్చినాఁడు. మహా రాజా! నీవు దీని విషయములోఁ జింతించుట గాని సందేహించుట గాని పనికిరాదు. నారాయణ సరోవరమున నారదునివలన వారు దీక్షనుగొనుట మేము స్వయముగఁగాంచితిమి. మేము చూచుచుండఁ గనే వారు తమ యమూల్య వస్త్రములను విసరి యావలఁబారవైచి కౌపీనములను ధరించిరి. మా సమ్ముఖముననే వారు నమో నారాయణాయ నమో నారాయణాయ యని పఠించుచు నారదునకుఁ ప్రదక్షి మొనర్చి వెడలిపోయిరి." అని యిట్లు చెప్పి, దక్ష ప్రజాపతిని వివిధముల నోదార్చి యాతనిచే సత్కారములను బొంది మునిగణము వెడలిపోయిరి; కాని దక్షునిమనస్సునకు శాంతి లభింపలేదు. ఆతఁ డెల్లప్పుడు చింతగానుండెను. ఇప్పుడతఁడు సృష్టికార్యా పధాఋష్యుఖుఁ

డయ్యెను. ఓసనిగాంచి బ్రహ్మలోకమునుండి లోకపితామహుఁడగు బ్రహ్మ హంస నెక్కి దక్షునోదార్చ నాతని సమీపమునకు వచ్చెను.

లోకపితామహుఁడు ఆకాశమార్గమునుండి తనవైపునకు దిగుటగాంచి, దక్షుఁడు వెంటనే సంభ్రమమునలేచి నిలుచుండెను. బ్రహ్మ దిగఁగానే దక్షుఁడాతనిని విధ్యుక్తముగఁ బూజించి తన భాగ్యమునకు మెచ్చుకొనెను.

దక్షుని పూజలను స్వీకరించి తామరసోద్భవుఁడిట్లనెను :- రాజా ! నీ వింతటిచింతగానుంటివేల? నీ వింతటి మానసికదుఃఖము బొందుటకు గతంబేమి? నీ దుఃఖకారణమును నాకుఁజెప్పుము.''

ఇది విని దక్షుఁడిట్లనెను :- "ప్రభూ ! నాకు సర్వగుణ సంపన్నులగు పదివేలమంది పుత్రులుండిరి. వారి నందఱ నీ వీణా ధరుఁడగు నారదుఁడు సన్న్యాసుల నొనర్చెను. పేరు చెప్పుకొను వాఁడు, నీరు విడుచువాఁడు నొక్కఁడును లేఁడు. స్వామీ! నాకీకా రణమున దుఃఖము కలుగుచున్నది. అయ్యో! స్వామీ; వారెంతో యశశ్వులు, తేజశ్వులు, వృద్ధికి రావలసిన పిల్లలు.

బ్రహ్మ యిట్లనెను :- "రాజా! అయినదేమో అయినది. దీనికై నీవు యింతగాఁ జింతింపనేల? ఇందు నారదుని దోషమే మున్నది? వారలందఱ ప్రారబ్ధమట్లున్నది. వారినొసట సన్న్యాసులు

కావలయునని వ్రాయఁబడియున్నది. ఏమియు ఫరవాలేదు. మరల నీవు పుత్రుల బుట్టించుము."

దక్షప్రజాపతి దీనమనస్కుఁడై యిట్లనెను :-స్వామీ! ఇప్పు డేమి పుట్టింపఁగలను? మొదట పుట్టినట్టివారిప్పుడు పుట్టఁగ లరా?"

బ్రహ్మ యిట్లనెను- అట్లుకాదు, నీవు చింతింపకుము, పూర్వ మువలెనే పుత్రోత్పాదన గావింపుము. మరల నింకొకసారి ప్రయ త్నింపుము.''

పితామహుఁడు నచ్చఁజెప్పగా నాతని యాజ్ఞను శిరసా వహించి దక్షప్రజాపతి పంచజనీయను దన పత్నియందు మరల వేయిమంది పుత్రులను గనెను. వారందరకు శబలాశ్వులను పేరు పెట్టెను. వారందరు మిక్కిలి సరళస్వభావముగల వారు, సదా చారులు, సద్గుణసంపన్నులు, వారు చేతులు జోడించి తమ తండ్రితో నిట్లనిరి - "ప్రభూ ! మే మేమిచేయ వలయును ?"

ఇది విని అత్యంత ప్రేమపూర్వకముగ దక్షుఁడిట్లనెను - ''పుత్రులారా ! మీరందరు ప్రజావృద్ధికై వెళ్ళి తపంబొనర్పుఁడు తపస్సుచే శ్రీహరినిఁ బ్రసన్న మొనర్చుకొని సృష్టి వృద్ధిలో సహాయ మొనర్పుఁడు."

ఇది విని పితాజ్ఞ శిరసావహించి దక్షసుతులగు- శబాశ్వ

శ్వులందఱు వారి పూర్వజులగు హర్యశ్వులు పోయిన పశ్చిమదిశకే పోయిరి వీరందఱు వెడలి వారి అగ్రజులు సిద్ధినిబొందిన నారాయణ సరోవర సమీపమునకు జేరుకొనిరి.

శబళాశ్వులందఱు నా పరమపావన తీర్థమందు విధ్యుక్తముగ స్నానమాడి పవిత్రాంతఃకరణులైరి. మిగిలియున్న యత్కించిన్మలము తీర్థప్రవాహముచేఁ దుడుచుకొనిపోయెను. వారందఱి హృదయములు నిర్మలములయ్యెను. వారు మిక్కిలి సావధానముగఁ బ్రణవసహితమగు నీ మంత్రము జపింపసాగిరి. దానియర్థమిది :- ఓంకార స్వరూపుఁడును, పరమ పురుషుఁడగు నారాయణ పరమాత్మకు నమస్కారము. ఆ విశుద్ధసత్త్వగుణాశ్రయుఁడగు పరమహంసస్వరూపుఁడగు పరమేశ్వరుని ధ్యానించుచున్నాను" ఈ విధముగ నాపరబ్రహ్మ గూర్చి జపించుచు ఘోరతపస్సు చేయసాగిరి. కొంతకాలము ఫలపుష్పములమీఁద నాధారపడిరి. కొంతకాలము జలపానమునే చేసియుండిరి. మఱికొంతకాలము వాయువునే భక్షించుచు భోజనపానీయముల నన్నిటినిఁ బరిత్యజించిరి.

ఈ విధముగ వారు ఘోరతపంబునఁ బ్రవృత్తులగుట గాంచి నారదుఁ డిట్లనెను :- "పోయి, వీరినిఁగూడ పట్టి చూడవలెను. వీరును నే విధముగనైన సన్న్యాసులైనచో నానందము లభించును. వచునొకండు నేల శిష్యులగుచోఁ గుల పతి కావచ్చును.

శుకుఁడిట్లనెను :- "రాజా! లాభము వృద్ధిజెందును. ఒక్క సారి మంచి లాటుచిక్కి నా మాటిమాటికి ఆ వస్తువు బొందుటకభిలాష కలుగును. కావున నారదుఁడెట్లైన వారికి సన్న్యాసమిప్పించుటకై మరల నా శబళాశ్వుల కడకుఁబోయెను.

## శబళాశ్వులను శిష్యులుగాఁగ దక్షుఁడు నారదుని శపించుట

శ్లో॥ ఇతి తానపి రాజేంద్ర ప్రతిసర్గధియో మునిః॥
ఉపేత్య నారదః ప్రాహ వాచః కూటాని పూర్వవత్ ॥
శ్రీ భాగ. ౬ స్కం, ౫ అ. ౨౯ శ్లో॥

వ. ఇట్లతి భయంకరంబైన తపంబు సేయుచు నెడ తెగక భగవన్మంత్రంబులు నొడువుచు ప్రజాసర్గకాములై యున్న యచ్చిన్న బాలుర కడకు నారదుండు సనుదెంచి పూర్వవిధంబునం బలుకుచు నిట్లనియె. శ్రీ మదాంధ్ర భాగవతము.

పరోపకార స్వభావము కలవానికెన్ని కష్టములు వచ్చినప్పటికిని పరోపకారము చేయకుండఁ జాలఁడు, సహజ స్వభావము దుస్త్యజమని చెప్పఁబడినది. రావణునితో సీతను దిరిగి యీయవలసినదని యెన్నిసార్లు చెప్పినప్పటికిని ఆతఁడిట్లనెను :- నా శిరస్సు

వేయిౘవక్కౘలగుగాక నేను సీతనీయను రాముని సమ్ముఖమున నేను తల వంచను. నేనేమి చేయుదును. నేనును వివశుఁడనే. ఇది నా సహజదోషము. ఏలయనఁగా స్వభావము దురతిౘక్రమమైనది,''

ఒక ప్రసిద్ధమగు కథ కలదు. ఒకానొక జన్మచోరుఁడు కలఁడు. దొంగతనము చేసిచేసి చివరకు వానికి వృద్ధావస్థలో పశ్చాత్తాపము కలిగెను. ఒకానొక గ్రామ మహంతుచే దీక్షనుగొని సాధుసమూహాములో నివసించుచుండెను. రాత్రులందు సాధువులు నిద్రపోఁగానే ఒకానొకని చిమ్మటము (సాధువులు పట్టుకొను ఒక ఇనుప పనిముట్టు)ను దీసి యింకొక చోటఁబెట్టెడువాఁడు పూజసంపుటము దాచిపెట్టుచుండెను మఱియొకని సొరకాయబుఱ్ఱనుదీసి వేఱొకని తలదగ్గఱఁబెట్టెడువాఁడు అందఱ సొరకాయబుఱ్ఱనుదీసి వేఱొకని తలదగ్గరఁ బెట్టెడువాఁడు. అందర సొరకాయ బుఱ్ఱల మార్చెడువాఁడు. తెల్లవారఁగానే ఒకరొకరు పోట్లాడుకొనెడివారు. ఒకరు నీవు నా బుఱ్ఱనేల దొంగిలించితివన క్రోధముతో నింకొకఁడిట్లనెడు వాఁడు- "నేనెప్పుడు దొంగిలించితిని?" ఇట్లు ప్రతిదినము యుద్ధమగుచుండెడిది. ఒకానొక దినమున నొక బుద్ధిమంతుఁడగు సాధువు కపటనిద్రతో మేల్కొనియుండి వాని కృత్యమునంతను గనిపెట్టి యుండెను. చివరకు పట్టుబడెను. మహంతుగారి వద్దకు తీసికొనిపోయి నిలువఁబెట్టిరి. మహంతు వానిని గద్దించుచు నిట్లనెను- "ఏమీ! నీ వింకను నీ యాచరణమును సరిచేసికొనలేదు. ఎక్కడి మూర్ఖుఁడవు ? సాధువు వయ్యు దొంగ తనము మాన

కుంటివి" ఆతఁడు లజ్జితుఁడై యిట్లనెను - "మహారాజా ! నేను దొంగతనము మానియుండిన నారకాయబుద్ధినేల మార్చెదను ? స్వామీ ! ఇట్లు నేను చేయకుండఁజాలను. నా స్వభావవశమున వివశుఁడనైతిని." నారదుని స్థితియు నింతియే. నారదుఁడెవరినైన మోక్షధర్మాధికారినిఁ గాంచెనా కాశీలో కాశ్మీరు పట్టు విక్రయదారుల వెంబడి దళారీలు పడినట్లు పడుచుండును.

శుకుఁడిట్లనెను-"రాజా ! శబళాశ్వులు నేత్రములు మూసికొని పరబ్రహ్మ మంత్రము జపము చేయుచు ఘోర తపస్సు చేయుచుండిరి. ఇంతలోనే వీణమీఁద రాగాలాపన మొనర్చుచు రామకృష్ణ గుణగాన మొనర్చుచు విశాలములగు జటాభారమున జడలనూఁగించుచు, పాదుకా ఘట్టన మొనర్చుచు నారదుఁడు వారి దగ్గరకువచ్చి వారి ధ్యానమును దనవైపున కాకర్షించుట కిట్లనెను- "శబళాశ్వులారా ! జయజయ సీతారామ్ ! నమోనారాయణాయ ! నమోనారాయణాయ !!"

వీణాపతియగు నారదునిగాంచి వారందరు వెంటనే జలమునుండి లేచి బయటకువచ్చి తడిసిన తమ జడలచే నారద చరణములను దడిపివేసిరి, అందర శిరస్సున నొకచేతి నుంచుచు రెండవ చేతితో వీణెను మీఁటుచు నారదుఁడందఱ కుశల ప్రశ్నల నడిగెను."

శబళాశ్వులు దేవర్షిని విధ్యుక్తముగఁ బూజించి యిట్లనిరి- "ప్రభూ ! అబోధబాలకుల మమ్ముల ననుగ్రహించుటకై దర్శన మిచ్చి కృప జూపితిరి."

నారదుఁడు గంభీరముగ నిట్లనెను- "అవునవును. నిజమే మీరు మార్గభ్రష్టులై చెడుచున్నారని తెలిసికొని మీకు మంచి మార్గమును జూపవలయునని వచ్చితిని."

శబళాశ్వు లిట్లనిరి - "స్వామీ! మేము పదచ్యుతులము కాలేదు. మేము పితృాజ్ఞను చాల సావధానముగఁ బాలించుచున్నాము. ప్రజావృద్ధికై ఘోర తపంబొనర్చుచున్నాము."

నారదుఁడు ఖేదస్వరమున నిట్లనెను- "బాలులారా! ఇదియే మీ పొరపాటు. నాయనలారా! యథార్థమగు తండ్రి శాస్త్రము చెప్పిన వాస్తవిక ఆజ్ఞయే సరియైన మార్గము ఆ మార్గమున బోయిన కల్యాణము గలుగఁగలదు. మిగిలిన మార్గములన్నియుఁ గంటకీర్ణమార్గములు వానిలో క్షేమములేదు. ప్రేమలేదు, సుఖము లేదు. శాశ్వత శాంతిలేదు. దీనివలన సంసారచక్ర నివృత్తియును లేదు. జనన మరణ రూపమగు నెనుబదినాల్గులక్షల జీవరాసుల చక్రములోఁ దిరుగవలయును."

శబళాశ్వులిట్లనిరి - "అయితే స్వామీ! మాకా సన్మార్గమును జూపించుఁడు. మేమందర మేమి చేయవలయునో ఉపదేశింపుఁడు. ఏ మార్గము ననుసరింపవలయును."

నారదు డిట్లనెను- "మీ జ్యేష్ఠులు నేమార్గమునఁ బోయిరో ఆ మార్గము సరియైనదగునా కాదాయని మిమ్ముల నేనడుగుచున్నాను."

శబళాశ్వులిట్లనిరి - "స్వామీ ! అవశ్యము పెద్దలు నిర్ధారించిన పథము పరమ పుణ్యప్రదమే కాఁగలదు."

ఇది విని ప్రసన్నతను బ్రకటించుచు నారదుఁడిట్లనెను - "భ్రాతృవత్సలులారా ! మీరందరును ధర్మాత్ములరు. శుద్ధాంతఃకరణులు. మీకు నేనేమి చెప్పెదనో దానినిఁ జేయుఁడు. అదియే నిష్కంటకము, శ్రేయస్కరము, కల్యాణప్రదము, సర్వోత్తమము నగు వాస్తవిక మార్గము. ఆ మార్గమునఁబోయిన శ్రమయుండదు, గ్లానిలేదు. గంతవ్యస్థానమును సరళముగఁ జేరుకొనఁగలరు. ఏల యనఁగా శ్రేష్ఠుల మార్గము మీ జ్యేష్ఠ సోదరులందరును శ్రేష్ఠులు, విచారణశీలురు. ఎవరు తమ యగ్రజుల శ్రేష్ఠమార్గానుకరణమును గావించెదరో అట్టి పుణ్యప్రద పురుషుఁడు పరలోకమందు మరుద్గణములతో నానందము ననుభవించును. మీ సోదరుల మార్గము పునరావృత్తిరహితమైనది."

శుకదేవుఁ డిట్లనెను- "రాజా! ఇట్లు చెప్పి నారదుఁడు తన వీణను గ్రహించి వెళ్ళెను. ఇచ్చట శబళాశ్వులు నారదుని దశకూటప్రశ్నలకు సమాధానములు వెదకుటయందు బ్రవృత్తులైరి. వారికిని యీ సంసారసృష్టి వృద్ధికార్యములందు వైరాగ్యమును జెంది, నారదోపదేశమునఁ దమ సోదరులు పట్టిన మార్గముననే వీరు పట్టిరి. వారందరును సన్న్యాసులైరి. అంతర్ముఖవృత్తిగల వారికి పరమేశ్వరప్రాప్తికి అనుకూల మార్గమగు దివ్యమార్గము

నెన్నుకొనిరి. కాని ప్రజావృద్ధికై తపమును మానిరి. ఆ మార్గమునకు వెళ్లినవారు వెళ్లుటేగాని మరల వచ్చుటలేదు. దాని లోనికిఁ బోయినవారు మరల తిరిగిరాని బిలమది.

ఇచ్చట దక్షప్రజాపతియు నెవరినోటనో తన పుత్రులను నారదుఁడు మాయమాటలు చెప్పి మోసపుచ్చి సన్న్యాసమిప్పించెనని వినగానే ఆతని దుఃఖమునకు మేఱలేకుండెను. ఆతఁడిట్లనుకొనుచుండెను- ఈ నారదుఁడు మా వెంటనేలఁబడినాఁడో అది భగవంతునకుఁ దెలియవలయును. సృష్టి వృద్ధికానిచ్చుటలేదే. నా కొడుకులను మాటిమాటికి సాధువుల నొనర్చుచున్నాఁడు. బ్రహ్మ చెప్పఁగా నేను వానిని మొదటి సారిగా క్షమించితిని. ఆ సిగ్గులేని నారదుఁడు నాకీసారి కనఁబడెనా వానికి దాని ఫలమును రుచి చూపించెదను. నా రెండవజట్టు పుత్రులనుగూడా బైరాగుల నొనర్చిన ఫలమేమిటో తెలిసికొనఁగలిగిన దండ మొనర్చెదను."

ఇట్లు దక్షప్రజాపతి చింతించు చుండఁగా నారదుఁడు వేఱొక విధానము నాలోచించుచుండెను. ఆతఁడిట్లాలో చించుచుండెను- ఒక్క పుత్రుఁడు పోయినచోఁ దండ్రికి సంసార వైరాగ్యము జనించును. దక్షునకు పదునొకండు వేలమంది బైరాగులైరి. ఆతని కవశ్యము సంసారవైరాగ్యము కలిగియుండవచ్చును. అట్లతడు ముక్తి మార్గమున కధికారియగుచో వానికిని సన్న్యాసమిప్పింతును.అప్పటికి 1101 శిష్యులు కాఁగలరు." ఇట్లాలోచించి వీణమీఁటుచు రామకృష్ణగోవిందయని గానముచే నారదుఁడు దక్షప్రజాపతి సభకు

వచ్చెను. దక్షుఁడు, నారదుని దూరముననుండియే చూచెను.చూడఁ గానే అతఁడు మండిపడెను. ఎక్కడి పాద్యము, ఎక్కడి అర్ఘ్యము? స్వాగతము సత్కారము, శిష్టాచారము అన్నిటిని మఱచిపోయెను. క్రోధోద్రేకమున వణఁకుచుఁ గన్నులెఱ్ఱఁజేసి నారదునిమీఁద నెగిరి పడెను. రోషకారణమున నాతని నోటివెంట వాక్కులు స్పష్టముగ వచ్చుట లేదు. ఆతని యధరపుటము లదురుచుండెను. దంతము లతో నోష్ఠపుటముల గొఱుకుచు నిట్లనెను :- "ఓయి వీణావాదీ? నీవు మిక్కిలిదుష్టుఁడవు ఓరీ; నీవు సాధువనుకొంటిమి భగవద్భక్తు డవే కాని నీవు మోసగాఁడవు, పాషండుఁడవు ధూర్తుఁడవు, కప టివి, విశ్వాసఘాతకుఁడ వైతివి."

నారదుఁడు సరళముగ నిట్లనెను :- "రాజా! నేను నీకేమి యనిష్టమును గావించితిని."

దక్షుఁడత్యంత రోషస్వరమున నెగతాళిచేయుచు నిట్లనెను:- "ఆహాహా! చాల అమాయకుఁడవే? ఇట్లు ప్రశ్నించుటకు నీవు సిగ్గును జెందుటలేదు. ఇంతకు మించిన యనిష్టము నీ వింకేమి చేయఁగలవు? మా యింటికి నిప్పుపెట్టుటయు, నా శిరస్సు ఖండించు టయు మిగిలియున్నది. దానినిఁజేయుము, అనిష్టమేమిచేసితినని యడుగుచున్నావు? నీవాజన్మతో వైరాగివి. ప్రసవవేదన వంధ్య కేమి తెలియును? బిడ్డలయెడల తండ్రికెంత ప్రేమయుండునో నీ కేమితెలియును. పుత్రుఁడు తండ్రియొక్క హృదయము. బాహ్య ప్రాణముఁ దశపుత్రులలో నొక్కనినైన నడిగిన నీయరాదు. ఇరు

పది[వేళ్లలో నేచిన్న [వేలినడిగినను ఇచ్చుటకెవరు సిద్ధముగను న్నారు? నీవు ఒక్కరినిగాదు, ఇద్దరినిగాదు, ముగ్గురనుగాదు, నలుగురనుగాదు, పదిమందినిగాదు. ఇరువదిమందినికాదు, నూర్గురును గాదు, వేయిమందినిగాదు, పదునొకండు వేలమందిని నాపు[త్రులకుఁ గావీనములిచ్చి, భిక్షకులనొనర్చి సాధువులనొనర్చితివి; అట్టివాఁడవు నేను నీకేమి యపకారమొనర్చితినని మంచివానివాలె నడుగుచున్నావు. నీవు నా సర్వస్వమును నాశనమొనర్చితివి. నా మనోరథ సౌధము చిన్‌భిన్న మొనర్చి నాశనమొనర్చితివి.

నారదుఁడు ధైర్యముతో నిట్లనెను :- "మహారాజా; నీవు కోపపడకుము. పరమహంసా[శమము సర్వ[శేష్ఠమైనది. గృహస్థా[శమముకంటె లక్ష రెట్లు [శేష్ఠమైనది. అట్టి పరమహంస ధర్మమునే నేను నీ పు[త్రులకుపదేశించితిని. ఇందులో నే నేమైన చెడ్డ పనిచేసినట్లు నా బుద్ధికి వచ్చుటలేదు."

అత్యంత[కోధస్వరమున దక్షుఁడిట్లనెను :- "బుద్ధికివచ్చుట నీకు బుద్ధియుండినఁగదా! బుద్ధిస్థానమున నీకు మస్తిష్కమునకు బదులు గోమయమున్నది. నీవు పెద్ద విరక్తుని వలెఁ దిరుగుచుందువే కొంచెమైన నాలోచనలేదే. మానవునకు శిరస్సున దేవ, ఋషి, పితృఋణముల భారమున్నంత వఱకు పరమహంసా[శమము కధికారికాఁడు. [ప్రథమమున [బహ్మచర్య [వతధారణమొనర్చి వేదాధ్యయన గురుశు[శూషలద్వారా ఋషి ఋణవిముక్తుఁడు కావలయును. యోగ్యమగు భార్యను పాణి[గహణ మొనర్చుకొని అగ్నిహో[త్రము, పంచ

మహాయజ్ఞములు, ఇంకను గొప్పగొప్ప దేవయజ్ఞములొనర్చి దేవఋణ మును దీర్పవలయును. ధర్మపత్నియందు యోగ్యుఁడగు పుత్రునిఁ గని పితృఋణవిముక్తి చెందవలయును. పుత్రులు లేనివారికి స్వర్గము ప్రాప్తింపదు. ఈశరీరమును మనపితృపితామహులచేత, బైపితురుల చేత నీయఁబడిన లాకట్టుసొత్తువంటిది. మనము వంశమును బెంచ నంతవరకు, మనస్థానమునఁ బుత్రుని నిలుపనంతవరకు జ్ఞానవైరా గ్యములకు సంబంధించి వేదాంతముల కధికారము లేదు. నా పుత్రు లింతవరకు సంసారసుఖమును రుచిచూడనేలేదు. కర్మవిషయమున వారికాలోచనయేలేదు. నీవువారికి గొపీనమునిచ్చి భిక్షకుల నొనర్చి తివి. వారిటునటుఁ గాకుండఁ బోయిరి. ఉభయభ్రష్టులైనారు. వారిహ లోక భోగముల ననుభవింపను లేదు పరలోకమందు లభించు శ్రేయస్సు బ్రాప్తింపనులేదు."

నారదుఁడిట్లనెను- "రాజా! మీపిల్లలు మిక్కిలి సరళస్వభా వులు. వారి యంతఃకరణము మిక్కిలి నిర్మలమైనది. వారుసర్వాథా సన్న్యాసమార్గమున కధికారులు పొరపాటుననైనఁ ద్యాగపథదీక్ష నొసంగను. ఈ విషయములో మీరు విశ్వసించుఁడు."

ఇదివిని దక్షుఁడు గద్దించి యిట్లనెను- "నోరుమూయుము. వ్యర్థముగ వాగుచున్నావు. ఎవరేమార్గమున కధికారులో నీకేమి తెలియును? నీకుబాలురను మోసముచేయుట తెలియును. వారిబుద్ధినిఁ జెడఁగొట్టుట నీవు నేర్చుకొనినావు. లోకములో నీవు గొప్పదయా ళుఁడవని ప్రతీతి లోకములో నీవంటి నిర్దయుఁడు ఇదివరకు లేఁడు

నియు నిఁకముందుండఁబోఁడనియు నేనందును. లోకులు నిన్ను భగవంతుని పార్షదుఁడని యందురు కాని నీవంటి సిగ్గులేనివానిని భగవంతుఁడు పార్షదునిఁగా నిర్ణయించుకొనినది భగవంతునకుఁ గూడ మిక్కిలి యపయశస్సని నేనందును. నీవాతని యశస్సు గళంకితమొనర్చు కపటివి, క్రూరుఁడవు, కాపురుషుఁడవు. భగవంతుని పార్షదత్వము నిన్ను స్వయముగ వదలవలసియుండును; కాని శీలసంకోచముచే నది వదలలేదు. నీవు సిగ్గులేనివావైడ పార్షదుఁడుగాఁ జేయఁబడితివి నారదుఁడు భక్తుఁడు భక్తుడని లోకులందురు. ఇటువంటివారు భక్తులుకారు, భక్తులెల్లప్పుడును బరోపకారము చేయుటకు వ్యగ్రులై యుందురు. వారు సదాసర్వదా సమస్త ప్రాణులందును కృపను జూచుటకుఁ బ్రతిక్షణము తహతహ లాడుచుందురు. క్రియాశీలురగుచుందురు. సౌహార్ద్ర నాశకుఁడవు, అకారణవైరివి.

నారదుఁ డిట్లనెను – "రాజా ! నేనెవరిలో వైరము బెట్టుకొంటిని."

క్రోధముతో దక్షుఁడిట్లనెను– "ఇంక వైరమెట్లుండును ? నేనెన్నడైన పొరపాటున నీకపకార మొనర్చితినా? అట్టియెడ నీవు నా విషయములో దేనికి బ్రతీకార మొర్చితివి." నా అబోధబాలకుల మోసముచేసి సన్న్యాసుల నొనర్చితివి."

నారదుఁడిట్లనెను – "మహారాజా ! నీవు క్రోధము వదలి గంభీరముగ విచారించుము. జీవునకుఁ జరమలక్ష్యము శాశ్వతశాంతి.

అందఱును నీ జనన మరణ రూపమగు చక్రమునుండి బయటపడి యెన్నడును జెడని నిత్య సుఖము కోరుకొందురు. సంసారి స్నేహ బంధనము మూలచ్ఛేదము చేయనంతవఱకు అది లభింపదు. సంసారబంధనము త్యాగ వైరాగ్యములు లేక తెగదు. కావున వైరాగ్యుల నొనర్చి నేను వారికి మహోపకారము నొన ర్చితిని.''

దక్షుఁడత్యంత గంభీరుఁడై రోషస్వరమున నిట్లనెను :- నీవు ''పెద్ద పెద్ద మాటలు మాటలాడెదవు కాని వానిని గ్రహించు టకు నీలో బుద్ధిలేదు. ఇటుజూడుము. కేవలము కౌపీనధారణమువ అననే, అవధూత వేషధారణముననే - స్నేహబంధము తెగదు. శాశ్వత శాంతియు ప్రాప్తింపదు. ఏలయనఁగా జ్ఞానోదయము కానిది కేవలము నీవు మోసమొనర్చుట చేతనే వైరాగ్యముకలుగదు. వైరాగ్యములేనిది ఉపశయమెట్లుకలుగును. ఉపశమము కానిది స్నేహబంధోచ్ఛేదము త్రికాలములందును సంభవముకాదు.''

నారదుఁడిట్లనెను- "సాంసారిక వాసన మనస్సులోఁ గలుగ కుండుటయే వైరాగ్యము. విషయములను గ్రహింపకుండుటయు వాటి నుపభోగింపకుండుటయు దీనికే త్యాగమని పేరు. దీనికి వారందఱు ఫలేకాదులే."

దక్షుఁడు క్రోధస్వరమున నిట్లనెను- ఓయీ! నారదా! నీ బుద్ధి భ్రష్టమైనది. మానవుఁడు విషయానుభవము కలిగియుండ

నంతవఱకు వాని కటుత్వము నెరుఁగఁజాలఁడు. కావున వానికి దుఃఖరూపత్వము ననుభవపూర్వకముగఁ దెలిసినప్పుడు కలిగిన వైరాగ్యము, ఇతరులవలన వినుటఁచే గలుగదు. ఏలయనఁగా స్వయముగ ననుభవించుటచే దానిలోని రహస్యములన్నియును దెలియఁగలవు. నీవాజన్మవైరాగివి. నీవెన్నఁడును స్త్రీసుఖము ననుభవించలేదు. నీకేమితెలియును? నిన్నెవరు విశ్వసింపఁగలరు? మా నగరములలో స్త్రీలేనివారి నెవరిని నుండనీయరు వివాహమాడక సాధువైనవాఁడు సాధారణముగఁ బతనముకాఁగలఁడు. ఏదైనప్రలోభము సంభవించినప్పుడు జారిపోవును. మేముమర్యాదను బాలించు గృహస్థులము. నీవుముందుగా మాకు గొప్పయపకార మొనర్చితివి మాపుత్రుల పదివేలమందిని సన్న్యాసుల నొనరించితివి. దానిని మనస్సులో నిముడ్చుకొని యూరకుంటిని. సాధువుతో తగాదా పెట్టుకొనుటఎందుకులే యని యూరకుంటిని. కాని నీవిప్పుడు మావినాశనమునకే తలపెట్టితివి. కావున నేఁడు నీకు శాపమొసంగక విడువను నేనొసంగుశాపమిది. నీవు నివసించుటకొక నిశ్చిత స్థానము లేకుండఁబోవుగాక! నీవు నా యిల్లువాకిలినంతయు నాశనమొనర్చితివి కావున నీకిల్లు వాకిలి లేకుండఁ బోవుఁగాక చక్రము వలె నీవు చతుర్దశ భువనములను దిరుగుచుండెదవు గాక; ఒక స్థానమున నీకుఁ గాలు నిలువకుండుఁ గాక; నీవు మోసముగ, మూర్ఖముగఁ దిరిగెదవుగాక!''

ఇది విని నారదుఁడు నవ్వి యిట్లనెను – "మంచిది, నీ శాపమును నేను శిరసావహించుచున్నాను నా కొక్క స్థాన

మెందులకు ? ఒక్క ఆశ్రమమున నుండుటచే మోహము కూడ కలుగును. సాధువునకు దిరుగుట శాపముకాదు వరదానము" ఇట్లు పలికి నారదుడు పకపక నవ్వెను.

ఇదివినియాశ్చర్యముతో పరీక్షిన్మహారాజిట్లనెను-"ప్రభూ నారదుడు సర్వసమర్థుడు. భగవద్భక్తుడు. భగవదవతారము, ఆతడేమియు నపరాధ మొనర్పలేదుకదా! దక్ష పుత్రులకు మేలే చేసినాడు. నిరపరాధుడు, సాధు సమాజములో సమ్మానితుడగు మహాపురుషుని దక్షుడు అనరాని మాటలని, చేయరాని వ్యవహార మొనర్చినాడు. ఇంత కఠినపు వాక్యములను వినియు నారదుడు నవ్వుచు నేలయుండెను. ఇంతటి కఠినశాపము వినియు నాతడు తిరిగి గర్వియగు దక్షునేల శపింపలేదు ?"

ఇది విని శుకదేవు డిట్లనెను- "రాజా! త్యాగికిని, రాగికిని ఇదియే అంతరము. విషయాసక్తులలోను వైరాగ్యవంతులలోను నిదియే విశేషము. సమర్థుడయ్యు నితరుల యపరాధములను సహించువాడే సాధువని లోకములో బిలువబడును" ఆతడొక మాటయనిన మనము రెండు మాటలనుటయు ఆతడు చెంప దెబ్బను గొట్టిన మనము కఱ్ఱతో బాదుటయు ఆతడు మట్టిపెళ్లతో గొట్టిన మనము రాళ్లు విసురుటయు నిది సాంసారికుల నీతి. సహన శీలము కలిగి అపకార మొనర్చిన వానికి అపకార మొనర్పక ప్రత్యుపకార మొనర్చువాడే నిజమగు భగవద్భక్తుడు. భగవద్భక్తుడు వృక్షములకంటె నధిక సహనశీలుడుగ నుండును. దాను తృణము

కంటె నీచుఁడననుకొనును. కావుననే సమర్థుడయ్యు నారదుఁడు దక్షప్రజాపతికిఁ బ్రతిశాపమొసంగలేదు.''

శుకుఁడిట్లనెను- ''రాజా! క్రోధితుఁడగు దక్షుని శాపమును శిరసావహించి దుఃఖింపక, ప్రసన్న చిత్తముతో వీణను మీటుచు హరి గుణగానమొనర్చుచు నారదుఁడచ్చటనుండి వెడలి యిచ్ఛాను సారముగ నన్యలోకములలోఁ జరించుచుండెను. నే నిప్పుడు నీకు దక్ష ప్రజాపతి కుమారులగు హర్యశ్వుల యొక్కయు, శబళాశ్వుల యొక్కయు వైరాగ్యకథను వినిపించితిని. ఇఁక నిప్పుడు నీ వేమి వినగోరుచున్నావు ?''

## దక్షుని అఱువది కన్యకలు

శ్లో॥ తతః ప్రాచేతసోఽసిక్న్యామనునీతః స్వయంభువా!
షష్టింసంజనయామాస దుహితౄః పితృవత్సలాః
శ్రీ భాగ. ౬ స్కం. ౬ అ. ౧ శ్లో॥

''వ ............మఱియు దక్షుఁడు దన మనోరథంబు విఫలంబగుటంజేసి యతి దుఃఖిత మనస్కుఁడై పొగులుచున్నఁ బితామహుండు చనుదెంచి మఱియుఁ బ్రజాసర్గోపాయంబుపదేశించిన నా ప్రజాపతి ప్రియభామయైన యసిక్నియందుఁ బితృవత్సలలైన పుత్రికల నఱువదుండ్రఁ బుట్టించె.''

శ్రీ మదాంధ్ర భాగవతము.

కొడుకునకుఁ గూఁతురునకు భేదము లేదు. ఇద్దఱును హృదయమునుండియే యుత్పన్నమయ్యెను. వారును దన కాత్మయే. పుత్రికా పుత్రులరు భేదమేమనఁగా బుత్రుఁడు తనయింటిలోనుండి వంశపరంపరను అక్షుణ్ణము కావించును. పుత్రిక పరగృహానకుఁ బోయి వంశవృద్ధిని గావించును. పుత్రుఁడు పుట్టకున్నను పుట్టి సన్యాసియైనను, లేక మరణించినను పుత్రికవలననే తాను బుత్రవంతుఁడ ననుకొనును, పుత్రికకూడ లేనివారింకొకచోటఁ బుత్రునిఁ బెంపుడు తెచ్చుకొందురు. ఈ విధముగ వంశము లుప్తముకాకుండఁ జూచెదరు. పురుషులకంటె స్త్రీలయందు మోహమమత్వములు, సంతతివృద్ధియందు కోరిక అధికముగనుండును. పురుషుఁడు సాధారణముగ నీరసకృతిగ నుండును. వానిలో సరసత్వతా సంచారము వామేక్షణగానే యుండును. సంతతియెడల నత్యధికానురాగము మాతృహృదయమందే యుండును. రాక్షసులయందు కామవాసన అధికముగనుండుటచే వారిలో సంతానమందనురాగము న్యూనముగ నుండును. వారు కామవాసనకు వశీభూతులై సంతానపరిత్యాగము చేయుదురు. ఒక్కొక్కప్పుడు హత్యకూడ చేయుదురు. కాని సాధారణ మాతృహృదయము పిల్లలయందే అందరకుండును. కావున సృష్టికార్యమందు పురుషులకంటె స్త్రీలకే అధిక బాధ్యత కలదు. వీరే ప్రకృతికి ప్రతినిధులై యీ ప్రాకృత జగత్తును వృద్ధిపొందించి, నడుపుచున్నారు, ఆడించుచున్నారు, నవ్వించుచున్నారు, మాయఁ జేయుచున్నారు. వీరు మహామాయలు, జగజ్జననులు, లోకమాతలు.

శుకదేవుఁడిట్లనెను- "రాజా! తన బదునొకండువేలపుత్రులు సన్న్యాసులగునప్పటికి దక్షునకు మిక్కిలి కోపము వచ్చెను. ఆ కోపములో నాతఁడు నారదునకు శాపమొసంగెను నారదుఁడిట్లనెను 'రాజుకడకు వచ్చితిని. వట్టిచేతులతోఁ బోవుటలేదు, రాజుకొంచెమో గొప్పయో యివ్వనే యిచ్చినాఁడు. సాధువునకు శ్రద్ధాపూర్వకముగ నిచ్చినదేదైనఁ గానిండు స్వీకారమే" అని యీ విధముగ నాలోచించి శాపమును శిరసావహించి ఆతఁడచ్చటనుండి వెడలి పోయెను. దక్షుఁడు నెత్తిన చేతులుపెట్టుకొని శోకసాగరమున నిమగ్నుఁడై చింతతోఁ కూర్చుడం యుండెను, ఆతనిదృష్టిలోఁ బ్రపంచమంతయు శూన్యముగఁ గనఁబడుచుండెను. ఇంతలోనే హంసపై నెక్కి బ్రహ్మ ఆతని సమీపమునకు వచ్చెను. బ్రహ్మ వచ్చుటను గాంచి ప్రజాపతియగు దక్షుఁడు ఆతని కాదరసత్కారములను గావించి విధ్యుక్తముగఁ బూజించి సాష్టాంగప్రణామ మొనర్చెను.

దక్షుని పూజలను స్వీకరించి బ్రహ్మ యిట్లనెను- "దక్షా? నీవింతగాఁ జింతించుచుంటివేల?"

దక్షుఁడు ఖిన్నమనస్కుఁడై యిట్లనెను- "ఏమి చెప్పుదును స్వామీ! చింతింపవలసిన విషయమేకలదు, ఈనారదుఁడు నా వింట నేలపడినాఁడో కాని, ఏజన్మలోని వైరమును తీర్చుకొనుచున్నాడో గాని మొదట నా పదివేలమంది హర్యశ్వులకు అదియు నిదియు బోధించి సన్న్యాసులనొనర్చెను. తర్వాత నేను వేయిమంది శబళాశ్వుల నుత్పన్నము గావించితిని. వారినిఁగూడ ఆ త్రోవనే

పట్టించినాఁడు. నేను సృష్టినెట్లు వృద్ధిచేయఁగలనో చెప్పుఁడు. నా త్యాగపత్రమును మీరు స్వీకరించి ఇంకొకని యోగ్యుఁడగువానినిఁ బ్రజాపతి నొనర్పుఁడు. నేను సృష్టి వృద్ధినిఁగావింప నసమర్థుఁడను నా ధర్మపత్ని మంచిదేకాని మంచిదైె యేమిచేయును. ఈ నారదుఁడు మా వెంటఁబడినాడు.

ఇది విని దక్షునకుఁ బ్రేమపూర్వకముగ సమాధాన మొనర్చుచు నిట్లు చెప్పెను- "వత్సా! శ్రేయాంసి బహు విఘ్నాని" మంచి కార్యముల కెల్లప్పుడును విఘ్నములే. నేనును గమలము నుండి యుద్భవించినప్పుడు మధుకైటభులను నసురులు నన్ను భయపెట్టి, గద్దింపసాగిరి. నా కార్యములందు విఘ్నమాపాదించుచుండిరి. అప్పుడు నేను భగవంతుని శరణువేఁడితిని. భగవంతుఁడు కృపతో వానినిఁ జంపెను విఘ్ననివారణమయ్యెను, నేను మరల సృష్టికార్యమందు ప్రవృత్తుఁడనైతిని. కావున విఘ్నములకు భయపడరాదు. ధైర్యధారణ మొనర్పవలయును."

దుఃఖమును బ్రకటించుచు దక్షుఁడిట్లనెను - "స్వామీ! ధైర్యమునకైనను మితముండదు ఎంతని ధైర్యమును వహింతును మాటిమాటికి నా కార్యమందు విఘ్నములు సంభవించుటచే నుత్సాహభంగమగుచున్నది. అందువలన నా కార్యము నొనర్ప మనస్సు ఉత్సహించుట లేదు. దానియందు వైరాగ్యము కల్గుట స్వాభావికమే."

అంత లోకపితామహుడగు బ్రహ్మ యిట్లనెను- "వత్సా! లోకములో మూఁడు రకములవారుందురు. మొదటి రకమువారు కార్యారంభముననే దీనిలో నీయీ విఘ్నము లుండును, ఈ చిక్కులు ప్రాప్తించునని యాలోచించి యాలోచించి విఘ్నభయముచే కార్యంభమును జేయనే చేయరు. వీ రధములు. ఇఁక రెండవ రకమువారు కార్యారంభమును మిక్కిలి యుత్సాహముతోఁ జేయుదురు. మధ్యనేవైన విఘ్నములు సంభవించినచో ధైర్యమును గోల్పోయి మధ్యలోనే వదలివేయుదురు. వీరు మధ్యములు. కాని యుత్తమపురుషులు విఘ్నము లెన్నివచ్చినను ఆరంభించిన కార్యమును బూర్తి యొనర్పక విశ్రమింపరు. వారికి నిరాశయనునది తెలియనే తెలియదు. నాయనా! నీవు ఉత్తమపురుషుఁడవు కావలయును. వెనుక మందాడకుము. సాహసము సడలింపకుము. నిరాశ జెందకుము. మరల సృష్టివృద్ధికై ప్రయత్నింపుము. ఇప్పుడు పుత్రుల నుత్పన్నముగావింపకుము. ఈ సారి పుత్రికలను బుట్టింపుము. సన్న్యాసులగు నీ బాలురు మోసపడిపోవుదురు కాని ఆడపిల్లలట్లుపోరు. నిశ్చలముగా నుందురు. వారినిఁ గాంచి యితరులే మోసపోవలయును. వారిని మోసము చేయఁబోయినవారే మోసపడుదురు. ఆ యాడపిల్లలకడకు నారదుఁడు రానేరాఁడు. వారిమెడలో నెవడైన తాళిఁ గట్టినా మనోనుకూలురగు దంపతుల గాంచి నారదుఁడే నారదుని యబ్బనగు నేనుకూడ వారిని సన్న్యాసులను గమ్మనినఁ గాజాలరు. కావున నాయనా! ఈ యుపాయయే సరియైనది. ఈ పుత్రసంతతి మీఁద మమకారము వదలుము, ఈ బాలకులు వివాహము కాకపూర్వము నిర్మోహులుగ నుందురు. స్వతంత్ర

సింహశాబకములవలె నెగురుచు దుముకుచు దశదిశలకును ఇష్టము వచ్చినట్లు పరుపెడి పోవుచుందురు. కాని భార్యయను సంకెళ్ళు తాళ్ళకుపడెనా సింహము పిరికినక్క యగును. అప్పుడే యుపాయమును దోచకుండును. పరవశులై పిల్లివలెఁ గాఁగలరు. ఆ సంకెళ్లు కణకణయను మధుర శబ్దమునకు మోహితులై యామె యెట్లాడించిన నట్లాడుదురు. కావున నాయనా సంసారబంధనమును వృద్ధి పొందింపఁదలతువేని సంకెళ్ళను దయారుజేయుము. తెలిసినదా నాయనా ! అందరును స్వయముగవచ్చి నిన్ననునయ వినయములద్వారా సేవింపఁ గలుగునట్టి దివ్య సుందరులగు గన్యకలను సృష్టించుము."

దక్షుఁడిప్పుడేమి చేయఁగలడు. గుర్వాజ్ఞా పాలనమునకుఁ దలను నాలోచింపకయే వంచవలయును. అందువలన నాతఁ డీసారి అశిక్నియను దన పత్నియందు అరువది మంది కన్యకల నుత్పన్నము కావించెను. వారి నేత్రము లన్నియుఁ గమలములవలె నుండెను. వారి శరీరకాంతి సువర్ణమువలె నుండెను. వారి యంగముల నుండి దివ్యపరిమళము వెల్విగక్కుచుండెను. వారు కన్యలలో రత్నరూపులు వారి యనవద్య సౌందర్యము నొక్కసారి యెవరైన జూచిరా వారి మనస్సును గోల్పోవలసినదే. వారికి వివాహవయస్సు రాఁగానే దక్షుఁడు సుయోగ్యులగు వరులతోఁ బ్రసన్నతా పూర్వకముగ వివాహము గావించెను. ఆ రోజులలో వివాహము చేసికొనువారు చాల తక్కువ అందువలన సృష్టివృద్ధికై ఒక్కొక్క పురుషుఁడు చాలచాల మందిని వివాహమాడెడువాఁడు.

అందువలన దక్షుఁడందులో నిరువదేడుగురను చంద్రునకొసంగెను. పదిమందిని ధర్మదేవునకును, పదముగ్గురు కన్యలను గశ్యప భగవానునకును నిచ్చి పెండ్లి యొనర్చెను. ఇద్దరిని భూతుఁడను ఋషికిని, ఇద్దరిని అంగిరునకును, ఇద్దరినిఁ గృశాశ్వమునికి నొసంగెను. ఎందరైనారు. ఇరువదేడుగురు పదముగ్గురు నలుబదిమందైరి పదిమందిని ధర్మునకు, ఈ విధముగ నేఁబదిమందైరి. భూత, అంగిర, కృశాశ్వులకు ఒక్కొక్కరికి ఇద్దరిద్దరు చొప్పున నారుగురైరి. ఇంకను నలుగురు మిగిలిరి. ఆ నలుగురిని తర్ష్యముని కొసంగిరి. ఈ విధముగ దక్షప్రజాపతి తన అరువదిమంది కన్యకలకు వివాహమొనర్చెను. ఇప్పుడు దక్షుని బాణము లక్ష్యమునఁ దగిలెను. ఆతఁడు సఫలుఁడయ్యెను, ఆ మన్వంతరమునఁ బ్రజలందరును నీ కన్యకల సంతతిచేతనే నిండునంతగ వంశవృద్ధి యయ్యెను. ఈతని పుత్రులు, పౌత్రులు, ప్రపౌత్రులే మూఁడు లోకముల నిండిపోయెను.

శ్రీ శుకమహర్షి యిట్లనెను- ''రాజా! వీరందఱ వర్ణనము చేయఁదలఁచుచో గల్పాంతమువరకును బూర్తికానంతగ నీ యఱువది కన్యకల వంశములు వృద్ధియైనవి. కావున నేనిప్పుడత్యంత సంక్షేపముగ సంకేత రూపమున నీ యఱువది మందియొక్క వంశవర్ణనమును గావింతును. నీవు ధ్యాన పూర్వకముగ వీనిని శ్రవణము కావింపవలయును. వీరి పుత్రులు వారు. వారి పుత్రులు వారని చెప్పుచుండిన విసుగుఁ జెంది దీనివలన మనకేమి లాభమన రాదు. వారి నామకీర్తనమువలనను గొప్ప మాహాత్మ్యము కలదు.

# దక్ష కన్యల వంశ వర్ణనము

శ్లో॥ నామధేయ-న్యమూషాం త్వం సాపత్యానాం చమేశృణు ।
యాసాం ప్రసూతి ప్రశవైర్లోకా ఆపూరితాస్త్రయః ॥
శ్రీ భాగ. ౬ స్కం. ౬ అ. ౩ శ్లో ॥

గీ. ఎట్టి పుణ్యవతులొ యీ చేడియలు సెప్ప
సవతు లేనియట్టి సవతులయ్యుఁ
గడుపు వడసి రెట్టి పడుపునఁ బుట్టిరో
కడిఁది త్రిజగమెల్లఁ గడుపుగాఁగ ॥

శ్రీ మదాంధ్ర భాగవతము

ఋషి వంశ శ్రవణముచేయు నాచారము పూర్వమునుండియు గలదు. మనకు శ్రావణీపర్వమను నొక పర్వమొకటి వచ్చును. అందు ఋషివంశ కీర్తనము, ఋషివంశ శ్రవణము చేయుటచే మాహాత్మ్యము కలుగును. ఈ వంశశ్రవణము మనలను విభిన్న శాస్వరములనుండి యేకత్వమునకుఁ గొనిపోవును. సంకుచిత పరిధినుండి వేరుచేసి విశాలవంశమునఁ గూర్చుండఁబెట్టును. జీవులు తమ్ము పరిధియొక్క అనేక పంక్తులందు విభక్త మొనర్చుకొని సంకుచితము కావించినది మేము బ్రాహ్మణులము, మిగిలినవారంద రును మాకంటె నీచులు, మేము ద్విజులము, ద్విజేతరు లధములు. మేము మనుష్యులము మనుష్యేతరులందఱును మోక్షమున కధి

కారులు, మేము బుద్ధిజీవిపురుషులము బుద్ధిహీనములన్నియు మాకు ఆ జీవికాసాధనములు; ఇత్యాది భేదభావములచే జీవి మఱియొక జీవిని భక్షణ చేయుటకును నీచముగఁ జూచుటకును నుద్యుక్తుడగును ఋషివంశకీర్తనమున నీ క్షుద్రతత్వమును బోఁగొట్టును. మనుష్యులు పశువులు, పక్షులు, సింహములు, వ్యాఘ్ర సర్పాదులు, దేవతలుఁ అసురులు మొదలగునవన్నియు నొకే కశ్యపుని సంతానమనియుఁ జెప్పును. మనకందఱకును దండ్రి యొక్కఁడే. తల్లులు వేరగుటచే నీ విభిన్నజాతు లేర్పడినవి. వేఱువేఱు వర్గములేర్పడినవి కావునఁ బ్రతిదినము ఋషుల వంశము గూర్చి శ్రవణము చేయుటవలనఁ బరమ మాహాత్మ్యము కలదని చెప్పఁబడినది.

శుకదేవుఁడిట్లనెను- "రాజా! ఇప్పుడు నేను దక్షప్రజాపతి యొక్క అరువది మంది కన్యల వంశవర్ణనము కావించితిని. దక్షుని అఱువదిమంది పుత్రికలలో ధర్మునికీయఁబడిన వారు వీరు- భాను, లంబ, కకుప్ జామి విశ్వ, సాధ్య, మరుద్వతి, వసు, ముహూర్త, సంకల్ప వీరికిఁ బుట్టిన సంతానము గూర్చియుఁ జెప్పెదను వినుఁడు."

ధర్మునిప్రథమభార్య భాను ఆమె పుత్రుఁడు దేవఋషభుఁడు. ఆతని పుత్రుఁడింద్రసేనుఁడు ద్వితీయ భార్యయగు లంబ కుమారుఁడు విద్యోతనుఁడు ఆతనికి స్తనయిత్నువు పుత్రుఁడు. మూఁడవ భార్యయగు కకుభకు సంకటుఁడు, ఆ సంకటుని పుత్రుఁడు కీకటుఁడు కీకటునక సంఖ్యాకులగు పుత్రులు పుట్టిరి వారందఱును

దుర్గాభిమాన దేవతలైరి. నాల్గవ భార్యయగు జామియందు స్వర్గుఁడను బుత్రుఁడుదయించెను. స్వర్గుని పుత్రుఁడు నంది. ఐదవ భార్యయగు విశ్వకు విశ్వదేవులను దేవతలు పుట్టిరి. విశ్వేదేవతల వంశము వృద్ధికాలేదు. వారందఱు నిస్సంతానులే. ఆఱవ భార్యయగు సాధ్యయందు సాధ్యులను దేవతలుదయించిరి. వారి కర్థసిద్ధుఁడను బుత్రుఁడుదయించెను. ఏడవ భార్యయగు మరుద్వతికి మరుద్వంతుఁడు, జయంతుఁడనువారిద్దిరు పుట్టిరి. ఈ జయంతుఁడే ఉపేంద్రుఁడనఁబడుచున్నాఁడు. ఈతఁడు విష్ణువుయొక్క అంశావతారము. ఎనిమిదవ భార్యయగు ముహూర్తయందు ముహూర్తాభిమానులగు దేవతలుదయించిరి. వారు ప్రాణులకు వారివారి కర్మానుసారముగఁ దమతమ కాలములందు యథా యోగ్యములగు ఫలములొసంగుచుందురు. ధర్ముని తొమ్మిదవ పత్నియగు సంకల్పవలన సంకల్పుఁడను బుత్రుఁడుదయించెను. ఈ సంకల్పుని కుమారుఁడే సమస్త శరీరములలో నశరీరుఁడై యుండి పీడించు కామదేవుఁడు కామోత్పత్తి సంకల్పము వలననే కలుగునుగదా! అధ్యవసాయము వీనికి సహకారి. ఇది చాల బలవత్తరమైనదియు దుర్జయమైనదియునై, యున్నది పదవ భార్యయగు వసువునందు ద్రోణ, ప్రాణ, ధ్రువ, అర్క, అగ్ని, దోష, వసు విభావసులను అష్టవసువులుత్పన్నమైరి. రాజా! ఈ ధర్ముని పదుగురు భార్యలందు కలిగిన సంతానమంతయు దేవగణములైరి. వీరందఱు శరీరములు దివ్యములు. వీరు మర్త్యలోకములోని స్థూల నేత్రములతోఁ గనఁబడు స్థూల ప్రాణులుకారు. వీరి అస్తిత్వమునందు శాస్త్రమే ప్రమాణము. వీరు యోగులయొక్క దివ్యదృష్టికి గనఁబడెదరు.

అష్టవసువులలోఁ బ్రథముఁడగు ద్రోణుఁడు అభిమతి (ఇచ్ఛా) యనుదానినిఁ బెండ్లాడెను ఆమెకు హర్ష, శోక, భయాది పుత్రులుద్భవించిరి. ఈ ద్రోణుఁడే ద్వాపరముస వ్రజమందు గోప రాజగు నందుఁడయ్యెను. ఈతని కాత్మజుఁడై ఆనందకందుఁడును, బృందావన చంద్రుఁడును నందనందనుఁడగు శ్రీకృష్ణచంద్రుడు దయించెను. రెండవవాఁడగు ప్రాణుఁడను వసువునందు ఊర్జస్వతి యను భార్యకు సహ, అయు, పురోజవులను ముగ్గురు పుత్రులుద యించిరి. మూఁడవవాఁడగు ధ్రువుఁడను వసువునకు ధరణియను భార్యయందు అనంఖ్యాకులగు దేవతలుద్భవించిరి నాల్గవ వసువగు అర్కునకు వాసనయను భార్యయందు తర్షాది అనేకులగు పుత్రులు దయించిరి, అయిదవవాఁడగు అగ్నియను వసువునకు వసుధార యను పత్నియందు ద్రవిణకాదులను ననేకులు పుత్రులుదయించిరి. దేవతల సేనాధియగు షణ్ముఖుఁడును అగ్నియొక్క కుమారుఁడే. కృత్తికల పుత్రుఁడనుటచేఁ గార్తికేయుఁడను పేరువచ్చెను. ఈ వర్ణనము ప్రసంగానుసారము కావింపఁబడును. ఈ స్కందునివల ననే విశాఖాది పుత్రులుదయించిరి. ఆఱవవాఁడగు దోషుఁడను వసు పువలన శర్వరీయను భార్యయందు శింశుమార చక్రముదయించెను. ఈతఁడు భగవ తుని యంశావతారము. ఏడవ వసువగు అంగిరసి యను భార్యయందు దేవతా శిల్పాధిపతియగు విశ్వకర్మ జనించెను. ఈతనికొడుకే చాక్షుసమనువు. ఈతనితో మనువుయొక్క విశ్వే దేవతలు, సాధ్యగణమును బుట్టిరి. ఎనిమిదవ వసువగు విభావసు ఉషయను భార్యయందు వ్యుష్టి, రోచిష, ఆతపులను ముప్వురు

పుత్రులుదయించిరి. అందులో ఆతపునకు పంచప్రహరలకు నభిమానదేవత లైదుగురు పుట్టిరి. వారు ప్రహర విభాగము జీవకర్మలందు తత్పరులగుచుందురు. ఇప్పుడు ధర్మనిపత్నుల వంశమైనది. ఇంక దక్షుని ఇతర పుత్రికల వంశవర్ణనమును వినుము.

దక్షప్రజాపతికి సరూప యనునొక కన్యక కలదు. ఆమె భూతుని వివాహమాడి ఆతనివలనఁ గోట్లకొలఁది రుద్రులనుగనెను. వారిలోఁ బదునొకండుగురు ఏకాదశ రుద్రులనఁ బడుదురు. వారు రైవత, అజ, భవ, భీమ, వామ, ఉగ్ర, వృషాకపి, అజైకపాద, అహిర్బుధ్న్య, బహురూప, మహత్తులని పిలువబడుదురు. భూతుని యొక్క రెండవ భార్యయందు భూత, ప్రేత, వినాయకాదులు పుట్టిరి. వారు రుద్రునకుఁ బార్షదులైరి.

దక్షుని యిద్దరు పుత్రికలు సతి, స్వధాయనువారు అంగిరుఁడను ఋషి వివాహమాడిరి. అందులో స్వధాదేవి పితృగణముల నుత్పన్నము కావించెను. రెండవయామె సతీదేవి అథర్వాంగిరసమను నుత్పన్నము కావించెను. ఇదే విధముగ నిద్దరిని కృశాశ్వుఁడను ఋషికి దక్షుఁడొసఁగెను. అందులోఁ బ్రథమ పత్నియగు నర్చి ధూమ్రకేశుఁడనువాని నుత్పన్నము కావించెను. రెండవయామె ధిషణ. ఈమె వేదశిరుఁడు, దేవలుఁడు వయునుఁడు మనువను నల్గురు పుత్రులను గనెను. ఈనల్గురు కూఁతుంద్రవలన ఋషి వంశము లుత్పన్నమయ్యెను.

దక్షప్రజాపతి వినత, కద్రూ, పతంగి, యామిని యను నల్గురు కన్యకలను తర్క్ష్యునకిచ్చి వివాహ మొనర్చెను. దేవతలను, ఋషులను, భూత ప్రేత పిశాచాదులకు, పితరులను, మనుష్యాదులను నందఱు బుట్టింపఁగలరు. నేను పశుపక్ష్యాదులను సృష్టించెనని తర్క్ష్యుఁడనుకొనెను. అందువలన వినత విష్ణువాహనమగు గరుడుని, ఆదిత్యుని సారధియగు నరుణునిఁ గనెను. కద్రువ నాగుల నుత్పన్నము కావించెను. పతంగి సమస్త పక్షుల నుత్పన్నము గావించెను. యామిని శలభ పతంగాది జీవ జంతువులను సృజించెను.

అంత శౌనకుఁడిట్లనెను– "సూతా! వినత, కద్రువ, పతంగి యామిని వీరు దక్షప్రజాపతి కూఁతుండ్రంటిరే పర్క్ష్య మునిపత్నులు గదా వీరు మనుష్యులవలె నుండిరా లేక కద్రువ సర్పిణివలెను, పతంగి పక్షిఆకారముగ నుండెనా? వీరు మనుష్యులవలెనే యుండినచో వీరివలనఁ బసు పక్ష్యాదులెట్లు కలిగెను?"

ఇదివిని సూతుఁడునవ్వి యిట్లనెను– "స్వామీ! ఇప్పుడు మీరుకూడ యిట్టిప్రశ్న నడుగుచున్నారు. స్వామీ! వీరందరును మాతలే. వీరికి సర్వ సామర్థ్యము కలదు, వీరేరూపమును గావల యుననిన నారూపమును జేయఁగలుగుదురు. దక్షప్రజాపతి కూఁతురు కావున నాకారమున వీరు మానవ స్త్రీలవలెనే యుండురు. కాని ఋషికప్పుడెట్టి సంకల్పము కలిగినదో అట్టి గర్భమే వారికి సంభవించెను. వారికి కఠినమైన విషయమేలేదు.

అంత శౌనకుఁడిట్లనెను- "సరియే సూతా! వినతా పుత్రుఁడగు గరుడుని విష్ణువు వాహనముగాఁ జేసికొనెనంటివి. అతనిని శ్రీమన్నారాయణుఁ డేవాహనముగాఁ జేసికొనెను? ఆతనికింకేమియును వాహనము దొరకలేదా? ఈగరుడునిలోనంతటి విశేషమేమున్నది? కాతని తేజః పరాక్రమములెట్టివి? ఈ విషయముల నన్నిటిని మాకు విస్తారముగఁ జెప్పవలయును. భగవంతుని వాహనమగు పావన చరిత్రమును మాకు వినిపింపుము.

ఇదివిని సూతుఁడు గంభీరముగ నిట్లనెను- "స్వామీ! ఇప్పుడు నేను దక్షకన్యల వంశవర్ణన మొనర్చుచున్నాను. విష్ణు చరిత్రమెట్లనంతమో ఆతని వాహనమగు గరుడుని చరిత్రమును నట్లేఅనంతము. ఇప్పుడిచ్చట నేను గరుడుని ప్రసంగమను విస్తారముగా బ్రారంభించునెడల నీప్రసంగమాగిపోఁగలదు క్రొత్తపురాణము ప్రారంభము కాఁగలదు. కావున ఇంక నీవిషయమును విస్తారమొనర్పక అత్యంత సంక్షేపముగ గరుడుని విషయము చెప్పెదను మీరు ధ్యానపూర్వకముగ నీపుణ్యప్రసంగమును వినుఁడు.

# తర్క్ష్య గరుడుఁడు, అరుణుఁడు

శ్లో॥ సుపర్ణాసూత గరుడం సాక్షాద్యజ్ఞేశ వాహనమ్।
సూర్య సూత మనురూంచ కద్రూర్నా గాననేకశః॥

శ్రీ భాగ. ౬ స్కం. ౬ అ. ౨౨ శ్లో॥

"వ . వినతకు సాక్షాత్కరించిన యజ్ఞాధి పతికి వాహనం బయిన గరుడుండును సూర్యునకు సారధియైన యనూరుండును జనియించిరి"

శ్రీమదాంధ్రభాగవతము.

జగదుత్పత్తి వినాశములు మనము శ్రీహరి నిత్యక్రీడ యను కొనినప్పుడింకే విషయములోను శంక కలుగదు. ఇట్లెందులకైనది?" ఇట్లు జరుగుట సంభవముకాదు అను ప్రశ్నలు మనమసత్తును సద్వస్తువుగను, అనిత్యమును నిత్యముగను భావించినప్పుడేవచ్చును ఈదృశ్యమానప్రపంచ మంతయు ప్రభు వినోదమనియు, అతని స్వాభావిక క్రీడయనియు నంగీకరించినచో నిది యాతని మాయ యనియు, మాయయందు నసంభవమనునది లేదనియు, నంతయు సంభవమేననియు జెప్పుదురు. శంకను, జింతను మనము స్వయ ముగ గ్రహింతుము.మనకుమనమే మానావమానములు మంచిచెడ్డలు, గ్రాహ్యాత్యాజ్యములు మొదలగు ద్వంద్వములను గల్పించుకొని సుఖదుఃఖములను బొందుచుందుము. నీవు సర్వత్ర నీశ్యామసుం

దర స్వరూపమునేలఁ జూడవు. ఆగరుడ ధ్వజుఁడే తనవినోదము కొరకు ఒక్కొక్కచోట నోడిపోయి ఒక్కొక్కచోట నోడించు చుండునని యేల తలంపవు ? ఒక్కొక్కచోట కూర్మమగును, మఱియొకచోఁ బఱపక్షులగును. అతఁడే అందఱిలో రమించు చున్నాఁడు. అతఁడే క్రీడించు చున్నాఁడు. అంతయు నాతని మాయాప్రసారమే.

సూతుఁడిట్లనెను- "మునులారా! మానవుల మనస్సులలో నిత్యనూతన సృష్టి యెట్లు జరుగుచుండునో, అట్లే బ్రహ్మయొక్క ప్రతిదినమందును నూతనసృష్టి జరుగుచుండును. సృష్టిలోఁ గొన్నింటిలోఁ గొలదిగనో గొప్పగనో తేడాలుండును. దీనినిఁ గల్పసృష్టి యందురు. ఒకానొక కల్పమందు గశ్యపునకు పదునేడుగురు భార్యలని చెప్పఁబడినది. ఇంకొకచోటఁ దార్క్ష్యమునికి వినతా, కద్రూ, పతంగీ యామినీ యను నల్గురు భార్యలను చెప్పబడినది. ఒక్కొక్కచోట తర్క్ష్యనామము కశ్యపుఁనకు బర్యాయపదమని తోఁచు చున్నది. కల్పభేదమువలన నీయల్ప భేదము గోచరించుచున్నది గరుత్మంతుఁడు భగవంతుని వాహనమెట్లయ్యెనని మీరుప్రశ్నించితిరి. ఇప్పుడు నేను సంక్షేపముగ గరుడోత్పత్తినిగూర్చి చెప్పి, ఆతని తర్వాత చరిత్రమును జెప్పెదను. వినతా కద్రువ లక్కచెల్లెండ్రు. ఇద్దరు నొకే భర్తను వివాహమాడిరి. సాధారణముగ చెల్లెండ్రకుఁ బ్రేమయుండును. వారు సవతులైనప్పుడప్పుడప్పుడు పోట్లాటయు వచ్చుచుండును. ఈసవతి మత్సరము వలన స్త్రీలనేకములగు నయోగ్య కార్యములను జేయునట్టి సవతి మత్సరము

నేర్పాటు చేసినాఁడు. ఒకానొక దినమున వినతా కద్రువలపై వారి పతి ప్రసన్నుఁడై ఇద్దరను వరములను గోరుకొమ్మనెను. అంతఁ గద్రువ వరమడిగెను- "నాకు వేయిమంది సుందరులగు నాగులు దృభవింప వలయును." అట్లే వినత పరాక్రమవంతులను కోరుకొనెను. పతిప్రసన్నతవలన నిద్దరకును వరములు లభించెను. నియమాను సారముగ కద్రువకు వేయి గ్రుడ్లులు. వినతకు రెండు పెద్ద పెద్ద గ్రుడ్లను బుట్టెను దాసీలు గ్రుడ్లనన్నిటిని వేరు వేరుగవెచ్చని ప్రాతలలోఁ బెట్టిరి.

మునులారా! నియమమేమనఁగా బాలకులెంత యధిక కాలము గర్భములో నుందురో వారంత బలముగ నుందురు. చాలమంది పిల్లలేడు నెలలకే పుట్టుదురు వారుచాల దుర్బలులుగ నుందురు. అయిదు వందల సంవత్సరములైన తర్వాత కద్రువయొక్క అండములన్నియు వాటికవియే పగిలి వాటినుండి గొప్పగొప్ప బలముగల విషధర సర్పములు బయటపడెను. వారందరును స్వభావమునఁ గ్రూరులై ప్రజలందరకును బీడను గలిగించుచుండిరి. కద్రువయొక్క వేయిమంది కుమారులిటునటుఁ గిలకిలలాడుచుండిరి కాని వినతయొక్క అండములట్లేయుండెను వినత హృదయములో సవతి మత్సరము కలిగెను- అయ్యో! ఈమె వేయిమంది బిడ్డలిటునటుఁ గిలకిలలాడుచుఁ దిరుగుచు నామెకు సుఖమును గలిగించుచున్నారు. వీరు తమ తల్లినెంతో ప్రేమించుచున్నారు ఒక్కొక్కప్పుడు వడిలోఁ గూర్చుండు చున్నారు. వేఱొకప్పుడు చంకను

ప్రేలాడు చుందురు. మఱొకప్పుడు నెత్తికెక్కుచుందురు. నాకిద్దరే కదా పుట్టునది పుత్రులు. వారును నింతవరకు కలుగనే లేదు ఎంత ఆలస్యముగఁ బుట్టిన వారంత చిన్నవారుగ నెంచఁబడుదురు. నాసవతి బిడ్డలు పెద్దవారయ్యెదరు. ఈ సవతి మత్సరముచే నామె ఒక గ్రుడ్డును బగులగొట్టెను. పగులఁగానే దానినుండి పరమ తేజస్వియగు నొకబాలకుఁ డుద్భవించెను. ఆతని నాభికి పైనున్న అంగములన్నియు నేర్పడినవి. కాని నాభికి క్రిందనున్న కాళ్ళు మొదలగునవి యేర్పడనేలేదు. విలక్షణమగు బాలుఁడుగ నుండెను. తన తల్లియొక్క అధీరతకును, నీర్షకును నాతేజస్వియగు బాలకునకుఁ దల్లిపైఁగోపము వచ్చెను. ఆతఁడు క్రోధోద్రిక్తుఁడై తల్లికి శాపమొసంగెను- అమ్మా ! నీవు మోహవశమున, నీర్ష్యా కారణమున నన్నుఁ గుంటివానిఁగా నొనర్చితివి. నీవు యేయమకంటె నున్నతిలో నుండవలయునను కొంటివో ఆమెకు నీవైదువందల సంవత్సరములు దాసివి కావలసి వచ్చును. ఈ నా సోదరుని గ్రుడ్డును నీవు మధ్యలోఁ బగులఁగొట్టక. ధైర్యముతో నాతని జన్మకొరకై ప్రతీక్షించు చుంటివా, అయిదువందల సంవత్సరముల మీఁదట నీతఁడు పుట్టి నిన్ను దాసీత్వమునుండి విముక్తి నొనర్పఁ గలఁడు" ఇట్లు పలికి ఆతఁడాకాశమున కెగిరిపోయెను. అచ్చట సూర్యభగవాను నారాధించి త్రైలోక్య పరిక్రమ మొనర్చునట్లు వరమును బొందెను. కుంటివాఁడు పరిక్రమ మెట్లు చేయఁగలఁడు? అందువలన సూర్యభగవానుఁ డాతనిని దన రథ సారధిగ నొనర్చెను. ఆతనికి అరుణుఁడను పేరు కలిగెను. మునులారా !

ప్రారబ్ధముయొక్క విచిత్ర మహిమను జూడుఁడు. సూర్యమండల మెంత గొప్పది ! భువన భాస్కరుని రథ మెంతటి విస్తృతమును దివ్యమునైనది. దానికి సప్త ఛ దస్సులే గుఱ్ఱములు. అట్టి యను పమ దివ్య రథమునకు సారథి కుంటివాఁడు. ఆతఁడు సూర్యునకుఁ బృష్ఠమును జూపింపఁడు. కావున నాతఁడు సూర్యునకెదురుగా నుండి గుఱ్ఱములవైపు పృష్ఠమునుంచి పగ్గములను బట్టుకొని తోలు చుండును. ఈ విధముగ రథము మీఁదఁ గూర్చుండియే ఆతఁడు పృథివికిఁ బ్రదక్షిణము మొనర్చు చుండును. నిత్యము సూర్యోద యమునకుఁ బూర్వమరుణోదయమగు చుండును. అరుణ దర్శన మైన తర్వాతనే సూర్యదర్శనమగు చుండును. నేనిప్పుడు మీకు గరుడుని యన్నయగు నరుణుని కథను సంక్షిప్తముగఁ జెప్పితిని. ఇఁక నిప్పుడు మీరు గరుడుని కమనీయ కథను వినుఁడు.

మునులారా! సమర్థుల శాపము కానిండు అనుగ్రహము కానిండు వ్యర్థము కాఁజాలదు పాపమరుణునివలన వినతకు శాపము వచ్చినది. అది పూర్తికావలయును. ఒక దినమున దైవయోగమున వినతా కద్రువలు కూర్చుండి యుండునంతలో నాకాశము మీఁదుగా సముద్రమంథన సమయమునఁ బుట్టిన దివ్య ఉచ్చైశ్శ్రవమను నశ్వము పోవుచుండెను. పాలనురుగువలెఁ దెల్లగానున్న నాయప్రా కృతాశ్వము ద్వితీయ పూర్ణచంద్రునివలెఁ గనఁబడు చుండెను. దానినిఁ గాంచి కద్రువ వినతతో నిట్లనెను :- "అక్కా! ఉచ్చైశ్శ్ర వము రంగెట్లున్నది?"

నవ్వుచు వినత యిట్లనెను - "ఇది గూడ అడుగవలసిన ప్రశ్నయేనా ? ఉచ్చైశ్శ్రవము తెల్లఁగానున్నది."

కద్రు విట్లడిగెను - "అయితే దానితోఁక వెండ్రుక లెట్లున్నవి ?"

వినత యిట్లనెను- "ఇది యెట్లు తెల్లఁగానున్నదో దీని తోఁకయు నట్లే తెల్లఁగా నున్నది. తెల్లపట్టువలెఁ గ్రిందవరకు వ్రేలాడు చుండిన దీనితోఁక యెంత మనోహరముగ నున్నది !"

కద్రువ యిట్లనెను- "అక్కా! నీవుకూడ యింత తెలివి తక్కువ దానవేమే ? దీనితోఁక నల్లఁగా నున్నది" అంత వినతకుఁ గోపమువచ్చి యిట్లనెను - "నీవెంత పొరపాటుగా మాటలాడు చున్నావు. కల్లేమియుఁ ద్రావలేదు కదా ! నీకన్నులకుఁ గమలా రోగమునకు బదులుగఁ గామిలారోగము రాలేదు కదా తెల్లనిది నల్లగాఁ గనఁబడుటకు ? లేక నీమనస్సు మలినము చెందినదా ?" అనిపలికి వినత పకపక నవ్వెను.

వినత నవ్వుటను గాంచఁగానే కద్రువకుఁ గోపమువచ్చెను. తన యసత్యపుమాట మీఁదనే నిలువఁబడి ఆమె యిట్లనెను - "నేనొక్కసారి కాదు. వేయిసార్లు చెప్పెదను. ఉచ్చైశ్శ్రవము తోఁక నలుపే. ఇంటిలోఁ జెప్పెదను, బయట చెప్పెదను, ఆకాశమునఁ జెప్పెదను, పాతాళమునఁ జెప్పెదను. ఢంకామీఁద దెబ్బ కొట్టి చెప్పెదను.''

వినతకును గోపము వచ్చెను. ఆమె యిట్లనెను - "నీవు వట్టి పిచ్చిదానవే. వట్టి మాటపైననే నిలిచితివి పందెము వేయుము, ఉచ్చైశ్శ్రవముతోఁక నల్లగా లేకపోయినచో ?"

కద్రువ ఆ మాటమీఁద నిలువఁబడి యిట్లనెను- "సరియే తోఁక నల్లగాలేకుండినచో నేను జీవించియున్నంత వరకు నీకు దాసిగా నుందును. నీకు సేవ చేసెదను. ఏమిచెప్పిన దానినిఁ జేసెదను. అదినల్లగానే యుండినచో నీవు నీజీవితమంతయు నాకు దాసిగా నుండవలెను. అంగీకారమేనా ? చెప్పుము ?"

వినత గట్టిగా నిట్లనెను- "సరియే. వెనుకకు తగ్గరాదు. ఎగతాళికాదు. అటులే చేయవలయును."

మాటలలోనే, నవ్వులలోనే పందెము స్థిరపడినది. ఇప్పుడు కద్రువకు చింతకలిగెను. వాస్తవమున నుచ్చైశ్శ్రవ మంతయు నచ్చ తెలుపే. తోఁక వెండ్రుకలును దెలుపే. ఇప్పుడేదో మీఁదు క్రిందు క్రిందు మీఁదుఁ జేయవలెను. అంత నామె తన పుత్రులగు నాగులను బిలిచి యిట్లనెను - "పుత్రులారా ! నేను వినతతోఁ బందెము వేసితిని. మీరందరును నల్లవెండ్రుకల వలెఁ గనఁబడు లాగున నుచ్చైశ్శ్రవము యొక్క తోఁకకుఁ బట్టుకొని వ్రేలాడుఁడు ఈ పందెములో నేను గెలువవలయును" ఇది విని వారిలో సగము మంది సర్పములు తమ తల్లి యొనర్చు నన్యాయము నంగీకరింపక పోయిరి. అంతఁ గద్రువకుఁ గోపము వచ్చి జనమేజయుని యజ్ఞమున భస్మము కండని వారిని శపించెను. మిగిలినవారు వెళ్లి ఉచ్చైశ్శ్రవము తోకకుఁ జుట్టుకొనిరి.

అక్కచెల్లెండ్రు సముద్రమును దాఁటి ఉచ్చైశ్శ్రవమును జూడఁబోయిరి. వెళ్ళి, ఆకాశముననున్న పూర్ణచంద్రునివలె నుజ్జ్వలమై ప్రకాశించు నుచ్చైశ్శ్రవమును గాంచిరి. అది పాంచజన్య శంఖమువలెను, వికసించిన మల్లెమొగ్గవలెను, పాలనురుఁగుఁబోల్కి, హంసఱెక్కల ఛక్కిని, రోగరహితయై నవ యౌవనవతియగు నారీ దంతముల చాడ్పున, తెల్లసున్నమలఁదిన భవనమురీతి, చలువ జేసిన గుడ్డుమాడ్కి బాలుకుని మధురహస్యము రేవ, ఆకాశమున నెగురు ఒక పంక్తినిబోలి, పుష్పించిన కాసపుష్పములవలె శ్వేత వర్ణముగ నుండెను. కాని దాని తోఁక నాగులచేఁ జుట్టుకొనఁ బడుటచే నల్లగ గనఁబడుచుండెను. దీనినిఁ జూడఁగానే వినతకు దుఃఖము కలిగెను. ఆమె వివశయై కద్రువకు దాసియయ్యెను. మునులారా! ఈర్ష్యా ద్వేషములచే మానవుఁడనుచిత కార్యము లొనర్చి గర్వించుచుండును. కద్రువ వినతను క్షమింపలేదు సరి కదా ఆమెను తన దాసిగా నొనర్చుకొని ఇష్టమువచ్చినట్లు సేవ చేయించుకొనుచుండెను. ఈ విధముగ వినత కద్రువ సేవచేయుచు నైదువందల సంవత్సరములు గడిపెను.

ఇప్పుడు గరుత్మంతుఁడుద్భవింప వలసిన సమయముకూడ ఆసన్నమయ్యెను. ఆతఁడు గ్రుడ్డును బ్రద్దలుచేసికొని స్వయముగ బయటకు వచ్చెను. ఆతఁడు మహాతేజస్వి, పరమ పరాక్రమవంతుఁడు, మంచి విశాలకాయము కలిగి బలము కలిగినవాఁడు.

ఆతని తెక్కలు బంగారమువలె నుండెను. ఆతఁడపర వైశ్వాన రునివలె మెరయుచుండెను. పుట్టఁగానే ఆతఁడాకాశమున కెగిరెను. ఆతనిని గాంచఁగానే దేవతలు దేహములు మరచి గడగడ వణఁక సాగిరి. ఇంద్రుని స్థితి శోచనీయమైయుండెను. శీఘ్రతతో నాతఁ డగ్నితో నిట్లనెను- "అగ్నిదేవా! నీకంటె నధికతేజముగల యీ జీవి యెవరు? ఈతఁడు నావైపునకుఁ బరువిడి వచ్చుచున్నాఁడు. ఈతఁడు స్వర్గ వినాశనమును గావించునా యేమి?"

త్రిలోకాధిపతియగు దేవేంద్రుని యీ మాటలను విని అగ్నిదేవుఁడు నవ్వి యిట్లనెను- "దేవేంద్రా! మీరు భయపడ వలదు వాస్తవమున నీతఁడు నాకంటెను దేజస్వియేకాని యీతఁడు దేవపక్షపాతి. ఈతఁడు రాక్షసులను నాగాదిక్రూరకర్ములను నాశన మొనర్పఁగలఁడు, దేవతలందఱు వెడలి యీతనిని స్తుతింప వల యును. ఇది వినఁగానే చేతులలోఁ గల్పవృక్ష పుష్పముల గైకొని దేవతలందరు గరుత్మంతుని స్తుతించుటకు వచ్చి, వివిధ విధము లగు స్తోత్ర పాఠములచే నాతనిఁ బ్రశంసించిరి. చివరకిట్లనిరి - ఓ ప్రభూ! నిన్ను నేటినుండి పక్షులన్నిటికి నింద్రునిగా నొనర్చు చున్నాము. నీవిప్పుడీ యుగ్రరూపమును సంవరణము కావించుము ఈ భయంకర శరీరమును జిన్నదిగా నొనర్చి సర్వదా మమ్ముఁ గృపఁజూడుము" గరుత్మంతుఁడు దేవతల ప్రార్థనమును స్వీక రించి చిన్నవాఁడై తన తల్లిపడిలో నాడుకొనసాగెను.

ఈతఁడు కద్రువ దాసియగు వినతా తనయుఁడు. తల్లి దాసియగుటచేఁ దనయుఁడును దాసుఁ డయ్యెను. అందువలన కద్రూ పుత్రులగు నాగులు మమ్ముల నటు వీఁపు మీఁదఁ దీసికొని పోవలెను, ఇటు తీసికొనిపోవలెను. మా యీ పనినిఁ జేయుము, ఆ పనినిఁ చేయుము, అనుచుందురు గరుడుఁడు తల్లిమీఁదఁగల గౌరవమున సమస్త కార్యములను జేయుచుండును గాని లోపల చాల కోపము వచ్చుచుండెడిది. మాతాజ్ఞయగుచో నీదుష్టుల నందరను నమిలి మ్రింగవలయునని కలదు కాని తల్లి యాజ్ఞకు కట్టుబడి యుండెను.

ఒక దినమున నాతఁడు తన తల్లితో నిట్లనెను- "అమ్మా ఈ నాలుగు మనచే దాసత్వమేల చేయించుచున్నారు ? నీవు నాగ మాతయగు కద్రువనేల యెత్తుకొని తిరుగుచున్నావు ?"

అంత వినత కన్నులనీరు నించుచుఁ గథను నాద్యంతము వినిపించి యిట్లనెను- "నాయనా ! నాకిట్లు మోసము జరిగినది. ఇప్పుడేమి చేయుదుము ? మనము జీవించి నంతకాలము వీరికి దాస్యము చేయవలసి యుండును: నీవు సమర్థుఁడవు. నీవు తలంచు కొనిన నా దాస్యమును వదలింపఁగలవు."

ఇది విని గరుత్మంతుఁడు కద్రువను నాగులను ప్రోవు చేసి యిట్లనను- "మీరందరు నావలన నేదైన పనిని జేయించు కొనుఁడు మీకెట్టి దుర్లభాతి దుర్లభమగు కార్యమునైనఁ జేసిపెట్టఁ

గలను. కోరుకొనుడు దానివలన నాకును నాతల్లికిని దాస్య విముక్తి కావలెను.''

నాగులిట్లనిరి- ''నీవు మాకు స్వర్గమునుండి యమృతమును దెచ్చిపెట్టుచో నీకును నీతల్లికిని దాస్యవిముక్తి కాఁగలదు.''

గరుడుఁడు తన రూపమును బెంచి, ప్రచండాగ్నివలెఁ బ్రజ్వలించుచు నాకాశ మార్గమున స్వర్గమున కెగిరెను, ఆతని యీ భయంకర రూపమును గాంచి జీవులందఱు భయపడిరి. ఇంత దూరము పోవుచున్నాను కొంచెమల్పాహారమును జేసి పోయెద మనుకొని తల్లితో నిట్లనెను - అమ్మా! ఏదైన నల్పాహారమున్నఁ జెప్పుము తల్లి యిట్లనెను - ''నాయనా! నీవపర హిమాలయ పర్వతమువలె విశాలకాయుఁడవు. నీకు సాధారణ వస్తువులచేఁ గడుపు నిండదు ఈ ద్వీపమందు దస్యులు, క్రూర కర్ములు, దోపిడిగాండ్రు చాలమంది యాభీర నిషాదులు కలరు. వారినిఁ దిని పొట్టనింపుకొనుము. కాని బ్రాహ్మణులఁ దినవలదు. నీనోటిలో దాహము పుట్టించినను, అగ్నివలెఁ గాల్చినను వారినిఁ గ్రక్కవల యును. ఇది విని గరుడుఁడు ఆభీరులను పప్పులు నమిలినట్లు నమలసాగెను. ఆనమలుటలో నాతని పురోహితుఁడును గరుడుని నోటిలోనికిఁ బోయెను. కంఠము కాలుటను గాంచి యాతఁడా బ్రాహ్మణుని ఆతని దారా పుత్రాదులను పరివారముతో సహా గ్రక్కెను. కాని యింతటి భోజన మాతనికిఁ జూర్ణమువలె నుండెను.

అందువలన నాతని క్షుధవృద్ధియయ్యెను. తిని, త్రాగి యెగిరెను. దారిలో సుమేరు పర్వతమున నాతని తండ్రిని గలిసికొనెను. కుశల ప్రశ్నలైనమీఁద గరుత్మంతుఁడిట్లనెను- "మర్త్యలోకముతో నంతయు బాగుగనే యున్నది కాని అచ్చట నాకడుపు నిండలేదు. ఇప్పటికిని నాకు మిక్కిలి ఆఁకలి వేయుచున్నది. నాకేదైన నాహారమును జెప్పుడు తండ్రి కొంత యాహారమును జెప్పఁగా దానినిఁ దిని యాతఁడు స్వర్గమునకుఁ బోయెను.

దేవత లమృతమును జాల జాగ్రత్తగఁ గాపాడు చుండిరి. అమృతకలశ మత్యంత సురక్షితస్థానమున నుంచఁబడినది. దానిపై దీక్షణముగల చక్రమెల్లప్పుడు దిరుగుచుండును. అందువలన దాని నెవరును దాఁకఁ జాలకుండిరి. గరుడుఁడు చాల సూక్ష్మరూపమును ధరించి దానిలోఁ బ్రవేశించెను. లోపల దానిని రెండు విష సర్పములు రక్షించుచుండెను. గరుత్మంతుఁడు వానిని పండిన మామిడి పండును జీకినట్లు చీకివేసెను. సర్పములను జంపి, ఆ చక్రమును విరచి, అమృత కలశమును గైకొని, గరుత్మంతుఁ డిటునటు పోయెను. దేవతలందఱును వానిముఖమునట్లే చూచుచు నూరకుండిరి, దేవతల అస్త్రశస్త్రములన్నియు నట్లే నిలిచిపోయెను. ఇంద్రుని బలము వ్యర్థమయ్యెను. గరుడుని యెదుట కెవ్వరును వెళ్లఁజాలకపోయిరి. అందఱును నిర్ఘాంతపోయి గరుడునిఁ చూడ సాగిరి. అతని బలపరాక్రమములను గాంచి, యందరును భయభీతులై చకితులై యుండిరి.

గరుడుఁ డమృత కలశమును గైకొని నిర్భీకుఁడై యాకాశమున కెగిరెను. కొంచెమమృతమును గ్రోలి తానుగూడ అజరామరుఁడు కావలయునని ఆతనికిఁదోచ లేదు. ఎంతటి నిర్లోభత్వము! ఎంతటి సంయమము!! ఎంతటి సాహసము!!! భగవంతుఁడీతని నిస్పృహతకు సంతసించి మార్గమున నీతనికి దర్శనమొసంగి యిట్లనెను- "గరుఁడా! నీ వితరులెవరును జేయఁజాలనంతటి సాహసము నొనర్చితివి. నీ వొక్కఁడవు స్వర్గమునకుఁ బోయి దేవతలందఱును చూచుచుండఁగనే బలాత్కారముగ నమృతమును హరించి, ఆ కార్యముకంటె గొప్పగునట్టి యనుపమయమూల్య పదార్థమగు నమృతమును బొందియు దానినిఁ ద్రాగవలయునను ప్రలోభమును జెందవైతివి. అందువలన నీనిస్పృహతకు నేను సంతసించితిని, నీకు కావలసిన వరమునడిగికొనుము."

ఇది విని గరుత్మంతుఁడు వినయముతో నిర్భయుఁడై యిట్లనెను- దేవా! నాకు మీరు వరమీయఁదలఁచుచో సర్వదా నీకంటెఁ బైననుండునట్లు వరమొసంగుఁడు. నేను మీ ధ్వజమందుండవలెను. మీకు గరుడధ్వజుఁడను పేరు రావలయును. నేనమృతపానము చేయకయే అజరామరుఁడుగను నపరాజితుఁడుగను నగుదును."

అవినాశియగు నారాయణుఁడిట్లనెను- "తథాస్తు గరుడా! అట్లేయగుఁగాక! నేఁటినుండి నీవు నా ధ్వజమందుందువు. సదా అజరామరుఁడవై యుండెదవు."

ఇది విని గరుడుఁడు నిర్భయుఁడై యిట్లనెను - "మధు సూదనా ! నేను మీ కొక వరమీయఁదలఁతిని. నీవు నన్ను నిచ్ఛా నుసారముగఁ గోరుకొనుము."

ఇది విని నవ్వుచు శ్రీహరి యిట్లనెను- "పక్షిరాజా ! నీవు నాకు వరమీయదలఁచుచో నీవు నాకు వాహనము కావలయును నేను నీ వీఁపుపైఁ గూర్చుండి యెగురుచుందును."

గరుత్మంతుఁ డిట్లనెను- "సరియే ఇంతవరకు నేను నాగులను మోయుచుంటిని. ఇప్పుడిఁక శంఖచక్రధారియగుఁ జతుర్భుజుని మోయుదును." ఇట్లు పలికి గరుడుఁడు భగవంతునకుఁ బ్రణామ మొనర్చి వెళ్లునంతలో భగవంతుఁడచ్చటనే యంతర్థానమయ్యెను.

సూతుఁడిట్లనెను - "మునులారా ! గరుత్మంతుఁడెట్లు భగవంతునకు వాహనమయ్యెనని యడిగితిరి. ఆ వృత్తాంతమును నేను మీ కిప్పుడు చెప్పితిని ఇప్పుడింకేమి వినగోరుచున్నారు ?"

అంత శౌనకుఁ డిట్లడిగెను - "సూతా ! నీవు గరుడుని యద్భుత కథను జెప్పితివి. మహాభాగా ! గరుడుని యీ బల పరాక్రమములను వినఁగానే మా యాశ్చర్యమునకు మేఱలేకున్నది. ఇంద్రుఁడుకూడ యెవని సమ్ముఖమున గడగడవణఁకెనో అట్టి వాఁడు సామాన్యుఁడా ? గరుత్మంతునికింతటి బలమెట్లువచ్చినది ?

ఎవనివరమువలన సీతఁడింతటి బలవంతుఁ డయ్యెను. ఈ విషయ మునుగూర్చి మా కింకను జెప్పవలయును.''

ఇది విని సూతుఁడిట్లనెను- "మహాభాగా! ఇతరుల దుర్బలతను గాంచి నవ్వువాఁడొకానొక దినమునఁ దాను లజ్జితుఁడు కావలసియుండును. మునులారా! లోకములో మనమెట్టి కార్యము లొనర్చెదమో అట్టి ఫలమునే పొందెదము."

కశ్యపుఁడొకసారి ఒక యజ్ఞమొనర్చుచుండెను, దేవతలు, ఋషులు, అసురులు, పశుపక్ష్యాదు లన్నియు నాతని పుత్రులే. తండ్రి యజ్ఞమునఁ దోడ్పడుటకందఱును వచ్చిరి. కశ్యప పుత్రులలో వాలఖిల్యులను ఋషులుగలరు. వారంగుష్ఠ మాత్రపు పురుషులు. వారు చెట్లపైఁ దలక్రిందుగ వ్రేలాడుచుఁ దపస్సును జేయుచుందురు. తండ్రి యజ్ఞమొనర్చుచున్నాఁడని విని వారును విచ్చేసిరి. కశ్యపుఁడు ప్రేమతో దేవేంద్రుని, వాలఖిల్యులను సమిధలు తెండని పంపెను. ఇంద్రుఁడు పొడుగుగను బలముగ నున్నాఁడు. కావునఁ బెద్ద పెద్ద కాష్ఠములనెత్తికొనెను. పాపము వీ రంగుష్ఠమాత్రులు కావునఁ జీమలవలె వేలమంది కలిసి ఒక చిన్న సమిధను దీసికొనివచ్చుచుండిరి దారిలో నెద్దుగిట్టచే గుంటబడిన నీటి గుంట యొగటి అడ్డమువచ్చెను. దానిలో నందఱును మునిఁగిరి. కాష్ఠ మొకవైపు కొట్టుకొనిపోయెను. వీరు కప్పపిల్లలవలె నటునిటు నీదుచుండిరి. దీనినిఁ జూడఁగానే ఇంద్రునకు పెద్ద నవ్వువచ్చెను. వీరును జీవులే. ఎద్దడుగు నీటిలో వీరు మునుఁగుచున్నారు.''

వాలఖిల్యులు చూచుటకుఁ జిన్నవారే కాని తపస్సులో నింద్రుని మించినవారు. అందువలన నింద్రుని యీ యవినయము నకు వారికి కోపమువచ్చి వారిట్లనిరి- "ఓరీ! మమ్ములను చూచి నవ్వుచున్నావా? మా శక్తిని గాంచుఁడు. ఒకానొకప్పుడు నిన్నింద్రపదవినుండి తొలఁగింపకున్న మా పేరు వాలఖిల్యులు కాదు." అని పలికి యింకొక ఇంద్రుని కొరకు యజ్ఞ మొనర్ప సాగిరి.

ఇప్పుడు ఇంద్రుని గర్వమడఁగిపోయెను. గబగబ పరు విడి తన తండ్రికడకుఁ బోయి సమస్త వృత్తాంతమును జెప్పెను. కశ్యపుఁడు వాలఖిల్యులకడకుఁబోయి అనునయ వినయములతో నిట్లనెను - "నాయనలారా! పగను బెంచుకొను టెందులకు? యింద్రుని నింద్రునిగానే యుండనిండు ఈతనినిఁ దొలఁగించుట వలన మీకేమి లాభము."

బ్రహ్మ యీ యింద్రుని త్రిలోకాధిపతిగ నొనర్చినాఁడు మీరిప్పుడింకొక యింద్రు నేర్పరచుచున్నారు. ఇట్టి యన్యాయమును జేయకుఁడు బ్రహ్మ యాజ్ఞను మీరే మన్నింపకున్న నింకెవరు మన్నింపఁగలరు?"

వాలఖిల్యులిట్లనిరి- "అయితే స్వామీ! మే మిప్పుడు చేసిన యజ్ఞయాగములు వృథాకావలసినదేనా?"

కశ్యపుఁడు శీఘ్రముగ నిట్లనెను - "కాదు, అట్లు కాదు, మీ యజ్ఞము, మీ సంకల్పము వ్యర్థముకావలయునని నేనంటినా?

మీ యజ్ఞ ఫలస్వరూపముగ నింద్రుఁడవశ్యముత్పన్నము కాఁగ లఁడు ఆతఁడు దేవేంద్రుఁడుగాక పక్షీంద్రుఁడు కాఁగలఁడు. ఆతఁడు బల, పరాక్రమ, తేజఃకీర్తులయందు నింద్రుని మించఁగలడు. ఇంద్రుఁడును నాతనిముందు దేనికినిఁ బనికిరాఁడు."

సూతుఁ డిట్లనెను - "మునులారా ! ఆ వాలఖిల్యుల యజ్ఞ కారణముననే గరుడుఁడు ఇంద్రునికూడ ఓడించునంతటి బలవంతుఁ డయ్యెను."

ఇది విని శౌనకుఁ డిట్లనెను - "సూతా! తర్వాతనేమైనది? గరుత్మంతుఁడు తన తల్లియగు వినతయొక్క దాసత్వము నుండి విముక్తినిఁ గలిగించెనా లేదా ? నాగు లమృతపాన మొనర్చిరా లేదా ?"

ఇది విని సూతుఁడిట్లనెను - "స్వామీ ! అది చాల పెద్ద కథ, దీనిని నేను మీ కెంతవరకు చెప్పగలను ? నేను గరుత్మంతుఁడు భగవంతునకెట్లు వాహనమయ్యెనో చెప్పుటకుఁగడంగితిని. దానికి ప్రత్యుత్తరమును జెప్పితిని ఇంద్ర, గరుత్మంతులకు మైత్రి యెట్లయ్యెనో సంక్షేపముగఁ జెప్పెదను వినుఁడు. గరుత్మంతుఁ డమృతమును దీసికొనివచ్చి నాగులముందుంచునట్లును, నాగులు మీ తల్లికొడుకులిద్దరు దాస్యవిముక్తినిఁ జెందితిరనఁగానే యింద్రుడు వెళ్ళి యమృతమును దీసికొనివెళ్ళునట్లును సంధికుదిరినది."

జరిగినవిషయమిది. గరుత్మంతుఁడు నాగులతో నిట్లనెను:- "సోదరులారా! ఇదిగో అమృతమును గొనుఁడు. అమృతమును బొంది వారుబ్బిపోయి యిట్లనిరి :- "మంచిది, అన్నయ్యా అమృతమును దెచ్చినాఁడు స్నానాదులచేఁ బవిత్రులమై యీ పావనపేయమును బానమొనరించెదము"

గరుత్మంతు డిట్లనెను :- 'మీందఱును స్నానమొనర్చుఁడు. నేను దీనినిఁ గుశలపైబెట్టెదను. మేము దాస్యవిముక్తినిఁ జెందితిమి గదా!"

నాగులిట్లనిరి :- "అవునవును విముక్తిజెందితిరి" అని పలికి వారు స్నానమాడఁబోయిరి. ఇంతలో దేవేంద్రుఁడు వచ్చెను గబుక్కున నమృతభాండమును గైకొని యెట్టులో వెడలిపోయెను నాగులట్లే చూచుచుండిరి. ఒకరిని మోసగించినవారు తా మొకనాటికి మోసపోవుట నిజము. మునులారా! ఈ విధముగ వినతాతనయుఁడగు గరుడుఁడు తన బల పరాక్రమము, నిర్లోభత మూలమున వాసుదేవునిఁ బ్రసన్నుని గావించుకొనెను. ఇంద్రునితో మైత్రియొనర్చెను సవతిబంధనమునుండి తన తల్లిని విముక్తికావించినాఁడు దుష్టనాగులను బాగుగాఁ బనిపట్టెను. తార్క్ష్య కుమారుఁడగు తన యశముచే సమస్త ప్రపంచమును నింపివేసెను. భగవానుఁడాతని మూఁపుపైనుండి యసుర సంహార మొనర్చుచుండఁగా గరుఁడుడు తన ఱెక్కలచే లక్షలకొలఁది యసురులను యమపురమునకుఁ బంపుచుండెను. ఈతఁడెగురుఁగానే యాతని పక్షములనుండి సామ

వేదమంత్రములు తమకుఁదామే వెలువడు చుండును. దాని ప్రతీకమే గరుఁడగంట - పూజలో గంటను గొట్టినచో మంత్రములు లేకున్నను బూజ సఫలమగును. నేను భగవంతుని వాహనమగు గరుడుని చరిత్రమును సూర్యసారధియగు నరుణుని వృత్తాంతమును మిక్కిలి సంక్షేపముగఁ జెప్పితిని. ఇప్పుడు మీరేమి వినఁదలఁచుచున్నారు?"

ఇది విని శౌనకుఁ డిట్లనెను :- "సూతా! గరుడుని చరిత్రమును నీవు చాల యద్భుతముగఁ జెప్పితివి ఇప్పుడు నీవు మాకు దక్షప్రజాపతియొక్క యితర కన్యల వంశ వృత్తాంతమును గూడ జెప్పుము. ఇరువదేడుగురు కుమార్తెలను దక్షుఁడు చంద్రున కొసంగినట్లు చెప్పితివి. వారికెంతమంది సంతానము?"

సూతుఁడు నవ్వి యిట్లనెను :- "స్వామీ! చంద్రునకు శాప వశమున సంతానములేదు ఆతని యిరువదేడుగురు భార్యలకును ఒక్క సంతానమైనను గలుగ లేదు."

అంత శౌనకుఁ డిట్లనెను :- "మహాభాగా! చంద్రుని కెవని వలన శాపము కలిగినది. ఆతని పత్నులకేల సంతానము కలుగ లేదు. ఈ వృత్తాంతమును నీవు మాకు చెప్పవలయును"

సూతుఁడిట్లనెను :- "మంచిది, వినుఁడు నేనిప్పుడు మీకు చంద్రకథా వృత్తాంతమును వినిపించెదను మీ రిప్పుడు సావధానులరై యాలింపుఁడు."

# చంద్రునకు దక్షుని శాపము

శ్లో॥ కృత్తికాదీని నక్షత్రాణీందోః పత్న్యస్తు భారత।
దక్షశాపాత్సోఽనపత్యస్తాసు యక్ష్మగ్రహార్దితః॥
పునః ప్రసాద్య తంసోమః కలాలేభే క్షయోదితాః॥

శ్రీభాగ. ౬ స్కం. ౬అ. ౨౩ శ్లో॥

"వ............చంద్రునకుఁ గృత్తికాది నక్షత్రంబులు భార్యలయినను వారలయందుఁ జంద్రుడు రోహిణీయందు మాత్రము మోహితుండగుటంజేసి దక్షశాపంబున క్షయ రోగగ్రస్తుండై సంతానంబు వడయనేరఁడయ్యె నంత దక్ష ప్రసాదంబున క్షయపీడితంబులగు షోడశకళల మరలంబొందె............"

శ్రీమదాంధ్రభాగవతము.

రూపమదము, అధికారమదము, యౌవనమదము, ఐశ్వర్యమదము అను నీ నాలుగు మదములు మానవుని నున్మత్తునిఁగ నొనర్చును. ఎంతటి వివేకియైననుగానిండు. ఎంతటి జ్ఞానియైననుగానిండు, ఎంతటి బుద్ధిశాలియైననుగానిండు యీ మదములకు లోనైన తనను దన్ను మఱచిపోవును. భగవచ్చరణ శరణము పొందినవారును, భగావత్కృపాపాత్రులునైన వారే వీనినుండి తప్పించుకొనఁగలరు. అట్లుకాకున్న నీ మదములు మానవుల నున్మత్తులుగా నొనర్చును.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! కృత్తిక మొదలు భరణి వఱకు (మొదట నక్షత్రగణము అశ్వనినుండి గాక కృత్తిక నుండియే యుండెడిది. రేవతి తర్వాత నశ్వని భరణులు కూడ లెక్కింపఁబడినచో నిరువదేడు నక్షత్రములు కాఁగలవు) అనఁగాఁ గృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, వుత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖా; అనురాధా, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శత భిష, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్వని, భరణి అను నీ యిరువదేడు నక్షత్రములు దక్షుని కుమార్తెలు. దక్షుఁడీ యిరువ దేడుగురరను జంద్రునకిచ్చి వివాహ మొనర్చెను.

చంద్రుఁ డత్రిపుత్రుఁడు. అతఁడు పుట్టుకతోడనే అతి సుందరుఁడు ఈతఁడు ఘోరతపంబొనరించి వనస్పతి, లతా గుల్మ ములమీఁద స్వామిత్వమును, బ్రాహ్మణుల కీశ్వరత్వమును బొందెను. రాజసూయ యజ్ఞమునొనర్చి యీతఁడందఱ తేజస్సులను వెలవెలఁబారఁజేసెను, ఈతఁడు యువకుఁడు అత్యంత సుంద రుఁడు, తపః ప్రభావముచేఁ తేజస్వి బ్రహ్మను గ్రహమున నీతఁ డైశ్వర్యమునుగూడ బొందెను. అన్నిటి కారణమున మత్తెక్కి అనాచారములొనర్పఁజొచ్చెను. అది ఎంత వఱకు వచ్చినదనఁగా గురుపత్నియగు తారనుగూడ బలాత్కారముగఁ దనయింటికి తెచ్చి యుంచుకొనెను. ఆ తారకొఱకై దేవాసురులకు గొప్ప యుద్ధముజరు గఁగా బ్రహ్మవచ్చి యీ వ్యవహారము నెట్లోసరిచేసెను. దక్ష ప్రజాపతి చంద్రుఁడు సర్వ సమర్థుఁడనియు, సుందరుఁడనియు యోగ్యుఁడనియుఁ దెలిసికొని తన ఇరువదేడుగుర కన్యకలను

ఆతనికిచ్చి వివాహ మొనర్చెను. నియమానుసారముగ నాతఁడందరతోడను సమానముగ వ్యవహరింపవలయును, అందఱి నొక్కే రీతిగఁ బ్రేమింపవలయును, కాని ఆతఁడట్లుచేయక తన ప్రేమనంతను రోహిణికే అర్పించెను. ఆతఁడు రోహిణీదేవికడకు తప్ప యింకెవ్వరికడకు పోయెడివాఁడు కాఁడు, యితరులతో బలికెడు వాఁడునుగాఁడు పలుకరించెడువాఁడునుగాఁడు. అందువలన మిగిలిన ఇరువదారుగురును జంద్రుని వ్యవహరమునకు లోలోపలఁ జాల యసంతుష్టినిఁ జెందిరి చాలసారులు చంద్రునితోఁ దమకును గొంత యధికారముగలదని పలికిరిగాని ఆతఁడేమాత్రమును లక్ష్యపెట్టలేదు అంత వీరందరును నిరాశ చెందిన తర్వాత వారువారి తండ్రియగు దక్షప్రజాపతికడకు పోయి ఆద్యంతములు వినిపించిరి. దక్షుఁడును జంద్రున కనేక విధములఁ జెప్పిచూచెను. కాని వినలేదు. చివరకు దక్షప్రజాపతి క్రుద్ధుఁడై నా పుత్రికలను భేదభావముతోఁ జూచు చుంటివి కావున నీవు క్షయరోగివి కావలయునని శాపమొసంగెను.

దక్షప్రజాపతి శాపమన్యథాకాదు చంద్రునకు క్షయరోగము కలిగెను. ఆతనికళలు ప్రతిదినము తగ్గిపోసాగెను. దినదినమాతఁడు క్షీణించుటనుగాంచి చాల భయపడెను. రాజయక్ష్మరోగ మెవరికివచ్చి నను వారికి జీవితాశ చాలతక్కుగనుండును. ఇఁకఁదనకు వినాశమని చంద్రునకుఁదోఁచగనే, ఆతఁడు మరల దక్షునాశ్రయించి, తర్వాత శివారాధనమొనర్చి, శివప్రసాదముచేఁ గృష్ణపక్షమున

క్షీణించినవాఁడు మరల శుక్లపక్షమునఁ బూర్ణుఁడగునట్లు వరములు పొందెను. క్షయరోగికి సంతానమెట్లు కలుగఁగలదు. ఆతనికిఁ గళలు ప్రాప్తించినను సంతానము కలుగలేదు, ఇట్లా యిరువదేడుగురకును సంతానము లేకుండెను. కావునఁ జంద్రునకీపత్నుల వలన సంతాన మేమియును లేకుండెను.

అంత శౌనకుఁడిట్లనెను - "సూతా! చంద్రవంశము వృద్ధి పొందలేదని నీవుచెప్పుచున్నావు. క్షత్రియులలో సూర్యవంశము చంద్రవంశములని రెండు కలవనుట ప్రసిద్ధముగదా! ఈ చంద్ర వంశమందే బుధుఁడు ఇలుఁడు,పురూరవుఁడు మొదలగుగొప్పగొప్ప రాజర్షులుత్పన్నమైరనుటనుయును వినియుంటిమే, వీరెట్లుపుట్టిరి."

అంతసూతుఁడిట్లనెను- "మహాభాగా! చంద్రవంశము జరుగనేలేదని నాయభిప్రాయముకాదు. నేను దక్షుని అఱువదిమంది కన్యకల వంశవర్ణనమొనర్చుచున్నాను. ఆ అఱువదిలో నిరువదేడుగురు చంద్రుని భార్యలు. ఈయిరువదేడుగురకును సంతానము కలుగలేదు. బుధుఁడు చంద్రుని పుత్రుఁడే, కాని అతఁడు నిట్టివాఁడే. ఆతని కథను చంద్రవంశ వర్ణనమందుఁ జెప్పెదను."

ఇది విని శౌనకుఁడిట్లనెను- "మంచిది, మహాభాగా! సరే. నీవు దక్షుని అఱువదిమంది పుత్రికల వంశవర్ణన మొనర్చుచు న్నావు. వారిలో ధర్మునకుఁ బదుగురు, భూతునకు, అంగిరునకు కృశాశ్వునకు ఇద్దరిద్దరు భార్యలును, అనఁగా నాలుగురు, నల్గురు తార్క్ష్యుని పత్నులును, ఇరువదేడుగురు చంద్రుని పత్నులును కలరని

వారి వృత్తాంతమును జెప్పితివి. ఈవిధముగ నలుబదేడుగురి విషయ మునుగూర్చి నీవుచెప్పితివి. ఇఁక మిగిలిన కశ్యప పత్నులగు పదముగ్గురి వృత్తాంతమునుగూర్చి చెప్పుడు."

అంత సూతుఁడిట్లనెను- "మహాభాగా! ఈపదముగ్గురును లోకమాతలనఁబడుదురు. వీరివలననే యీ చరాచర విశ్వమంత యును నిండునట్లు సృష్టి వృద్ధియైనది. ఇప్పుడు నేను వారి వంశ వర్ణనము గావించెదను దానిని మీరు దత్తచిత్తులరై వినుఁడు"

## కశ్యప పత్నుల వంశవర్ణనము

శ్లో॥ శృణు నామాని లోకానాం మాతౄణాం శంకరాణి చ।
అథ కశ్యపపత్నీనాం యత్ప్రసూతమిదం జగత్॥
అదితిర్దితిర్దనుః కాష్ఠా అరిష్టా సురసా ఇలా।
మునిః క్రోధవశా తామ్రా సురభిః సరమా తిమిః॥

శ్రీ భాగ. ౬ స్కం. ౬అ. ౨౪. ౨౫ శ్లో॥

సీ॥ కామితప్రదుఁడైన కశ్యపు కౌగిట
ముచ్చట దీర్తురే ముద్దురాండ్రు
రఖిలలోకములకు నవ్వలై జగమెల్లఁ
బూజింపనుందురే పువ్వుఁబోండ్లు

బలియురై పుత్రులు పౌత్రులు త్రిజగంబు
తేలంగఁజూతురే యిందుముఖులు
ముంగొంగుపసిఁడియై మూల్గు పుణ్యంబుల
విఖ్యాతిఁగుదురెట్టి వింతరాండ్రు

తే॥ వారి కలగంప కడుపుల నేరుపఱుప
నరిది బిడ్డలఁ బడసిన బిరుదుసతుల
నామములు నన్వయంబులు నీమనంబు
పూనఁజెప్పెదు వినవయ్య మానవేంద్ర॥

తరలము -

అదితియున్ దితి గాష్ఠయున్ దనువయ్యరిష్టయుఁ దామ్రము
న్నదనఁ గ్రోధవశఖ్యయున్ సురసాఖయున్ సురభిన్ మునిన్
మొదలుగాఁ దిమియున్నిళాఖ్య సుముఖ్య యానకమాదిగా
ముదిత లెన్నఁగఁ గన్న సంతతి ముజ్జగంబుల భూవరా।

శ్రీమదాంధ్రభాగవతము.

మనయందఱ పూర్వపురుషుఁడొక్కడే. మానవుఁడు క్రింద కుఁజూడక, పైకేచూచినచో, శాఖలకు ప్రాధాన్యత నీయక మూల మునందే దృష్టి యుంచుచో దేనిని ద్వేషింపవలసినపనిలేదు. దేని మీఁదను ద్వేషము లేనివాఁడెవఁడో వాడే సమదర్శి సమదర్శియే సదా సుముఖముగనుండును. అందరును దమతమ పూర్వుల కీర్తిని, నామావళిని వినిపించుట ఒక ఆచారము. సూత, మాగధ, గాయక

జనము, వంశములయొక్కయు పూర్వపురుషులయొక్కయు కీర్తిని గానముచేసెడువారు మన పూర్వులసంగతిని వినఁగానే మనకుత్సాహము పెరుగును. మనవంశజుల మీఁదఁ బ్రేమ యుత్పన్నము కాఁగలదు. పశుపక్ష్యాదులు, సర్ప ప్రాణులు దైత్య, దానవదేవతా, మనుష్యాదులందఱు యొకే తండ్రి కశ్యపునియొక్క సంతానమనియు, సోదరులమనియు గుర్తించుచో, మనలో మనకుఁ బోట్లాటలు, రాగ ద్వేషాదులు చాల తగ్గిపోగలవు. మనము వేరనుకొనియే పోరాడు కొనుచుందుము, ద్వేషించుకొనుచుందుము. మనవారనుకొనువారి నందఱను ప్రేమించుకొనుచునే యుందుము.

శ్రీశుకదేవుఁ డిట్లనెను- 'రాజా! నేను దక్షప్రజాపతియొక్క నలుబదేడుగురు కన్యల విషయమునుగూర్చి చెప్పితిని. ఇప్పుడు కశ్యప ప్రజాపతికి భార్యలగు మిగిలిన పదముగ్గురనుగూర్చి చెప్పె దనువినుము. వారు అదితి, దితి, దను, కాష్ఠ, అరిష్ఠ, సురస, ఇళా, ముని, క్రోధవశం తామ్ర, సురభి, సురమ, తిమి. ముందుగా నేను సూచీకటాహ న్యాయముచే దితి, అదితుల వదలి మిగిలిన పదునొకండుగుర వంశవర్ణనమును సంక్షేపముగఁ జేసెదను ఒక కమ్మరి వానికడకొకఁడు లోహమును దీసికొనిపోయి నాకొక పెద్ద బాణలిని చేసిపెట్టమనెను. ఆతఁడు తన పనిముట్లతో దానినిఁ జేయుటకుద్యుక్తుఁడగు నప్పటి కింకొకఁడువచ్చి తనకొక సూది చేసిపెట్టు మనెను. నియమానుసారముగ ముందుగా వచ్చినవానికి ముందుగాఁ బనిచేసిపెట్టవలయును; కాని బాణలినిచేయుట చాల ఆలస్యము. సూదియు త్వరలోనే పూర్తికాఁగలదు. అందువలన నాతఁడు ముందుగా బాణలిని చేయక సూదినిచేసి యిచ్చెను, దీనినే

సూచీ కటాహ న్యాయమందురు. ముందుగా సంక్షిప్తముగ జరుగు కార్యమును గావించి తర్వాత విస్తార కార్యము నొనర్పవలయును.

రాజా! ఇప్పుడునీవు కశ్యప పత్నుల సంతతినిగూర్చి శ్రద్ధతో సావధానముగ వినుము. కశ్యపుని భార్యలలోఁ దిమి యను నామె సమస్త జలచర జంతువులను గనెను. ఇప్పటికిని జలములలోఁ దిమియను నొక గొప్ప చేప కలదు. అది ఒక చిన్న ద్వీపమువలె నుండును. దానిని మ్రింగు తిమింగలము కలదు. సరమాయను నొక భార్య సింహ వ్యాఘ్రాదులను గనెను. సురభి గేదెలు ఆవు మొదలగు పశుజాతులనుగనెను. తామ్ర డేగ, గ్రద్ద మొదలగువాని నుత్పన్నముకావించెను. మునియను కశ్యపపత్ని స్వర్గీయ అప్సరసలను గనెను. క్రోధవశ యనునామె దందశూకాది గొప్ప విషధరసర్పములను గనెను. ఇల యనునామె సమస్త వృక్షములను సృష్టించెను. రక్తమాంసములను దినుచుండెడు క్రూరకర్ములగు రాక్షసులందఱును సురసయొక్క సంతానము. అరిష్ట చక్కగ గానము చేయు గంధర్వులకు దల్లియయ్యెను. కాష్ఠకు గుఱ్ఱము, గాడిద, కంచరగాడిద మొదలగు నొంటిగిట్టగల పశువులుద్భవించెను. దనువున కఱువదొక్కరు దానవులుద్భవించిరి. మొట్టమొదట అఱువదొక్కరు దానవులు కలరు. వారి వలన నసంఖ్యాకములగు దానవులుద్భవించిరి. ఈ అఱువదొక్క మందిలోఁ బ్రసిద్ధ బలశాలురును, పరాక్రమమవంతులునగు వారి నామములివి :– ద్విమూర్ధుఁడు, శంబరుఁడు, అరిష్టుఁడు, హయగ్రీవుఁడు, విభావసు, అయోముఖుఁడు, శంకుశిరుఁడు, సర్భానువు,

కపిలుఁడు, అరుణుఁడు, పులోముఁడు, వృషపర్వుఁడు, ఏక చక్రుఁడు, అనుతాపన్నుఁడు, ధూమ్రకేశుఁడు, విరూపాక్షుఁడు, విప్రచిత్తి, దుర్జయుఁడు మొదలగువారు. వీరిలో నముచి యను దైత్యుఁడు స్వర్భానుడను దానవుని కుమార్తె సుప్రభ యను నామెను వివాహమాడెను. దానవరాజగు వృషపర్వుని కుమార్తెయగు శర్మిష్ఠను, భరతవంశీయుడును, నహుషనందనుఁడగు యయాతి మహారాజు వివాహమాడెను. రాజా! దీనికద్భుత కథకలదు. దీనిని నేను ముందు సూర్యవంశ చంద్రవంశ వర్ణన ప్రసంగమునందు జెప్పెదను. వైశ్వానరకు ఉపదానవి, హయశిర, పులోమ, కాలకేయ అను బరమ సుందర కన్యలు నల్గురు పుట్టిరి. ఉపదానవి హిరణ్యాక్షుని హయశిర క్రతువును, పులోమా కాలకేయలు కశ్యపుని వివాహమాడిరి. వీరిలోఁ బులోమ, కాలకేయలవలన నఱువదివేల మంది దానవులుద్భవించి, వీరు యుద్ధములో ధనుర్ధరుఁడగు నర్జునునిచేతిలోఁజచ్చిరి. విప్రచిత్తి దానవుఁడు సింహిక యను భార్య వలన నూర్గురు పుత్రులను గనెను. వారిలో రాహువు పెద్దవాఁడు. ఆతని సిరస్సు అమృతపాన సమయమునఁ దెగఁగొట్టఁబడెను. ఈ సుందర రోచక కథను సముద్రమంథన ప్రసంగమునఁ జెప్పెదను. పెద్దభాగమును రాహువనియుఁ జిన్నభాగమును గేతువనియుఁ బిలువఁబడును. ఇవన్నియు గ్రహములయ్యెను.

ఇప్పుడు నీవు పరమపావనమగు దేవమాత అదితి యొక్క పుణ్యవర్ధకమగు జరిత్రమును వినుము. భాగ్యవతి యగు నీ యదితి గర్భమునుండియే సర్వవ్యాపకుడును, సాక్షాచ్ఛ్రీమన్నారా

యోణుని యొక్క అవతారమగు వామనుడుద్భవించెను. అదితి గర్భమునుండి ద్వాదశ (12 శాదిత్యులుద్భవించిరి. వారు నెల కొకరుచొప్పున పండ్రెండు మాసములును పండ్రెండుగురు వెలుగుఁ చూపుదురు. వారి పేరులివి :- వివస్వంత, అర్యమపూష, త్వష్ట, సవిత, భగ, ధాత, విధాత, వరుణ మిత్ర, శక్ర, ఉరుక్రములు. వివస్వంతుని వీర్యముచే నాతనిభార్య సంజ్ఞయ దు శ్రాద్ధదేవ మనువు యముఁడు, యమి యనునొక కన్యయును ముప్పురు కలి గిరి. ఆమెయే ఆడుగుఱ్ఱము రూపమును ధరించి అశ్వనీకుమారు లను గనెను. ఇదిచాల పెద్దదియు, మిక్కిలి రోచకమగు కథ. ప్రసంగానుసారముగ దీనినిఁ జెప్పెదను. వివస్వంతుని రెండవ భార్యయగు ఛాయయు సావర్ణి మనువును, శనైశ్చరుని, తపతి యనెడు కన్యనుగనెను. తపతి సంవరణునిఁ బెండ్లాడెను. వివ స్వంతుని తర్వాత రెండవ ఆదిత్యుఁడు అర్యముఁడు. ఈతఁడు మాతృక యను నామెను వివాహమాడెను. ఆమెకు చర్షణి యను పుత్రుఁడు పుట్టెను. చర్షణికృతాకృత జ్ఞానముకల మానవజాతి వీరివలనఁ గలిగినది. వీరినుండియే బ్రాహ్మణాది జాతులేర్పడినవి. పూషుఁడు నిస్సంతానవంతుఁడయ్యెను. ఆతఁడు బోసినోటివాఁడై నాడు. దక్షప్రజాపతి యజ్ఞములో నీతని ముప్పదిరెండు పండ్లు రాలిపోయినవి. ఆ వర్ణనమును దక్షయజ్ఞప్రసంగమున నిదివరకే జెప్పియుంటిని. శ్రాద్ధాదులందు పూషునకు పిండి మొదలగు నన్న మీయఁబడును, అందువలన నీతనిపిష్టభుక్కందురు. మూఁడవ యాదిత్యుఁడు త్వష్ట. ఈతఁడు దైత్యవంశములో వివాహము

చేసికొనెను దైత్యులలో నందరికంటె చిట్టచివరపిల్ల రచన యను నామె యీతని ధర్మపత్ని; రాజా! దేవదైత్యులకు స్వాభావిక వైరభావమున్న సంగతి నీ వెఱిగినదేకదా! ఇట్లైనను వీరిలోఁ బరస్పరము వైవాహిక సంబంధముండెడిది. ఇంద్రపత్ని శచీదేవియు పులోమదైత్యుని పుత్రియే. అందువలననే ఆమెను పౌలోమియని పిలుతురు."

త్వష్టకు తన పత్నియగు రచనయందిద్దరు పుత్రులుత్పన్నమైరి. సన్నివేశుఁడు పెద్దవాఁడు. విశ్వరూపుఁడు చిన్నవాఁడు ఈ విశ్వరూపుఁడే తర్వాత దేవతలకుఁ బురోహితుఁడయ్యెను.



అంత పరీక్షన్మహారాజిట్లనెను :- ప్రభూ! దేవతలకు బురోహితుఁడు పరమ జ్ఞానియు, నీతివిశారదుడును బృహస్పతి యని వినియుంటిని. ఇప్పుడుమీరు విశ్వరూపునిఁ బురోహితునిఁగాఁ జేసికొనిరని చెప్పుచున్నారు. అదెట్టుల ? దేవతలిద్దరు పురోహితుల నేలఁబెట్టికొనిరి ?"



ఇది విని శుకుఁడిట్లనెను :- "రాజా ! బృహస్పతి దేవతా పురోహితుఁడనుట నిజమే. కాని యింద్రుడాతని కవమానము చేయఁగా నాతఁడు వారిని వదలి వెడలిపోయెను. పురోహితుఁడు లేక పనియెట్లుజరుగగలదు ? అందువలన నప్పుడు దేవతలు బృహస్పతికి బదులుగా విశ్వరూపుని దేవగురునిఁగా నొనర్చుకొనిరి."

అంత రాజిట్లడిగెను :- "స్వామీ! పురోహితుఁడగు గురు వెల్లప్పుడును దేవతలను దైత్యులనుండి రక్షించుచుండెడువాఁడు. దైత్యులు ఛిద్రములను వెదకి దండెత్తకుండవలెను గదా! దానికి సలహాచెప్పుట కాచార్యుఁడుండవలయును. విశ్వరూపుని తల్లి దైత్యవంశమున జన్మించినదికదా? వారు మాతృవంశము వారగుటచే నసురుల పక్షమును గైకొనవచ్చునుగదా? ఇట్టి సందేహాస్పదుడగు వ్యక్తిని దేవతలు పురోహితునిఁగా నేలఁజేసికొనిరో?"

అంత నవ్వుచు శుకదేవుడిట్లనెను :- "స్వామీ! స్వార్థము చాల చెడ్డవస్తువు. స్వార్థమునకు వశీభూతుఁడై మానవుఁడెంతైనఁ జేయఁగలఁడు. స్వార్థకారణమున నింద్రుడెన్నో గొప్ప గొప్ప యపరాధములొనర్చినాఁడు. మహారాజా! ఇది చాల పెద్దకథ. ఇంద్రుఁడు గురువు నవమానముచేయుటచే నెన్నో గొప్పగొప్ప విపత్తుల నెదుర్కొనవలసివచ్చెననుట అందఱెఱింగిన విషయమే. దీనికొఱకాతఁడు బ్రహ్మహత్యనుగూడ చేయవలసివచ్చెను."

అంత నుత్సాహమును బ్రకటించుచుఁ బరీక్షిన్మహారాజిట్లనెను :- "ప్రభూ! నాకీ పరమపావనమగు నాఖ్యానమును బూర్ణముగ వినిపింపుఁడు. దీనిని వినుటకు నా మనస్సులోఁ జాల కుతూహలము జనించుచున్నది."

ఇది విని శుకదేవుడిట్లనెను :- "మంచిది, రాజా! నేను నీకీపవిత్ర చరిత్రమును వినిపించెదను; నీవు సావధానుఁడవై వినుము."

## దేవేంద్రుడు దేవగురు నవమానించుట

శ్లో॥ వాచస్పతిం మునివరం సురాసుర నమస్కృతమ్ !
నోచ్చచాలాసనాదింద్రః పశ్యన్నపి సభాగతమ్।
తతో నిర్గత్య సహసా కవిరాంగిరసః ప్రభుః।
ఆయయౌ స్వగృహం తూష్ణీం విద్వాచ్ఛ్రీ
మదవిక్రియామ్ ।

శ్రీభా.గ. ౬ స్కం. ౭ అ.౮, ౯ శ్లో॥

చ॥ అమిత తపః ప్రభావుఁ గరుణాత్ముని గీష్పతిఁ జూచి రాజ్య దు
ర్దమ మద రేఖ నింద్రుఁడు వృథా తన గద్దియ లేవకుండె నె
య్యమున నెదుర్కొనం జనకయాసనమీయక గౌరవోపచా
రములఁ బ్రసన్నుఁ జేయక తిరంబుగ దివ్యసభాంతరంబునన్

క॥ అప్పుడు సురపతి గన్నులఁ
గప్పిన సురరాజ్య మదవికారంబునకుం
జప్పుడు సేయక గృహమున
కప్పుణ్యుఁడు దిరిగిపోయె నతిఖిన్నుండై ॥

శ్రీ మదాంధ్ర భాగవతము

కలహమునకు మూల మహంకారము. నేనే అందఱికంటె గొప్పవాఁడను, నేనే అందఱికంటె నుత్తముఁడను, నేనే పూజనీయుఁడను, సమ్మాననీయుఁడను, నాకతిరిక్తముగ మిగిలినవారందఱును

తుచ్ఛులు, హేయులు, గర్హ్యులు, నిందనీయులు, అని అనుకొనిన వాఁడితరులను దిరస్కరించును. గురుజనుల కవమానమొనర్చును. జీవుల నవమానమొనర్చుటయన ఘటఘటవాసియు, సర్వాంతర్యామియునగు బరమేశ్వరు నవమానించుటే కాఁగలదు. ఇతరుల నవమానించు వాఁడితరులచేఁ దా నవమానముపొందును. కావునఁ బొరపాటునైన నేజీవునినైనఁ గొలదివాఁడని భావించి యవమానింపరాదు. సమస్త చరాచర భూతములందు దన యిష్టదేవుని దర్శింపవలయును.

బృహస్పతి తన ప్రియశిష్యులగు దేవతల నే యపరాధమునఁ బరిత్యజించెనో యను బరీక్షిన్మహారాజు ప్రశ్నకు సమాధానమొసంగుచు శుకుఁడిట్లు చెప్పదొడఁగెను :- "రాజా! ఈ యైశ్వర్యమదము చాల చెడ్డవస్తువు. ఐశ్వర్యము పెరిగినప్పుడు దానికి తోడుగా నవివేకముకూడ వాని హృదయమందు పెరుగును. అప్పుడు మానవుడు లోపలను బయటను గ్రుడ్డివాఁడై మదాంధుఁడగును. రాజా! ధనైశ్వర్య మదమందు మానవుఁడు తన ముందరందరను దుచ్ఛులుగ భావించును ఆతడు తన వివేకమును బోఁగొట్టుకొనును. దేనినిఁ జేయవచ్చునో దేనినిఁ జేయరాదో ఆతనికిఁ దెలియదు. కుబేరపుత్రులగు నలకూబర మణిగ్రీవులు ఐశ్వర్యమదాంధులై దేవర్షియగు నారదుని అవమానించిరి. ఐశ్వర్యమదాంధునకుఁ గన్నులు దెరిపిడిపడుటకు దరిద్రమే ఒకవిధయగు నంజనము. దారిద్ర్యమురాఁగానే ఐశ్వర్యమదము దిరిగిపోవును. అప్పుడు బుద్ధి నిలకడయగును.

ఒకనాఁడింద్రుడు తన వైభవమును జూచుకొనెను. దివ్య సుధర్మ సభయందు దివ్యమణిమయ సింహాసనమునఁ ద్రైలోక్య సుందరియగు శచీదేవితోఁగూడి కూర్చుండెను అనుపమ రూప లావణ్యవతులును, స్వర్గీయ దివ్య అప్సరసా సుందరులు తమ హావభావ కటాక్షములతో సమ్ముఖమున నృత్యము చేయుచుండిరి. గంధర్వులు తాన, మూర్ఛా, లయాదులతో దివ్యగాన మొనర్చు చుండిరి. హస్తములందనేక విధములగు సేవా సామాగ్రులను గ్రహించి సహస్రాకములగు సురాంగనలు సావధానముతో సేవ చేయుచుండిరి. గొప్పగొప్ప ఋషులు, మహర్షులు నిలుచుండి దేవేంద్రుని స్తుతించుచుండిరి. దేవతలు చేతులు జోడించుకొని ఆజ్ఞాప్రతీక్ష చేయుచుండరి. సిద్ధ, చారణ, గంధర్వ, ఉరగ, రాక్షస, గుహ్యక, భూత, ప్రేత, పిశాచ, నద, నదీ, వన, సముద్ర, పర్వతాదులన్నియు మూర్తిమంతములై శతక్రతు నుపా సించుచుండిరి. ఈస్వర్గీయ వైభవైశ్వర్యములను గాంచి ఇంద్రుడుఁ గర్వమునుజెందెను. ఆతఁడిట్లనుకొనెను :- త్రిలోకములలో నన్ను మించినవాఁడెవఁడు కలఁడు? మానవులమాట నటుంచుడు. దేవ తలు, ఉపదేవతలు నా పూజాప్రతిష్టను గాపాడుచుందురు. అంద ఱును నా సమ్ముఖమునఁ జేతులను జోడించుకొని నిలుచుండినారు. గొప్పగొప్ప ఋషులు, మునులు నిలుచుండి సింహాసనాధిష్ఠితుఁడ నగు నన్ను స్తుతించుచున్నారు. నే నింతటి యైశ్వర్యశాలియయ్యు బృహస్పతి సమ్ముఖమున నేల తలవంచవలయును? ఆతనినిఁగాంచి ఆసనమునుండి యేల లేవవలయును? ఈతఁడును నేదో సామా

న్యవు బ్రాహ్మణుఁడే సమస్త ఋషులు మునులు నన్ను స్తుతించు చుండ నీతఁడను నేల స్తుతించరాదు. నేను ప్రతిదినము ఈతఁడు వచ్చుటను గాంచి లబలబలాడి యేల లేవవలయును. ఈతని సమ్మానించుటకేల యింతటి ఆదరము నొనర్పవలయును?"

అని ఈ విధముగ గర్వమునఁ గన్నుఁగానక అంధుఁ డయ్యెను. ఆతనికహంకారము కప్పినప్పుడే సభలోనికి బృహస్పతి వచ్చెను. నిత్యము దేవేంద్రుడాతనికి గొప్పగ స్వాగత సత్కారములొనర్చెడువాఁడు చూడఁగానే తన సింహాసనముమీఁద నుండి లేచి, ప్రత్యుత్థానము కావించి, మధుర వచనములతో నాతనిని కుశలప్రశ్నలడిగి, తనకంటె నున్నతాసనమున నాతనిఁ గూర్చుండఁజేసి, కూర్చుండిన తర్వాత నాతని యనుజ్ఞనుబొంది తానును దన సింహాసనమునఁ గూర్చుండెడువాఁడు కాని నేఁడాతఁ డైశ్వర్య మదమున నున్మత్తుఁడయ్యెను. దేవేంద్రతోన్మాదముతో నాతఁడు ఒడలు తెలియక ఎదురుగా వచ్చుచున్న గురుని గాంచి ఆసనమును డి కదలనైనలేదు ఎండిన మ్రాకువలె నట్లే కదలకఁ గూర్చుండి యుండెను ఆతఁడాచార్యునివైపు చూడనైనలేదు. ఇంత వఱకాతనికి గౌరవ బుద్ధి యుండెడిది కాని యిప్పుడాతనికంటికి సామాన్య బ్రాహ్మణుఁడుగానే గోచరించుచుండెను. అర్థాసనమున నింద్రాణియగు శచీదేవి కూర్చుండియుండెను. ఇంద్రుఁడామె భుజముపైఁ జేయివైచియుండెను. మరుత్తులు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, ఋభువులు, విశ్వదేవతలు, సాధ్యగణము, అశ్వినీ కుమారులు ఆతని సేవలో నిమగ్నులై యుండిరి. సిద్ధ, చారణ,

గంధర్వ, బ్రహ్మవాదులగు మునిగణము, విద్యాధరులు, అప్స రసలు, కిన్నరులు, పక్షి, నాగాదులు, ఉపదేవతలు ఆతని స్తుతించు చుండిరి. ఆతని త్రైలోక్యవ్యాప్తమగు కమనీయకీర్తిని వర్ణించు చుండిరి. ఆతనిపై వేయి బెత్తములుకలిగి, అత్యంతోజ్జ్వలమై, చంద్రమండలమువలె శుభ్ర సుందర శ్వేతఛత్రము సుశోభితమై యుండెను. కుడియెడమలత్యంత సుందరులగు నప్సరసలు చేతు లలోఁ జామర వ్యజనాది మహారాజోచిత చిహ్నములను ధరించి రెండువైపులను జామరములను వీచుచుండిరి. ఇంద్రుఁడు గురువగు బృహస్పతిని గాంచియుఁ గాంచకుండి సమ్ముఖమున నూర్వశి నాట్యముచేయుచుండ దాని ననురాగముతోఁ జూచుచుండెను.

శిష్యునియొక్క యీ యభూత పూర్వచర్యనుగాంచి దేవ గురువు చాల యాశ్చర్యమును జెందెను. ఆతఁడు కొంచెముసేపు నిలుచుండి దేవేంద్రుని ముఖమువైపే చూచుచుండెను. ఆతఁడు త్రికాలజ్ఞుఁడగుటచే విషయము తెలిసికొనెను. వీనికైశ్వర్యమదము వచ్చినదనియు శరీరమున గర్వమను పెనుభూతము సంచారము చేయుచున్నదని తెలుసుకొని సభలోనికిఁ బ్రవేశింపక వచ్చినట్లే తిరిగిపోయెను. సూతుఁడిట్లనెను :- "మునులారా! మానవుల చిత్త వృత్తి సర్వదా మారుచుండును. ఒక్కొక్కప్పుడు సత్వగుణము వృద్ధిపొందును ఇంకొకప్పుడు రజోగుణప్రాబల్యము కలుగును, మఱియొకప్పుడు తమోగుణము హృదయము నాక్రమించును. ఎప్పుడేగుణము ప్రకాసించునో అప్పుడట్టి బుద్ధి కలుగుచుండును. సత్త్వగుణప్రకోపము కలిగినప్పుడు చిత్తము శాంతిచెందును.

దానము చేయవలయుననియు, ధర్మ మొనర్పవలయుననియుఁ బ్రిబలేచ్ఛ జనించుచుండును. రజోగుణవృద్ధి కలిగినపుడు గర్వాభిమానములు పెరుగును. కర్మలొనర్చుటయందత్యధిక ప్రీతికలుగును. తమోగుణ ముద్రేకించినపుడు నిద్రాలస్య ప్రమాద ప్రాబల్యముండును. దీనివలన మహాపురుష సాంగత్యముచేఁ గలిగిన జ్ఞానము కప్పఁబడును.

అంత శౌనకుఁ డిట్లడిగెను :- సూతా! ఇప్పుడు ఫలాని గుణము ప్రకోపించినదని యే లక్షణములచేఁ దెలియనగును."

అంత సూతుఁ డిట్లనెను :- "స్వామీ! హృదయమున నెప్పుడే గుణమాధిక్యము చెందియుండునో అప్పుడట్టి బుద్ధియగును. ఆ సమయమున వివేకముండదు. సమస్తేంద్రియ ద్వారములద్వారా జ్ఞానాత్మక ప్రకాశ ముత్పన్నమైనపుడు చిత్త మత్యంత ప్రసన్నమై సాత్త్వికమై, అందఱియెడల మిత్రత్వము అద్రోహమునకు సంబంధించిన భావము ఉత్పన్నమైనవని తెలిసికొనవలెను. ఇట్టియెడ హృదయమున సత్త్వగుణ ప్రాబల్యము కలిగినదని తెలియవలయును. సాంసారిక కార్యములయందత్యధిక ప్రవృత్తి, లోభము, విషయభోగలాలస, చిత్తోద్వేగము, ఇతరులయెడల నసూయాది భావము ఉత్పన్నమగుచో రజోగుణము మనల నణచివేసినదని తెలియవలెను, వివేక విహీనత, కార్యములొనర్చుటయందనిచ్ఛ, అసావధానత్వము, మోహము, ఉద్యమరాహిత్యముకలిగి యూరక పడియుండవలెననెడు ఇచ్ఛకలిగినచో మనము మహాపాపులమై

తమోగుణమునకు వశీభూతులమైతిమని తెలిసికొనవలయును. ఈ గుణములు సదా ఒక్కకరముగ నుండవు. పెరుగుఁ దరుగుచుండును. ఒక్కొక్కప్పుడు సత్వగుణోదయమగును. ఒక్కొక్కప్పుడు రజోగుణము సత్వము నణఁచి తానుద్రేకించును. ఒక్కొక్కప్పుడు తమోగుణము పైకిలేచును. ఆ సమయమున నింద్రుఁడు తమోగుణముచే నిండియుండెను. దేవగురువు తిరిగిపోఁగానే ఇంద్రునకుఁ జైతన్యము కలిగెను. ఆతని మనస్సునందు సత్వగుణోత్పన్నమయ్యెను. ఆతఁడిట్లనుకొనెను :- "అయ్యో ! నేఁడు నేను నా పరమ పూజనీయుఁడగు గురువు నవమానించితిని. నాకు నా యీ యైశ్వర్యమునకును ధిక్కారము" అని యిట్లనేక విధములుగఁ దన్నుఁదాను నిందించుకొనుచుండెను.

అంత శౌనకుఁ డిట్లడిగెను :- "సూతా ! ఇంద్రునకు గర్వము కలిగినదనుకొనుఁడు బృహస్పతి ఆతని నీదశలోఁ జూచి యేల తిరిగివచ్చెను ? ఎట్టివాఁడైనఁగానిండు ఇంద్రుఁడు తన శిష్యుఁడే కదా ! ఆ సమయమున నవమానము సహించి ఆతనికిఁ జెప్పవచ్చునుగదా ! ఆతనికి బుద్ధిచెప్పినచో నింద్రుఁడు తన దోషము దెలిసికొని పశ్చాత్తాపము జెంది, గురువును క్షమాపణ కోరవచ్చునుగదా ! తర్వాత నీ తుపాను చెలరేగదు గదా ! అట్లు చేయక బృహస్పతి తిరిగి యేల వెడలిపోయెను ? ఆతఁడు తన యవమానమందంతటి దృష్టి యేల యుంచెను."

బ్రాహ్మణుఁడు జగద్గురువు. అందఱును గురుదేవుని శాసనము మీఁదనే యుందురు. ఆతఁడెవరి శాసనమున నుండడు. ఆతఁడెవ రికినిఁ బ్రజకాఁడు. నీబోటి పండితమూర్ఖులకు మార్గమునుప దేశించుచుందురు. నీబోటి ముఖప్రీతిగ మాట్లాడువారిని ననుసరించి వారి మాటప్రకారము నడచుచోనట్టి మానవుఁడవశ్యము నరకముల లోని భయంకర యాతనల ననుభవించి, వేలకొలఁది సంవత్సర ములు కుంభీపాకరౌరవాది నరకాగ్నులందు బాధపడవలసియుం డును. నీవంటి మూర్ఖుల మాటలను విశ్వసించి యీ సంసార సాగరమును దరింపఁ బూనుట, రాతితోఁ జేసిన వడవమీఁద నదిని దాటఁదలఁచి నట్లగును నేను మీ ముఖప్రీతిమాటలకు లొంగను. నేఁటివఱకు నేను నా గురుదేవుని అవమానింపలేదు. సర్వదా ఆతని కనుకూలాచరణము కావించుచు నాతని యాజ్ఞలను దత్పరత తోడను, సావధానుడనయ్యు నాచరించుచుందును. నేడు నావలన ఘోరాపరాధము సంభవించినది. నే నింకను భ్రమలోఁ బడియుండఁ జాలను. ఇప్పుడు నేనిఁక నా శఠమును వీడి, నా గురుదేవుని సమీపమునకుఁ బోయి, ఆతని చరణసరోజములందు శిరస్సునుంచి, అనునయ వినయములచే నాతని క్షమాపణము వేఁడెదను. వారికి నా వృత్తమునంతను సత్యముగ విన్నవించుకొనెదను."

సూతుఁ డిట్లనెను :– "మునులారా! ఇట్లు చెప్పి యింద్రుఁడు వెంటనే తన సింహాసనమునుండి లేచి, కాలినడకనే బృహస్పతి కడకుఁ బోయెను. కాని బృహస్పతి యిప్పుడింటిలో నెచ్చట నున్నాఁడు! అచ్చట, యిచ్చట, సర్వత్ర బృహస్పతిని వెదకిం

చెను; కాని చేతినుండి బాణము జారిన తర్వాత నింకేమున్నది? అది లక్ష్యమును భేదించితీరును. ఇంద్రుదనకు మిక్కిలి పశ్చాత్తాపము కలిగి, దుఃఖితమనస్కుఁడై ముందువిషయమునుగూర్చి యాలోచింపసాగెను.

## గురుత్యక్తులగు దేవత లసురులచే నోడుట

శ్లో॥ తచ్ఛ్రుత్వైవాసురాః సర్వ ఆశ్రిత్యౌశనసం మతమ్ ।
దేవాన్ప్రత్యుద్యమం చక్రుర్దుర్మదా ఆతతాయినః ॥

శ్రీ భాగ, ౬ స్కం. ౭ అ. ౧౮ శ్లో॥

తే॥ తెలిసి మిక్కిలి తమలోనఁ దెలివినొంది
యందఱునుగూడి భార్గవు నాశ్రయించి
తత్కృపాదృష్టిఁ దమశక్తి దట్టమైన
దేవతల మీఁది దాడికిఁ దెరువువెట్టి ॥

శ్రీ మదాంధ్రభాగవతము

సుఖతరముకాని సంఘటనము ప్రపంచములో లేనేలేదు. సమస్త సంఘటనలవలనను నేదో విధముగ సుఖమవశ్యము లభించును. ఏలననఁగా సుఖములేక జీవించుటయే యుండదు. ఒకానొకనికి ఏకైక పుత్రుఁడు మరణించినాడనుకొనుఁడు ఆతఁడు దినమంతయును జింతించుచుండును. నవ్వఁడు, పలుకఁడు, అశ్రుధారలు గార్చుచుండును. అట్లుండుట బాగుండదని యెవరైన నని

నచో వానికి విపరీతముగఁ దోఁచును. దుఃఖము కలుగును. ఆఅఁడు మాటిమాటికి 'నన్నిట్లు పడియుండనిండు. మెదలకుండ పడియుండుటలోనే నాకు శాంతి కలదు. ఏద్వనిచ్చిన నా మనస్సు తేలికగును' అనును ఆ సమయమున వాని నాస్థితిలో నుంచుటవల ననే ఆనందము లభించును. ఒకఁడు తన శత్రువు నోడించును. అప్పుడాతని కాతని బరాజయము వలననే ఆనందము లభించును. ఓడినవానికి దుఃఖము కలుగును. కాని ఆ దుఃఖములోఁగూడ వానికి మరల నెన్నటికైన వానిని జయించవచ్చునను నాశచే సుఖము కలుగును. పరాజయమందును సుఖముకలదు. జయమం దును సుఖముకలదు. కేవలము పాత్రభేదమే. ఒకఁడొక వస్తువును సుఖముగ భావించును దానినే ఇంకొకఁడు దుఃఖముగ భావించును జ్ఞానికి రెండును సమానమే. వానికి సుఖదుఃఖములు రెండును సమానములే. అభిమానముచే మనము సుఖ దుఃఖ కల్పనము కావించితిమి.

శుకదేవుఁ డిట్లనెను :- "రాజా! ఇంద్రుఁడు తన చెయ్ది మునకుఁ బశ్చాత్తాపమును జెందుచుండెను. తన్నుదాను ధిక్క రించుకొనుచుండెను. ఇంతలోనే బృహస్పతి తన యిల్లువెడలి యోగబలమున నంతర్హితుఁడయ్యెను. ఇంద్రుఁడు తాను బాగుగా వెదకెను, సురలచే వెదకించెను. కాని గురువు తాను బయటఁబడఁదలఁపకున్నచో శిష్యుఁడు తన ప్రయత్నమున నెన్న టికిని వెదకఁజాలఁడు. ఆతనిని వెదకుట సామాన్యమైనపని కాదు. ఇప్పుడింద్రునకొక చింతకలగెను. ఇంతవరకు మనము గురుదేవుని

ఛత్రఛాయ యందుండుటచే మనము శత్రువులబారినుండి సురక్షితముగ నున్నాము. ఇప్పుడు మనశిరస్సునుండి గురుదేవుని వరద హస్తము తొలఁగినది ఇప్పుడు మనము గురుకృపాహీనులమైతిమి కృపారహితుఁడైన వాఁడెన్నటికిని శత్రుప్రహరమును దప్పించుకొనఁజాలడు. కావున నిప్పుడు మనము మనరక్షణనుగురించి యోచింపవలయును. ఈవిధముగ దేవతలను బరామర్శించుచు నింద్రుఁడత్యంత దుఃఖితుఁడయ్యెను. అనేకోపాయములను వెదకినను అతఁడు తనబుద్ధిచే నిశ్చయించుకొనఁజాలకపోయెను. కారణమేమనఁగా నాతని చిత్తము మిక్కిలి యశాంతిజెందియుండెను.

అసురులు గూఢచారులెప్పుడును దేవతల ఛిద్రములనే వెదుకుచుండిరి. దేవతలకెచ్చట నిర్బలత్వమున్నది, ఎచ్చట నేవిధముగ వీరిని బ్రహరించి విజయమును బొందఁగలమని వారు జాగ్రత్తగ వెదుకుచుండిరి. చారులు వెళ్లి దేవతలు బృహస్పతికి ఘోరావమానమును జేసిరనియు, గురువు వచ్చినప్పటికి నింద్రుఁడు తన సింహాసనముననే కూర్చుండియే యున్నాఁడనియు, లేచి నమస్కరింపలేదు సరిగదా చివరకు వాక్కుతో నైనను సత్కరింపలేదనియు నసురులకుఁ జెప్పిరి. అసురులు దేవేంద్రుఁడిట్టి విధముగ బ్రవర్తించునని కలనైన ననుకొనలేదు. ఇదివినఁగానే అసురుల యానందమునకు మేరలేకుండెను. వారుపరువిడి తమగురువగు శుక్రాచార్యుని కడకుఁబోయి దూరమున నుండియేనమస్కరించి చుట్టును గూర్చుండిరి.

శుక్రాచార్యుఁడు వారందరును సంతోషముతో నుత్సాహముగఁ దన చుట్టును గూర్చుండుటనుగాంచి వారితో నిట్లనెను :- "ఏమి? మీరింత ఉత్సాహముగనుంటిరేల? మీరునాతోఁ జెప్పదలఁచినదేమిటో సంకోచింపక నిర్భయముగఁ జెప్పుడు."

తమగురువు అనుకూలముగ నుండుటనుగాంచి అసురులు జెప్పుట కారంభించిరి :- "గురుదేవా ! దేవతాగురువగు బృహస్పతి దేవతలను బరిత్యజించినట్లు విన్నాము."

ఆశ్చర్యముతో శుక్రాచార్యుఁడిట్లనెను:- "ఏమీ! బృహస్పతి దేవతలను వదలిపెట్టి వెళ్ళిపోయినాఁడా?"

దృఢత్వముతోఁదమ మాటమీఁద నిలిచి యిట్లనిరి :- "స్వామీ! వెళ్ళిపోలేదు, కోపముతో దేవతలయందప్రసన్నుఁడై వెళ్లెను. కోపమునకుఁ గారణమున్నది. ఏ గురు కృపవలన సమస్తైశ్వర్యము ప్రాప్తించినదో అట్టిగురువు నవహేళనము గావించుటయు, ఆతనిని సన్మానింపకపోవుటయు, ఇంతకంటె ఘోరాపరాథమేమికలదు? మనస్వియగువాఁడు శిష్యుల వలన నవమానమునుచెంది వారి సమీపమున నుండఁగలఁడా"

శుక్రాచార్యుఁడు సంభ్రమముతో నిట్లడిగెను- "దేవతలు తమగురువు నవమానించు టెందులకు?"

దైత్యులిట్లనిరి- "స్వామీ! ఇంద్రుఁడెంతటి గర్విష్ఠియో తమకు తెలియునుగదా! ఆతఁడు తన యైశ్వర్యమున మదోన్మత్తుఁడైనాఁడు, గురుదేవుఁడు రాఁగానే లేచి స్వాగతసత్కారములొనర్చి,

మధురవాక్కులతో మాటలాడి సింహాసనము పైఁగూర్చుండఁబెట్టు టయట్లుంచుఁడు, ఆతనివైపు చూడనైనఁ జూడలేదు. వాక్కుతో నైన స్వాగతమీయలేదు. అందువలన బృహస్పతి యసంతుష్టుఁడై శిష్యులగు దేవతలను బరిత్యజించెను.

దుఃఖముతో శుక్రాచార్యుడిట్లనెను- "గురువు దేవతలను వీడి యెప్పుడుపోయినాడో అప్పుడే దేవతల లక్ష్మియు వారిని వదలి వెళ్ళిపోయినది. గురుసేవ లేనిచోటను, పెద్దలయెడల సమ్మాన దృష్టి లేనిచోటను రాజలక్ష్మి నిలువదు. దేవతలు శ్రీహీనులైరి. వారిప్పుడు స్వర్గభోగము లనుభవింప నధికారులుకారు. ఇప్పుడు వారు శాంతితో సుఖోపభోగము లనుభవింపఁజాలరు. గురువు నవ మానించి యెవ్వరును శాంతిని బొందలేరు."

అసురులు ఉల్లాసముతో నిట్లనిరి- "అట్లయిన గురుదేవా ! మాకిప్పుడాజ్ఞనిండు. మేము స్వర్గము మీఁదకు దండెత్తి నిర్బలు లగు శత్రువులనోడించి స్వర్గము నాక్రమింపఁగలము."

ఇదివిని శుక్రాచార్యుడిట్లనెను- "అసురులారా! రాజనీతి యందు శత్రుదుర్బలత రాజునకు మిక్కిలి సంతోషకరమగు విష యము. ఇరుగుపొరుగునున్న రాజు తనకు పొరుగుననున్న శత్రువుయొక్క ఛిద్రములను జూచుచుండవలెను. ఛిద్రము దొరక గానే దాని నాధారముగఁగొని దండెత్తి శత్రువు నోడింపవలయును. మీయాలోచనము చాల బాగుగనున్నది. శీఘ్రముగ వెళ్ళి శత్రువు మీఁదకు దండెత్తుఁడు. ఇప్పుడు దేవతలలో శక్తిలేదు. ఇప్పు వాళ్ళ

మిమ్ముల నెదిరింపఁజాలరు. ఇప్పుడు దండెత్తినచో మీకు విజయము నిశ్చయము, ఇందుకు సందేహములేదు"

తన గురుదేవుని ఆజ్ఞనుబొంది యసురులు రణదుందుభులను మ్రోగించిరి. సమర దుందుభులను విని అసురులందరును అస్త్రశస్త్రములచే సుసజ్జితులై, ఆనందమున గంతులిడుచుఁ గేకలువేయుచు నొక్కచోట సమావేశమైరి. సేనాపతి సేననొక పద్ధతిగ నుంచెను. ఇంకేమున్నది. అసురులాతతాయులాయెను వారెల్లప్పుడును యుద్ధమునకు సిద్ధపడియుందురు. ఆమదోన్మత్తులకు యుద్ధముతప్ప యింకొకటి లేనేలేదు. వారు తమతమ వాహనముల నెక్కి స్వర్గము మీఁదకుఁబోయిరి.

స్వర్గమునుజేరి అసురులు అమరావతిని ముట్టడించిరి. ఇంద్రుఁడును తన సేనను దీసికొని అసురుల నెదుర్కొనుటకు వచ్చెను గాని యాతని మనస్సునందుత్సాహములేదు. గురువునకొనర్చిన యవమానమున కాతఁడు మిక్కిలి దుఃఖించుచుఁ జింతించుచు నుత్సాహహీనుఁడై యుండెను. ఎన్నటికైనను ఉత్సాహము లేని వానికి విజయము ప్రాప్తించనే ప్రాప్తింపదు.

అసురులత్యంతోత్సాహమున నిండి దేవతలమీఁద తీక్ష్ణాతితీక్ష్ణ బాణములను వర్షింపఁ జేసిరి అసురుల బాణముల వలన దేవతల లలాట, ముఖ, గ్రీవా, బాహూదర జంఘాది సమస్త అంగ ప్రత్యంగములు ఛిన్నభిన్నములయ్యెను. వారసురుల ప్రహారములకుఁ దట్టుకొనఁజాలక యుద్ధమునుండి పారిపోయిరి. పారిపోవుచున్న దేవతలను నసురులు వెంటాడలేదు,

వారిట్లనుకొనిరి :- "పిరికిపందలవలె వీఁపునుజూపి యుద్ధమునుండి పారిపోవు భయభీతులను వెంటాడుట దుర్బలతయే కాఁగలదు పిఱికితనమే." అని యిట్లనుకొని అసురులు దేవతలను పారిపో నిచ్చిరి. వారు విజయదుందుభులను మ్రోగించుచు నమరావతి లోనికిఁ బ్రవేశించి, ఇంద్రాసనమును వశపఱచుకొనిరి. నిన్నటి వఱకు స్వర్గమున దేవతారాజ్యము, అచ్చటనే యిప్పుడుసుర రాజ్యము జరుగుచుండెను. నిన్నటివఱకు నింద్రుఁ డనుభవించిన యైశ్వర్యమును నేఁడసురులనుభవించుచుండిరి. అప్సరసలిప్పుడు వారిముందాడుచుండిరి. గంధర్వగణము వారి గుణగానమును గావించుచుండిరి. ఈ లక్ష్మి చంచల, చపల నేఁడొక చోటనుండి మరల రేపు ఇంకొకని మెడలో జయమాలను వేయును దీనినెవరు తమదనుకొనుచున్నారో వారందఱును మోసపడిపోవుచున్నారు.

శుకదేవుఁ డిట్లనెను :- "రాజా! దేవతలందఱును స్వర్గ మునువీడి పారిపోయిరి ఇప్పుడు స్వర్గైశ్వర్యము అసురులకు వశ మయ్యెను."

మిమ్ముల నెదిరింపఁజాలరు. ఇప్పుడు దండెత్తినచో మీకు విజయము నిశ్చయము, ఇందుకు సందేహములేదు ”

తన గురుదేవుని అజ్ఞనుబొంది యసురులు రణదుందుభులను మ్రోగించిరి. సమర దుందుభులను విని అసురులందరును అస్త్రశస్త్రములచే సుసజ్జితులై, ఆనందమున గంతులిడుచుఁ గేకలువేయుచు నొక్కచోట సమావేశమైరి. సేనాపతి సేననొక పద్ధతిగ నుంచెను. ఇంకేమున్నది. అసురులాతతాయులాయెను వారెల్లప్పుడును యుద్ధమునకు సిద్ధపడియుందురు. ఆమదోన్మత్తులకు యుద్ధముతప్ప యింకొకటి లేనేలేదు. వారు తమతమ వాహనముల నెక్కి స్వర్గము మీఁదకుఁబోయిరి.

స్వర్గమునుజేరి అసురులు అమరావతిని ముట్టడించిరి. ఇంద్రుఁడును తన సేనను దీసికొని అసురుల నెదుర్కొనుటకు వచ్చెను గాని యాతని మనస్సునందుత్సాహములేదు. గురువునకొనర్చిన యవమానమున కాతఁడు మిక్కిలి దుఃఖించుచుఁ జింతించుచు నుత్సాహహీనుఁడై యుండెను. ఎన్నటికైనను ఉత్సాహము లేని వానికి విజయము ప్రాప్తించనే ప్రాప్తింపదు.

అసురులత్యంతోత్సాహమున నిండి దేవతలమీఁద తీక్ష్ణాతితీక్ష్ణ బాణములను వర్షింపఁ జేసిరి అసురుల బాణముల వలన దేవతల లలాట, ముఖ, గ్రీవా, బాహూదర జంఘాది సమస్త అంగ ప్రత్యంగములు ఛిన్‌భిన్నములయ్యెను. వారసురుల ప్రహారములకుఁ దట్టుకొనఁజాలక యుద్ధమునుండి పారిపోయిరి. పారిపోవుచున్న దేవతలను నసురులు వెంటాడలేదు.

వారిట్లనుకొనిరి :- "పిరికిపందలవలె వీఁపునుజూపి యుద్ధమునుండి పారిపోవు భయభీతులను వెంటాడుట దుర్బలతయే కాఁగలదు పిఱికితనమే." అని యిట్లనుకొని అసురులు దేవతలను పారిపో నిచ్చిరి. వారు విజయదుందుభులను మ్రోగించుచు నమరావతి లోనికిఁ బ్రవేశించి, ఇంద్రాసనమును వశపఱచుకొనిరి. నిన్నటి వఱకు స్వర్గమున దేవతారాజ్యము, అచ్చటనే యిప్పుడసుర రాజ్యము జరుగుచుండెను. నిన్నటివఱకు నింద్రుఁ డనుభవించిన యైశ్వర్యమును నేఁడసురులనుభవించుచుండిరి. అప్సరసలిప్పుడు వారిముందాడుచుండిరి. గంధర్వగణము వారి గుణగానమును గావించుచుండిరి. ఈ లక్ష్మి చంచల, చపల నేఁడొక చోటనుండి మరల రేపు ఇంకొకని మెడలో జయమాలను వేయును దీనినెవరు తమదనుకొనుచున్నారో వారందఱును మోసపడిపోవుచున్నారు.

శుకదేవుఁ డిట్లనెను :- "రాజా! దేవతలందఱును స్వర్గ మునువీడి పారిపోయిరి ఇప్పుడు స్వర్గైశ్వర్యము అసురులకు వశ మయ్యెను."

## పరాజితులగు సురలకు బ్రహ్మ ఉపదేశించుట

శ్లో॥ అహో బతసురశ్రేష్ఠా హ్యభద్రం వఃకృతం మహత్ ।
బ్రహ్మిష్ఠం బ్రాహ్మణం దాంత మైశ్వర్యాన్నాభ్యనందత॥
తస్యాయ మనయస్యాసీత్పరేభ్యో వః పరాభవః ।
ప్రక్షీణేభ్యః స్వవైరిభ్యః సమృద్ధానాం చయత్సురాః ॥

శ్రీభాగ. ౬ స్కం. ౭ అ. ౨౧, ౨౨ శ్లో॥

ఉ॥ నెట్టన పాపకర్మమున నేరమింజేసితి రేమి సెప్ప మీ
పుట్టిన నాఁట నుండియును బుద్ధులుసెప్పి జగంబులేలఁగాఁ
బట్టముఁగట్టి పెంచిన కృపానిధి బ్రహ్మకళావిధిజ్ఞుఁ జే
పట్టక గుట్టుజాఱి సిరిపట్టునఁ దొట్టిన పొట్టక్రొవ్వున౯॥

వ. బ్రహ్మిష్ఠుండైన బ్రాహ్మణు నాచార్యు గైకొనక గురు ద్రోహంబు సేసితిరి తద్దోషం బిపుడు మీకుఁజేసేత శత్రుకృతంబై యనుభవింపఁజేసె"

శ్రీ మదాంధ్ర భాగవతము.

తనవలనఁ దెలిసిగాని తెలియకగాని యేదైన నపరాధము జరిగియుండినచోఁ దక్షణము పెద్దలకడకుఁబోయి ఉన్నదున్నట్లుగ నివేదింపవలయును చదువుటవేళ అనుభూతి కలుగుటవేళ వృద్ధికిఁ బోవువాఁడు సమస్త విషయములందనుభూతిని జూచుకొనుచుండును. ఏ సమయమున నెట్టి కార్యము నొనర్చిన నే విధముగఁ బరా

మించునో ఆ అనుభవము వృద్ధులకు బాగుగాఁ గలదు. అందుకనియే వృద్ధులులేని సభ సభయేకాదనిరి. కేవలము తల నెఱియుటచే వృద్ధుఁడు కాఁజాలఁడు. వయః పరిపాకముతోఁబాటుగా బుద్ధి పరిపాకముకూడ కలవాఁడు చెప్పిన యుపాయములవలన సదా కళ్యాణమే కలుగును. కావున నందఱును ముఖ్యముగ యువకులు వృద్ధసేవ చేయవలయును.

శుకదేవుఁ డిట్లనెను :- "రాజా! దేవతలైశ్వర్యవిహీనులు కాఁగానే వారికొక సద్బుద్ధి పుట్టెను. వారి గర్వము వలననే వారి కట్టి పరాభవము గలిగినది. ఇఁక నిప్పుడు లోక పితామహుఁడగు బ్రహ్మకంటె వారికి వేఱుగతిలేదు. మంచివారును, చెడ్డవారును, పాపులును, అపరాధులును, నాతనివారే. ఆయన నాశ్రయించి సమస్త మాతనికి నివేదింపవలయును. అని యిట్లాలోచించుకొని, ఇంద్రునిముందు పెట్టుకొని బ్రహ్మకడకుఁబోయిరి. లోకపితామహునకుఁ బ్రణామము కావించి, తలవంచుకొని దీనులై ఆతని సమీపమున నిలుచుండిరి. దేవతలు చింతితులై యుండుటనుగాంచి బ్రహ్మ వారిపై వాత్సల్యముతో నిట్లనెను :- "దేవతలారా! మీరింత చింతతో నున్నారేల? మీ ముఖములన్నియు వాడిపోయియున్నవేమి? బ్రహ్మ పలికినది విని మిక్కిలి లజ్జతో దేవేంద్రుఁడిట్లనెను :- "ప్రభూ! ఏమిచెప్పుదుము? మా వలన గొప్ప యపరాధము జరిగినది, ఐశ్వర్యమదమున మేము గురువునకవజ్ఞను గావించితిమి, ఆతనిని సన్మానింపలేదు. మా యవినయమున కసంతుష్టుఁడై గురుదేవుఁడు మమ్ములను బరిత్యజించి వెళ్ళిపోయినాఁడు. ఆతఁడు

వెళ్ళిపోఁగానే అసురులు మాపై దండెత్తి, మమ్ముల నోడించి స్వర్గము నాక్రమించి బరిపాలించుచున్నారు.

ఇది విని బ్రహ్మ దుఃఖితుఁడై యిట్లనెను :- "దేవతలారా! సత్యావతారులని చెప్పబడుచున్నారు. మీరు చేసినపనినిఁజూతమా తమోగుణకార్యమై యున్నది. మీరు రజస్తమోగుణములకు వశీభూతులై పాపము లొనర్చితిరి. ఛీ! ఛీ!! చాల దుఃఖింపవలసిన విషయము. మీరైశ్వర్యమదమున నంధులరై పరస్పరము కొట్టుకొని చచ్చుచున్నారు. మీరు హద్దును దాఁటితిరి. జితేంద్రియుఁడును, బ్రహ్మ నిష్ఠుఁడును, వేదజ్ఞుఁడును, సర్వశాస్త్రపారంగత బ్రాహ్మణుని - సాధారణ బ్రాహ్మణుఁడుకూడ కాదు మీరు గురువును, సాక్షాద్భగవత్స్వరూపుఁడునగు వానిని మీ రవమానించిరి. ఇది చాల చింతింపవలసిన విషయము.''

ఇంద్రుఁడు లజ్జతో నిట్లనెను :- "స్వామీ! ఇప్పటికైనదేమో అయినది. మా కిప్పుడు చేయవలసిన పనియేమియో చెప్పుఁడు. యోగ్యమగు సలహానీయుఁడు. ఏదైనఁ బ్రాయశ్చిత్తముండిన చెప్పినఁ జేసికొనెదము."

బ్రహ్మ రోషస్వరమున నిట్లనెను :- ''సాధారణ పాపములకును మహాపాపములకును బ్రాయశ్చిత్తముండునుగాని యీ పాపమునకేమి ప్రాయశ్చిత్తము? భగవంతుఁడన్ని పాపములను క్షమించునుగాని, సాధు, గురుద్రోహముల నెన్నటికిని క్షమింపఁడు. సమస్త సమృద్ధి గురు కృపవలననే ప్రాప్తించును

గురువుయొక్క కృపాలేశము లేనివారికి ఇహపరలోకములలోని సమస్తైశ్వర్యమును నశింపఁగలదు అట్టివాఁడు భయభ్రష్టుఁడై నశించును. మీరు దూరముగ వెళ్ళ నెందుటకు ? ప్రత్యక్షముగఁ జూఁడుడు. మీరు సర్వ సమర్థులు బలవంతులు, ఐశ్వర్యశాలురు. సత్త్వగుణముగల దేవతలు, అయినను గురువు నవమానించుటచే మీ సమస్త సద్గుణములు నశించినవి. సమృద్ధిశాలురయ్యు నేఁడు శాంతిహీనులరై శ్రీహీనులరై ఇటునటు నిల్వువాఁకిలిలేక పరాజితులై తిరుగాడుచున్నారు. దీనికి విపరీతముగ నసురులను గాంచుఁడు. వారు హింసకులు, సదా క్రూరకర్మరతులు. వారికి రజస్తమస్సులే ప్రధానములు. భగవంతునకు నోడి పాతాళమున నివసించుచున్నారు. వారివద్ద యుద్ధోచితమగు నధిక సామగ్రియును లేదు. శక్తిహీను లయ్యుఁ గేవలము వారి గురువగు శుక్రాచార్యుని కృపచే మిమ్ము లను దరిమివేసినారు. ఇప్పుడు స్వర్గసుఖము లనుభవించుచున్నారు. వారందఱును శుక్రాచార్యున కధీనులు. ఆతని యాజ్ఞకధీనులు. సమస్తవిధముల నాతని సేవించుచుందురు. ఇదంతయు మీ యన్యా యము యొక్క ఫలము. గురువు నవమానించిన పరిణామము."

ఇంద్రుఁడిట్లనెను - "స్వామీ ! వారందఱును క్రూరులు స్వర్గముమీఁదఁ గ్రూరుల కాధిపత్యముండరాదు."

బ్రహ్మ తనమాటనే సమర్థించుచు నిట్లనెను- "వారందరును క్రూరులని నే నంగీకరించితిని. వారు దుష్ట ప్రకృతిగల వారని అందరు నెరుఁగుదురు, కాని ఒక గొప్ప సద్గుణము చిన్న చిన్న

దుర్గుణముల నణఁచును. గురుభక్తి గురుశుశ్రూష యెంతటి మహా గుణమనఁగా దాని ముందఱ సమస్త దుర్గుణము లణగిపోఁగలవు. వారిప్పుడింద్రాసనమున కధీశ్వరులైరి. ఇదివరకు వారు మీవలన నోడిపోయినను నేఁడు శుక్రాచార్యుని భక్తిపూర్వకముగ నారాధించి ఉన్నతిని జెందిరి. వారు స్వర్గమున కధికారులుకారని మీరను చున్నారు. వారికిట్టి సద్బుద్ధియే నిలిచియుండుచో వారు నా లోక మునకుఁగూడ అధికారులగుట కేవిధమగు సందేహమును లేదు. నన్నుఁగూడ యీ బ్రహ్మ లోకమునుండి వెడలఁగొట్టవచ్చును."

దేవతలు దుఃఖితులై యిట్లనిరి - "ప్రభూ! మేము మా యపరాధము నంగీకరించుచున్నాము. మాకు శుభము కలుగునట్లును మా శత్రువుల కమంగళము కల్గునట్లును, మాకు పోయిన రాజ్యము ప్రాప్తించు నుపాయమును జెప్పుఁడు."

ఇది విని బ్రహ్మ నవ్వి యిట్లనెను - "ఇంద్రా! నీవేటి మాటలు పలుకుచున్నావు? గో, గురు, భగవద్భక్తులగు వారి కెన్నటికిని అమంగళములు కలుగఁజాలవు. గురుకృపగల్గిన వానికి స్వర్గీయభోగములు తుచ్ఛములు. స్వర్గముమాట అట్లుంచుఁడు. వారు ముక్తినిఁగూడ కాలఁదన్నెదరు, భగవంతుడప్రసన్నుఁడగుచో మానవుఁడు గురు చరణసరోజముల నాశ్రయించి, తన దుఃఖమును జెప్పుకొని, గురుకృపచే మరల ప్రభుప్రసన్నతను సంపాదించు కొనవచ్చును. కాని గురుడప్రసన్నుఁడగుచో నింకెవనిని శరణు వేడినను లాభములేదు. గురుద్రోహినిఁగాంచి భగవంతుఁడును భయ పడును. గురువు తన కపరాధ మొనర్చినవానిని క్షమింపవచ్చును.

భగవంతుఁడును దన కపరాధము చేసినవానిని క్షమించును గాని గురువునకపరాధ మొనర్చినవానికి పట్టుదలతో దండన మొసంగును.

అంత శౌనకుఁడిట్లడిగెను- "సూతా! భగవంతుఁడు తన కుఁజేసిన యపరాధముకంటె గురువునకుచేసిన యపరాధము నేల మిన్నగ భావించును."

అంత సూతుఁ డిట్లనెఁను - "సూతా! కృతఘ్నత అన్నిటి కంటె గొప్పయపరాధము. గురువు మనకు సంసారమును దరించు నమోఘ మంత్రము నొసంగినాఁడు మన యమ రోగమును నాశము చేయుటకుఁ బూనుకొనినాఁడు. అట్టి వానికి ద్రోహ మొనర్చినచో నేగతి ప్రాప్తించునో. జీవి భగవంతున కడుగడుగునకు నవమాన మొనర్చుచున్నాఁడు. వీఁడు బిడ్డఁడని భగవంతుఁడనుకొనును. ఆతఁడు ఒక్కొక్కప్పుడు తన కపరాధ మొనర్చి వానియందు అనాయాసముగఁ బ్రసన్నుఁడగుచుండును. ఈ విషయమున నొక దృష్టాంతమును వినుఁడు.

ఒకానొక దొంగ యుండెను. ఎచ్చటికో దొంగ తనము చేయుటకొకరాత్రి బయలుదేరెను. తిరిగి తిరిగి ఒక శివాలయము నకుఁబోయెను. దైవికముగ నా దినమునఁ బ్రదోషము శివునిమీఁదఁ జాల పత్రి పూలు, ఫలాది నైవేద్యాదులర్పింపఁబడి యుండెను. చాల దీపములుకూడ వెలుఁగుచుండెను, పూజాదులొనర్చి భక్తులంద టను వెళ్ళిపోయిరి. అంతయు శూన్యముగనుండెను. ఏకాంతము. చోరుఁడు ముందుగావెళ్ళి ఫలాదులపైఁ జేయిచేసికొని నాల్గువైపులను

జూచెను. దొంగ తనము చేయుట కేవస్తువును లభింపలేదు. కనఁ బడనూలేదు. భగవంతుని పానవట్టముపై నొక కొక్కెమునకొక పెద్దగంట వ్రేలాడ గట్టఁబడియుండెను. దొంగ యిట్లనుకొనెను – "ఈ గంట లభించుచో దీనినమ్మినఁ బదిఁ యిరువది రూప్యములు లభింపవచ్చును."

గంట చాల యెత్తుననున్నది. అక్కడవఱకు చేతులందనే అందవు. శివునిపీఠము పెద్దది. విశాలమైనది ఆతఁడు "ఈ పీఠముపైనెక్కి దీనినిఁ దీసికొనవచ్చు." ననుకొనెను.

ఇట్లాలోచించుకొని యాతఁడు తన రెండు కాళ్లను శివ లింగముపైనుంచి నిలుచుండి గంట నూడఁదీయసాగెను. శివున కాతఁడెంతో యపరాధము నొనర్చెను. కాని శివుఁడు బోళాశంకరుఁ డాయెను. ఎప్పుడెవరిమీఁద నే విధముగ ననుగ్రహించునో ఎవ్వ రికినిఁ దెలియదు. ఆ దొంగచేసిన పని కప్రసన్నుఁడు కావలసిన వాఁడు ప్రసన్నుఁడై వరము నడుగమనెను.

అంత శౌనకుఁ డిట్లనెను – "స్వామీ! చోరుఁడేమిచేసి నాఁడు? శివుఁడాతనిపై నే కారణమునఁ బ్రసన్నుఁడైనాఁడు. పైగా నాతఁడా శంకరునిమీఁద దన పాదమునుంచి ఘోరాపరాధ మొనర్చినాఁడు."

అంత నవ్వుచు సూతుఁడిట్లనెను– "స్వామీ! భగవంతుఁడు జీవులు తనయెడలఁ జేసిన యపరాధములవైపు చూడనే చూడఁడు. కీ యపరాధములకే యాతఁ డప్రసన్నుఁడగుచో సమస్త నాస్తికుల జిహ్వలను గోసిగోసి కుప్పలుపెట్టి మూఁగ వారినిఁ జేయవలసి

యుండును. భగవంతునియెడల జీవి ఎంతో అపరాధ మొనర్చు చున్నాఁడు. ఏ భగవంతుఁడిట్టి సుందరశరీరము నొసంగినాఁడో ఆతనినిఁ జింతింపక అహర్నిశలు విషయచింతనము చేయు చున్నాఁడు. ఆ దొంగ ఫలాదులను దినుటకు శివునిపైనున్న బిల్వ పత్రములను దొంగిలించెను. ఇది యొక సేవయైనది. రెండవది ఆతఁడు తన శరీరమునంతను శివునిపై మోపి ఆతనిపైకియెక్కెను శివుఁడిట్లనుకొనెను – "ఆహా! వీఁడెంతటి భక్తుఁడు? లక్షాధికారి యగు నొక శెట్టివచ్చి ఒక కానీ నర్పించెను. ఒక స్థూలకాయ యగు నామెకెంతో ధనమున్నది కాని ఒక అఱగినకానీ, పుచ్చు వక్కపలుకును నేఁడీ ప్రదోష సమయమున నర్పించి, పుత్ర, పౌత్ర, ధన వైభవాదుల నన్నింటినో యాంచించినది. పాపము వీఁడు తన శరీరమునంతను నాపైనుంచి అడిగినదేమున్నది? నా ప్రసాదమును నల్పమూల్యమగు గంటనేగదా! వీనికిమించిన త్యాగి యగు భక్తుఁడెవఁడుండఁను?" అని యిట్లాలోచించి శివుఁడు వానినిఁ దన గణములోనికిఁ జేర్చుకొనెను. ఆతఁడు పశుపతికిఁ బ్రియపార్ష దుఁడయ్యెను.

సూతుఁ డిట్లనెను – "మునులారా! ఇది శివుఁడపరాధ మొనర్చినవానికి జూపిన కృప. ఇఁక నిప్పుడు గురుద్రోహికాతఁ డెట్లు దండనమొసంగెనో, ఈ విషయమునగూడ మీకు నే నొక రోచకమగు కథను జెప్పెదను. దానిని సావధానముగ వినుఁడు."

# గురుద్రోహికి గురుకృపలేక కల్యాణము లేదు

శ్లో॥ మఘవన్ ద్విషతః పశ్య ప్రక్షీణాన్ గుర్వతిక్రమాత్ ।
సంప్రత్యుప చితాన్భూయః కావ్యమారాధ్య భక్తితః ॥

శ్రీ భాగ. ౬ స్కం. ౭ అ. ౨౩ శ్లో॥

వ. ......... అతిబలవంతులైన మిమ్ము అతిక్షీణులయిన రాక్షసులు జయించుట దయ యార్యుండైన శుక్రు నారాధించి తన్మంత్ర ప్రభావంబునఁ బునర్లబ్ధవీరులైరి."

శ్రీ మదాంధ్ర భాగవతము

ప్రపంచములో నొకరికిమించి యింకొకరు ఉపకారమును జేయుచుందురు. చాలమంది తమ గురుతర స్వార్థములను బరిత్యజించి పరుల కుపకార మొనరించుచుందురు. చెమట నెత్తురును గలిపి సంపాదించిన ధనమును దుఃఖదీనుల కొసంగెదరు. ఆఁకలిగొన్న వారికన్నమును, రోగుల కమూల్యములగు నౌషధములను, దప్పిక గొన్నవారికి జలమును, శీతార్తులకు వస్త్రేంధనములను నొసంగి ఉపకార మొనర్చినవారిని సర్వశ్రేష్ఠులుగ నెన్నుచుందురు, కాని యీ ప్రపంచమున నభయ మొసంగినవారే సర్వశ్రేష్ఠులు. అజ్ఞానాంధకారమునఁబడిన ప్రాణులకు పుణ్యలోకప్రదానము గావించినవాఁడును ఎవ్వఁడు 'గు' అనఁగా అజ్ఞానమును, 'రు' అనఁగా నాశముచేయువాఁడు అజ్ఞాననాశకుఁడగు గురువుచేసిన యుపకారమునకుఁ బ్రత్యుప

కారమే మానవుఁడు చేయగలఁడు? ఇట్టి పరమోపకారియగు గురువు నకు ద్రోహ మొనర్చువాఁడు రౌరవ నరకయాతనల ననుభవింప వలసియుండును. అట్టివానికి విపత్పరంపరలు వచ్చి నెత్తినఁబడఁ గలవు. ఒకటి తర్వాత నింకొకటిగా నిట్టు విపత్తుల ననుభవించుచు నీసంసార చక్రమున భ్రమించుచుండును. వానిని భగవంతుఁడుకూడ ఉద్ధరింపఁజాలఁడు. గురువనుగ్రహించినవాఁడే ఆతని ఉద్ధారము కలుగగలదు.

సూతుఁడిట్లనెను- "మునులారా! మీకు నేను గురుద్రోహిని గూర్చి చెప్పుచున్నాను. గురువు క్షమామూర్తిగా నుండును. ఆతఁడు శిష్యాపరాధములమీఁద దృష్టినుంచనేయుంచఁడు. కాని భగవంతుఁ డన్నిటిని సహించునుగాని గురుద్రోహిని క్షమింపఁజాలఁడు. ఈ విషయమున మీకు నేనత్యంత ప్రాచీనకాలమునకు సంబంధించిన ఇతిహాసమును జెప్పెదను.

పరమపావనమగు నయోధ్యాపురియందు మిక్కిలి గర్వము గల శూద్రుఁడొకఁడు నివసించుచుండెను. ఏపురియందు జన్మించుట అనంతజన్మ పరిపాకమువలనఁ గలుగునని యెన్నఁబడుచున్నదో అట్టి పురిలో జన్మించియు దాని మహత్వము నెఱుఁగఁజాలకుండెను. కొంతకాలమైన తర్వాతఁ గాలక్రమముచే నేదో విపత్తువలన నా తఁడయోధ్యను వదలి అవంతీ నగరమునకుఁబోయెను. దైవికముగ నచ్చటనొక గొప్పజ్ఞానియు, ధ్యానియు నగు శివభక్తుఁడగు మహా త్ముఁడు లభించెను. ఆతనికి శ్రీసీతారాముల **చరణములందనన్య** భక్తి. ఈశూద్రుఁడు యాబ్రాహ్మణుని సేవించుచుండెను. భగవద్భ

క్తులు సాధారణముగఁ గృపాసాగరులై యుందురు. ఆశూద్రుని దీను నిగను, హీనునిగను, మలినమతియనియుఁ దెలిసికొని బ్రాహ్మణుఁ డతని యుద్ధారమున కుపాయము నాలోచించుచుండెను. ఒకదినమున నాతఁడు మిక్కిలి ప్రేమతో నిట్లనెను- "నాయనా! శివరామదాసు! నీవు భజన పూజనము లేమైనను చేయుచుంటివా."

ఆతఁడిట్లనెను- "స్వామీ! నాకు భజన పూజనము లేమి యును దెలియవు" అంతఁ గృపాళుఁడగు ద్విజుఁడిట్లనెను - "నాయనా! నీవీ శివపంచాక్షరీ మహామంత్రమును జపించుము. ఈతని జపమొనర్చుటచే నీకు శ్రీరామచంద్ర చరణారవిందముల మీఁద నవిచలమగు భక్తి కలుగగలదు."

పైకి యాశూద్రుఁడు సరళస్వభావుఁడుగఁ గనఁబడుచుం డెను గాని ఆతనికి లోపల స్వయంపాకమెక్కుడు. ఆతఁడుతానే గొప్పధ్యాని యనియు, జ్ఞానియనియుఁ బండితుఁడనను కొనుచుం డెను. ఆతఁడు సాధు బ్రాహ్మణులను ద్వేషించుచుండెడువాఁడు లోలోనభాగవతులనుగాంచి క్రుళ్ళుకొనెడువాఁడు బ్రాహ్మణుఁడీతని యిట్టి వ్యవహారమునుగాంచి సదా చింతించుచుండెడువాఁడు ఆతనినిఁ బుత్రునివలె బుజ్జగించుచుఁ బ్రేమతో నిట్లనెను- "వత్సా! ఈ విధ ముగ సాధువుల కవజ్ఞగావింపరాదు జగత్తులో సాధువులే అందఱ కును నిజమైన సుహృదులు, సఖులు, ఆత్మీయులు. సాధుచరణ సేవవలనఁ గల్యాణముగలదు. నీవు సాధువులకు వందనమొన్న

ర్పుము బ్రాహ్మణభక్తి కలిగియుండుము.” ఈవిధముగ గురువు శ్రద్ధాళువగు తన శిష్యునకు సమస్త విధములఁజెప్పుచుండెడువాఁడు; కాని వాని మనస్సునకెక్కుటలేదు. కాని అతఁడు స్వభావమున యథాప్రకారముగనే యుండెను. ఇట్లుండియు గుర్వాజ్ఞచే గర్వము తోడనే శివమంత్ర జపమొనర్చుచుండెను.

ఒక దినమున నాతఁడు శివాలయమందు గూర్చుండి జపము చేయుచుండఁగా నాతనికి మంత్రమొసంగిన గురువువిచ్చేసెను. గురువు విచ్చేయుటకూడ ఆశూద్రుడు చూచినాఁడు. లేచి గురుదేవు నకుఁ బ్రణామ మొనర్పవలయునని ఆతనికిఁ దెలియును. కాని గర్వమునకు వశీభూతుఁడై యాతఁడు గురుదేవునకుబత్యుత్థానమును గావింపలేదు లేచిబ్రణామ మొనర్పనులేదు గురువు అమాయకుఁడు, సరళ స్వభావముకలవాఁడు. ఆతఁడీ విషయమును దృష్టిలోఁ బెట్టుకొనలేదు. ఈతఁడు ప్రణామము చేసినది ఆయన కుఁదెలియనే తెలియదు, ఒకవేళ తెలిసియున్నను గోపింపక క్షమిం చెడువాఁడే. ఆతఁడు క్షమంచిన క్షమించునేమో కాని శివుఁడు గురు ద్రోహి నెన్నటికిని క్షమింపఁడు. అందువలన శివుఁడా శూద్రునకు శాపమొసంగెను. ఆలయమునుండి స్పష్టముగ మేఘ గంభీర స్వర మున నిట్లాకాశవాణి వెలువడెను- “ఓరీ దుష్టా! నీవింత సరళుఁడు, నిజమరి, సర్వసమర్థుఁడగు గురువు నవమానించితివి, కావున నీవు నూర్లకొలఁది జన్మలనుఁ జచ్చుచుఁ బుట్టుచుండుము. నీవు నరక యాతనల ననుభవింపవలసి వచ్చుఁగాక!”

ఇట్టి యాకాశవాణిని వినఁగానే ఆశూద్రునకును గ్లేశము కలిగెను, బ్రహ్మజ్ఞానియగు నావిప్రునకును గ్లేశము కలిగెను. ఆతఁడు వివిధ స్తోత్రములద్వారా శివుని స్తుతించి, తన శిష్యుని యపరాధమును క్షమింపఁగోరెను. గురువు ప్రసన్నుఁడగుచో నాతఁడపరాధియైనను నిరపరాధియే, అందువలన శివుఁడిట్లు వరము నొసంగెను- నూర్లకొలఁది జన్మలెత్తవలసినదే కాని జనన మరణములందు నీకేమియును కష్టము కలుగకుండుఁగాక! సహజముగ నేజన్మింపఁగలవు. ఏవిధమగు కష్టము లేకుండ శరీరమును జీర్ణవస్త్రమును ద్యజించినట్లు త్యజింపఁగలవు, ఇదిగాక నీకు పూర్వజన్మముల జ్ఞానముండును గాక!" ఈవరమునుసరించి యాతఁడు కష్టములేకుండ వందలకొలఁది జన్మలెత్తెను. చివర కయోధ్యాపురమునందొక బ్రాహ్మణుఁడుగఁ బుట్టెను. పూర్వజన్మముల కారణమున నాతనికి పుట్టినప్పటినుండియు రామచరణములందు భక్తియు, రామకథలయందనురాగము కలిగెను. గురుకృపచేతను, శివునివరమువలనను వానికి సమస్త జన్మముల జ్ఞానమును, సర్వత్ర అవ్యాహతగతియు కలిగెను. ఆతని తండ్రి ఆతనిని లౌకిక, వైదిక విద్యాపారంగతునిఁ జేయఁదలఁచెను గాని యాతనికి గురుప్రసాదముచే నివి నచ్చలేదు. కాలాంతరమున నాతని తల్లిదండ్రులు పరలోకవాసులైరి. ఇప్పుడింకేమున్నది? ఆతఁడు స్వచ్ఛందుఁడై ఇటునటుఁ దిరుగుచుండెను. ఋషుల యాశ్రమములకుబోయి వారిని ఉపదేశమొసంగవలయునని ప్రార్థించుచుండును. ఋషులు వానికి బ్రహ్మజ్ఞానమును గూర్చియు

యోగ, సాంఖ్యములనుగూర్చి ఉపదేశించిరి. కాని ఆతని మనస్సు నందు రామచరిత్ర శ్రవణము చేయవలయుననెడికోరిక యుండె డిది. కావున నాతనికెచ్చటను సంతోషము లేకుండెను.

ఒకసారి తిరిగి తిరిగి లోమశమహర్షి ఆశ్రమమునకుఁ జేరెను. లోమశమహర్షికి ఇంతవయస్సని చెప్పలేమని ప్రసిద్ధి. మహాప్రళయమందును నాతనికి నాశములేదు. ఆతని ముందనేక మంది బ్రహ్మలు మారిపోయిరి. బ్రహ్మపోయిన తర్వాత శ్రద్ధ మొనర్పవలయును. ఇప్పుడు నిత్యము శ్రద్ధమొనర్చుట కేమిచేయ వలయును? అందువలన మహాకల్పమందు బ్రహ్మ మారిపోయినప్పు డీతఁడు తన లోమమును బెఱికిపడవేయు చుండెడువాఁడు. కావున నీతనికి లోమశ ఋషియను పేరు కలిగెను ఈతఁడు గొప్ప జ్ఞాని. ఈ యయోధ్య బ్రాహ్మణుఁ డాతని నాశ్రయించి రామచరిత్రమును వినిపింపవలయునని ప్రార్థించెను ముని సగుణసాధననుగుఱించి చెప్పి నిర్గుణ నిరూపణము కావింప నారంభించెను. ఈతడు సగుణ సాకారావతారరూపము నుపాసించువాఁడు అందువలన మాటిమాటికి ముని వచనములకుఁ బ్రశ్నింపసాగెను. మాటిమాటికి సగుణరూప వర్ణనము చేయవలసినదని ప్రార్థించుచుండెను. మునికి ఈతని యశిష్టాచారమునకుఁ గోపమువచ్చెను. ఈతని గురువు సర్వజ్ఞుఁ డైనను జ్ఞానియైనను శంకలు కలుగుచున్నవని లోమశ మునికిఁ గోపమువచ్చి ఇట్లు శాపమొసంగెను :- "నీవు కుతర్కివి, అవి శ్వాసివి. కావున చండాల పక్షివికమ్ము."

ఋషివాక్యము లమోఘములు. వ్యర్థములు కావు. బ్రాహ్మణుఁడు వెంటనే కాకియై యెగురసాగెను. ఆతనికి శాపమువలన హర్షవిషాదములు కలుగలేదు. గురుకృపచే జ్ఞానము లోపించదు. అవ్యాహతగతి. రామచరిత్రము నందనురాగ మెుండుటచే నిట్లను కొనెను :- "నేను వేలకొలఁది జన్మలనెత్తితిని. కాకియైననేమి?" ఈ సహనమునకు లోమశ మహాముని చాల సంతోషించి, వానినిఁ బిలచి రామచరిత్రము నుపదేశించి నీ వున్నచోటకు యోజనము వఱకు మాయ వ్యాపింపకుండుఁ గాక! కల్పాంతమందును నీకు నాశము కలుగకుండుఁగాక. అజరామరుఁడయ్యెదవు ఇచ్ఛానుసారముగ రూపమునుగూడ ధరించెదవు."

సూతుఁ డిట్లనెను :- "మునులారా! ఆతఁడే శ్రీరామ చరిత్రమునకు ప్రధానవక్త కాకభుశుండియయ్యెను. కాకభుశుండికి కాకి శరీరమే మిక్కిలి ప్రియమైనది. ఆతఁడే శరీరమునైనను ధరింప గలఁడు. కాని యే శరీరముతో శ్రీరామ చరిత్రమును వినెనో అది ఆతనికత్యంత ప్రియముగ నుండెను. అందువలన నాతఁడు తన యాశ్రమములోనుండి శ్రీరామ చరిత్రమును జెప్పుచుండెడివాఁడు. పక్షులన్నియు వినుచుండెడివి. పక్షి రాజగు గరుత్మంతుఁడును నీతనికడకుఁబోయి రామ చరిత్రను వినెడివాఁడు.

ఈ కాకభుశుండి గుర్వపరాధ మొనర్చినను శివునిచే శపింపఁబడినను గురుకృపచే నీతఁడు ఋషికల్పుఁడైనాఁడు. ఈతని జ్ఞానమమోఘము. ఈతఁడు చాలరామోపాసకుఁడు భగవంతుఁడవతారమును ధరించినప్పుడెల్ల అచ్చటికి వెళ్ళి ఆతనితోఁ గ్రీడించు

చుండును. కావున గురుద్రోహికేదైన నుపాయమున్నదనిన నది గురుకృపయే. ఈ విషయమునే బ్రహ్మ దేవతలకుఁ జెప్పెను. "దేవతలారా! మీరు మీ గురువగు బృహస్పతి నవమానించి చాల చెడ్డపనిచేసితిరి. ఇప్పుడు మీరిట్టి దుఃఖము నందువలననే పడు చున్నారు."

అంత దీనతతో నింద్రుఁడిట్లనెను :- "ప్రభూ! అయినదేమో అయినది మేమీ విపత్సముద్రము నుండి యిప్పుడు బయటఁబడు నుపాయముండినఁ జెప్పుడు. మీరుతప్ప మా కింకెవరును గతిలేరు మేము మిమ్ములను శరణువేఁడితిమి. మీకెట్లుతోచిన నట్లు మమ్ముద్ధ రింపుఁడు. ఈ దోషమేవిధముగఁ బోఁగలదో అట్టి యుపాయమును జెప్పుడు."

శ్రీ శుకదేవుఁడు పరీక్షిన్మహారాజుతో నిట్లనెను :- "రాజా! ఇంద్రాదులు బ్రహ్మను అనునయ వినయముల ద్వారా బహువిధ ములఁ బ్రార్థింపఁగా నాతఁడు ధ్యానపూర్వకముగ దేవతలకు హిత మేదియో ఆలోచించుచుండెను."

## విశ్వరూపునిఁ బురోహితునిఁగ నంగీకరించుట

శ్లో॥ తద్విశ్వరూపం భజతాశు విప్రమ్ ।
తపస్వి నం త్వాష్ట్రమథాత్మవంతమ్ ।
సభాజితోఽర్థాన్ స విధాస్యతే వో
యది క్షమిష్యధ్వముతాస్య కర్మ ॥

శ్రీభాగ. ౬ స్కం. ౭ అ. ౨౩ శ్లో॥

"వ......మీరిప్పుడు త్వష్టయను మను పుత్రుండగు విశ్వరూపుండను ముని నిశ్చల తపోమహత్త్వ సత్త్వ స్వభావుండతని నారాధించిన మీకు నభీష్టార్థంబుల నతఁడు సంఘటిల్లఁ జేయును."

శ్రీ మదాంధ్ర భాగవతము.

ప్రపంచములో స్వార్థమునకు మించిన నిందితమైనదియుఁ బ్రియమైనదియు నగు కార్యమింకొకటి లేదు. స్వార్థ సిద్ధికొఱకు అర్థి యే దోషమును జూఁడడు. స్వార్థముకొఱకు గాడిద కొడుకని పించుకొనును స్వార్థముకొఱకు మానవుఁడు నీచాతినీచకార్యముల నైనఁ జేయుట కుద్యుక్తుఁడగును. దేనివలన మానవునకు స్వార్థము సిద్ధించునో దానియందు వాఁడెంతో ప్రేమ ప్రదర్శించును. దాని కొఱకు ప్రాణార్పణమునైనఁజేయ సిద్ధపడును. స్వార్థము సిద్ధించిన తర్వాత నెవరికివారే యమునాతీరే. ఇంతేకాదు ఎవనివలన మనకీ కార్యము సిద్ధించినదో వారికి గొప్ప హాని నొనర్చుటకును, జివరకుఁ బ్రాణములు తీయుటకును సిద్ధపడును. ఇట్టి స్వార్థ ప్రపంచమందు ప్రేమ నన్వేషించువాఁడజ్ఞుండును, బొరపడిన వాఁడుగ నగును ప్రపంచములోఁ బ్రేమయునులేదు. ఆత్మీయతయునులేదు. సర్వత్ర స్వార్థమే. స్వార్థము నెఱవేరుట కెంతటి దూరమువారైనను ఆత్మీయ స్వజనమేయని చెప్పుకొనును. నీచునిఁగూడ అల్ప సంతోషియనును. ఎంత చెడ్డవానినైనను వానిని సుజనుఁడని పొగడును. తన స్వార్థము సిద్ధింపకున్న వాఁడెంత మంచివాఁడైనను వానివైపు చూడనే చూఁడడు. సాంసారిక ప్రీతి స్వార్థ మూలము.

శుకుఁడిట్లనెను :- "రాజా! పరాజితులైన తర్వాత మరల తమ రాజ్యమును దాము సంపాదించుకొనుటకు- తమ స్వార్థసిద్ధి కొఱకు- బ్రహ్మను శరణుజొచ్చిరి. బ్రహ్మ వారిని చీవాట్లుపెట్టి యిట్లనెను ;- "మీరు అక్షమ్యమగు నపరాధము నొనర్చితిరి."

దేవతలిట్లనిరి:- స్వామీ! ఇప్పటికైనదేమో అయినదిఇప్పుడు చేయవలసిన ఉపాయమును జెప్పుఁడు."

అంతబ్రహ్మ యిట్లనెను :- "మంత్రదాతయగు పురోహితుఁడు గురువులేక యే కార్యమును సిద్ధింపదు. ఇప్పుడు మీరు గురువిహీనులరైతిరి. కావున మీ విజయము చాల కష్టము. మీకు విజయము కావలసియుండిన మీ గురువును బ్రసన్నము కావించుకొనుఁడు.''

దేవతలిట్లనిరి :- ''స్వామీ! మాకు గురుదేవుఁడు కనఁబడినచో మే మనునయ వినయములను గావించి, కాళ్ళమీఁద బడి ఒప్పింపఁగలము కాని ఆతఁడదృశ్యుఁడైనాఁడు. ఆతఁడు శీఘ్రముగఁ బ్రత్యక్షమగునను నమ్మకమును లేదు ఏలయనఁగా మేమాతని కట్టి యపరాధమొనర్చితిమి పోఁగొట్టుకొనిన రాజ్యమును మరల సంపాదించుకొనుట కేదైన మరియొక యుపాయమును జెప్పుడు."

ఇది విని బ్రహ్మ యిట్లనెను :- మీ గురువు ప్రసన్నుఁడై వచ్చువఱకు యోగ్యుడును, దపస్వియుఁ బ్రహ్మజ్ఞానియునగు బ్రాహ్మణుని మీకుఁ గురువుగ జేసికొనుఁడు ఆతఁడు మీకు

విధ్యుక్తముగ యజ్ఞయాగాది ధర్మకార్యములొనర్పఁజేసి రాజ్యమును బ్రాప్తింపఁజేయఁ గలిగియుండవలెను."

దేవతలు జిజ్ఞాసతోడను, ఉత్కంఠతతోడ నిట్లనెను :- "స్వామీ! మేము స్థానాపన్నగురువు నేర్పాటుచేసికొనుట కెవరైన యోగ్యుఁడగు వ్యక్తియుండినఁ జెప్పుఁడు."

ఇది విని కొంచెముసేపాలోచించి బ్రహ్మ యిట్లనెను :- "మీరందఱును గశ్యప సంతానమే. ఆ కశ్యపుని కుమారుఁడగు త్వష్ట ఋషి. ఆ త్వష్టకు తేజస్వియు, తపస్వియు, బ్రహ్మ జ్ఞానియు నగు బుత్రుఁడు కలఁడు. అతనిపేరు విశ్వరూపుఁడు మీ గురుని వ్యవహారమంతయును బాగుగా నెఱవేర్పఁగల యోగ్యుఁడు. అదియునుగాక మీ కాతఁడు దాయాది, అన్న కుమారుఁడు. జ్ఞానవృద్ధుఁడగుటచే నాతఁడు మీకు బూజనీయుఁడు కావచ్చును. ఆతనికడకుఁబొందు ఆతఁడు దీని నంగీకరించెనా అదృష్టవంతులే. ఆతఁడు పోయిన రాజ్యము నిప్పింపఁ గలఁడు కాని అతనిలో నొక లోపమున్నది."

దేవతలదరివడి యిట్లడిగిరి :- "స్వామీ! ఏమిటది? తర్వాత చిక్కురాకుండుటకు అది యేమియో చెప్పుడు."

బ్రహ్మ గంభీరతతో నిట్లనెను :- అదేమనఁగా ఆతని తల్లి త్వష్టముని భార్య అసురవంశమునకు సంబంధించినది. మాతృ స్నేహమున లోలోన మి శత్రువులగు అసురుల పక్షము వహింప వచ్చును. అయినను నీ ప్రసంగమును బోనీయుఁడు. ముదర నీయఁబోకుఁడు అసురపక్షపాత పూర్ణమగు కర్మలున్న వీకైనంత వఱకు సహింపవలయును."

ఇది విని యింద్రుఁ డిట్లనెను - "ఏమియును ఫరవాలేదు. అసురవంశములోని తల్లియగుటచే నేమైనది. నా భార్య శచీదేవియు నసురవంశములోనిదే. పులోమజ యగుటచేతనే పౌలోమియను పేరువచ్చెను. ఆడపిల్ల పెండ్లియైన తర్వాత నత్తవారింటి గోత్రముగ మారును. ఇందులో మా స్వార్థమున్నది- మా పని నెరవేరవలయును. విశ్వరూపుఁడేమైనఁ జేసిన నది తర్వాతఁ జూచుకొనవచ్చును." అని యిట్లాలోచించుకొని బ్రహ్మతో నిట్లనెను - "మంచిది, మీయాజ్ఞను శిరసావహించెదము. మేము త్వష్ట తనయుఁడగు విశ్వరూపుని సమీపమునకుఁ బోయి ఆతఁడంగీకరించుచో విశ్వరూపుని గురువుగాఁ జేసికొందుము."

శుకుఁడిట్లనెను - రాజా! ఇట్లుపలికి ఇంద్రుఁడు సమస్త దేవతలను వెంటబెట్టుకొని లోకపితామహుఁడగు బ్రహ్మకు నమస్కరించి, ప్రదక్షిణమిడి విశ్వరూపుని ఆశ్రమమునకుఁ బోయిరి. బ్రహ్మయొక్క ఆశ్వాసనముచే వారిచింతలుడిగెను. హృదయమున విజయాశ జనించెను. వారందరు నానందముతోఁ ద్వష్ట దనయుఁడును బరమతేజస్వియునగు విశ్వరూపుని ఆశ్రమమునకు వచ్చిరి.

ఆశ్రమము బ్రాహ్మీసంపత్తిచే దేదీప్యమానముగ నుండెను. అగ్నిహోత్రశాలలో నపరాగ్నివలె వెలుఁగుచు గూర్చుండిన విశ్వరూపుఁడు పూజాపాఠాదు లొనర్చుకొనుచుండెను. హఠాత్తుగఁ దన యాశ్రమమునకు దేవతలు వచ్చుటనుగాంచి ఆతఁడు నిలుచుండెను ఆతఁడింద్రాదిదేవతల పాదములమీఁదఁ బడునంతలో నింద్రుఁడు

గబగబ ముందుకువెళ్ళి గట్టిగాఁ గౌఁగలించుకొనెను. ఆతనికి తన స్వార్థము నెఱవేరవలసియుండుటచే నేఁడాతని యెడల నత్యధిక ప్రేమను బ్రదర్శించుచుండెను. మిగిలిన దేవతలును విశ్వరూపునిఁ గౌగలించుకొనిరి. విశ్వరూపుఁడు గబగబ అందఱును గూర్చుండుట కాసనము నొసగెను. అందరును సుఖముగఁ గూర్చుండిన తర్వాత విశ్వరూపుఁ డందరకును బాద్యార్ఘ్య ఆచమనాది షోడశోపచార ములతోడను, ఫలపుష్పాదులతోడను బూజించెను. విశ్వరూపుని పూజలను స్వీకరించిన తర్వాత దేవతలాతని కుశలము నడిగి తమకుఁ దామే యిట్లనిరి – "మహానుభావా! విశ్వరూపా! మేము నీ యాశ్రమమునకు అతిథులమై వచ్చితిమి."

విశ్వరూపుఁడు చేతులు జోడించుకొని, కృతజ్ఞతను బ్రకటించుచు నిట్లనెను – "పరమ పూజనీయులగు దేవతలారా! గొప్ప గొప్ప యజ్ఞములలో నెంతో భక్తిశ్రద్ధలతోఁ బిలచిననే గాని రాని మీ రెప్పుడు మా యాశ్రమమునకు స్వయముగనే వచ్చితిరి. ఇది నా యదృష్టము. ఇంతకుమించిన ఆనందకరమగు విషయమింకొకటి యేమియుండును. మీరు నన్ను గొప్పగ ననుగ్రహించితిరి."

శీఘ్రముగ నింద్రుఁడిట్లనెను – "అనుగ్రహమును లేదు. నిగ్రహమును లేదు. మే మొక ప్రయోజనముకొఱకు ముఖ్యమైన పనియుండి నీ దగ్గరకు వచ్చితిమి. ఆ పనిని నెరవేర్చెదమనినచోఁ జెప్పెదము. మేము నీకు మాననీయులమే, అయినను నీ కడకు అతిథులమై వచ్చియుంటిమి. మా పనిని నీవు చేసితీరవలెను. మేమీ

కందమూల, ఫల, ధూప, దీప, నైవేద్యాదులచే సంతుష్టిఁ జెందము నేఁడు నీవు మా పనిని సమయోచితముగ నెఱవేర్చవలయును.''

వినయముతో విశ్వరూపుఁ డిట్లనెను - "స్వామీ! మీరిట్లు మాటలాడుచున్నారేమి? మీరందఱును నాకు బాబాయిలు తండ్రులు. తండ్రివలెఁ బూజనీయులు. మీరు నన్నాజ్ఞాపింపుడు నేనేమి ప్రియ కార్యమొనర్పవలయును.''

శుకుఁడిట్లనెను - ''రాజా! విశ్వరూపుఁడు తమయెడల వినయముగను, అనుకూలుఁడుగను నుండుటనుగాంచి దేవతలందర తరపున నింద్రుఁడు తమ ప్రస్తావనను బయటఁబెట్ట నుద్యుక్తుఁ డయ్యెను.''

## పౌరోహిత్యమందలి విశ్వరూపుని అనిచ్ఛ

శ్లో॥ అకించనానాం హి ధనం శిలోఞ్ఛనమ్
తేనేహ నిర్వర్తిత సాధుసత్క్రియః।
కథం విగర్హ్యం ను కరోమ్యధీశ్వరాః
పౌరోధసం హృష్యతి యేన దుర్మతిః॥

శ్రీ భాగ. ౬ స్కం. ౭ అ. ౩౬ శ్లో।

సీ. అరయ నకించనులైనట్టి వారికిఁ దగు శిలోంఛనవృత్తి ధనముసుమ్ము
దానిచే నిర్వర్తిత ప్రియ సాధు సత్క్రియ గలవారలై ప్రీతినొంది
రది గాన సద్గృహిలాచారమైన యాచార్యత్వమిపుడు మీశాసనమునఁ
గైగొంటి గురువుల కామంబు ప్రాణార్థవంచనములు లేక వడినొనర్తు ॥

శ్రీ మదాంధ్ర భాగవతము

ఒక్కొక్కప్పుడు గురుజనములవలన మన మప్రియ కార్యములనుగూడ వివశులమై చేయవలసివచ్చును. పెద్దల కడకు చిన్నలు వెళ్ళుచుండవలయును. దీనికి విపరీతముగఁ బెద్దలే చిన్నవారికడకు స్వయముగఁ బోయినచో దీనిలో నేదో కిటుకు కలదనియు, మన కిష్టములేని కార్యము దేనినో మనచేఁ జేయించుటకు వచ్చినారని తెలుసుకొనవలెను. వచ్చి, వారధికారముతో మనలను బలవంత పెట్టుచో నప్పుడు కాదనుటకు వీలే యుండదు. అప్పుడు మనము చేతులను జోడించి శిరసావహింపవలసి యుండును. "తమ చిత్త మనుటకంటె నిఁక గత్యంతరముండనే యుండదు."

శుక మహర్షి యిట్లనెను- "రాజా! విశ్వరూపుని ఆశ్రమము నకు వెళ్ళి, ఆతనివలన సత్కృతుఁడై సమస్త దేవతల పక్షమున దేవేంద్రుఁడాతనితో నిట్లనెను - "విశ్వరూపా! పుత్రుల ధర్మము పితకును, భిత్రృవ్యులకును సముచితసేవా శుశ్రూషలొనర్చుటయే,

పుత్రుఁడు తాను బుత్రవంతుఁడయ్యు పితాపితృవ్యులకు లఘుభావముతోడనే సేవాశుశ్రూష లొనర్పవలయును. వివాహము కాని బ్రహ్మచారికి ముఖ్యముగ సేవ చేయుటయే ధర్మము. ఇప్పుడు మేము చాలచిక్కులోఁబడితిమి. అందుకొఱకే మేమతిథులమై నీకడకు వచ్చితిమి. మంత్రదాతయగు నాచార్యుఁడు స్వయముగ వేదమూర్తి యని శాస్త్రకారులు చెప్పియున్నారు. వేదోపదేశము నొనర్చి మన యజ్ఞానాంధకారమును బోఁగొట్టినవాఁడు జ్ఞానావతారమే. నరరూపనున్న హరియే. బ్రహ్మకార్యము సృష్టించుట. గావునఁ బుత్రీపుత్రకులకు తండ్రి స్వయముగ సాక్షాత్తుగ స్వయంభూ స్వరూపుఁడే. తండ్రిని బ్రహ్మవలె సన్మాన సత్కారములొనర్పవలయును. పెద్దన్నను మరుత్పతియగు నింద్రునిఁగాఁ జెప్పినారు. పృథివి తనవలనఁ బుట్టిన సమస్త చరాచర జీవులను స్వార్థరహితముగ, అడుగకయే దంభరహితముగఁ గష్టమును సహించి పాలించుచుండును. అదేవిధముగఁ దల్లియు సంతానమును బాలించుచుండును. భూమిమీఁద మలమూత్రత్యాగ మొనర్చినను, త్రవ్వికూపము లేర్పాటుచేసినను, గుంటలు పెట్టినను, దున్నినను, ఆమె కోపింపదు సరిగదా మనకు హితమే యొనర్చును. కావునఁ దల్లి భూదేవి యొక్క స్వరూపమని చెప్పఁబడినది. లోకములోఁ దోబుట్టువులు లేనివారభాగ్యులు. సోదరి తన సోదరునెంతో ప్రేమించును. అన్నకన్నము పెట్టునపుడు తోఁబుట్టువు శరీరము పులకరించును. ఆమె హృదయము ప్రేమతో నిండిపోవును. అందువలనఁ దోఁబుట్టువును మూర్తిమంతమగు దయగాఁ జెప్పిరి. దయను బ్రత్యక్ష

ముగఁ జూడవలయుననిన స్నేహమయయగు సోదరినిఁ జూడవలెను. శ్రావణమాసములోఁ జెల్లెలికిగాని, అక్కకుగాని, చీరెలు సారెలొసంగినవారును, యమద్వితీయ (కార్తీక శుద్ధ విదియ) నాఁడు సోదరునకు తన చేతిమీఁదుగా నన్నమిడి గుడ్డలుపెట్టి పంపిన సోదరియు లోకములో నదృష్టవంతులు. ఏలయనఁగా లోకములో దయయే హృదయమును గరిగించు వస్తువు. ఆ దయ సోదరియందే దృష్టి గోచరమగుచున్నది. చాలమంది తోఁబుట్టువులు తమ యైశ్వర్యమదమున దరిద్రసోదరులను మఱచుచుందురు. వారు తోఁబుట్టువులేకాని గ్రహగ్రహీతలు. వారిని ఐశ్వర్యమదమను గ్రహమావేశించినది.

అభ్యాగతుఁ డగ్నిస్వరూపుఁడనియు, అతిథి సాక్షాత్తుగ ధర్మమూర్తియనియుఁ జెప్పఁబడినది. సాధారణముగ యాచించుటకు వచ్చువా రభ్యాగతులు. నిశ్చిత తిధిలేక వచ్చువాఁడతిథి. ఆతఁడు పరిచితుఁడైనను అతిథినిఁ దిరస్కరించినచో ధర్మమును దిరస్కరించినట్లే కాఁగలదు. అతిథి నెంత శ్రద్ధగా బూజించిన సర్వశ్రేష్ఠమగు ధర్మమును సంపాదించినట్లే కాఁగలదు. అన్ని జీవులతో నొక్కటే ఆత్మకలదు. కావున ధార్మికులైనవారికి అర్హులైన అతిథులు తమకడకు వచ్చుచో యథాశక్తిగ వారి కోరికలను దీర్చుట ప్రధాన కర్తవ్యమైయున్నది.

విశ్వరూపుఁ డిట్లనెను :- "స్వామీ! మీరు సమస్త దేవతలకు నధిపతులు. నాకు బోజనీయులు. మీకేమి ప్రియకార్యమొనర్పవలయునో నా కాజ్ఞాపింపుఁడు."

అంత దేవేంద్రుఁడిట్లనెను- "విప్రవరా; మీరుండియు మేము ఈ విధముగ శత్రుతిరస్కృతులమై గృహములనుత్యజించి తిరుగుట సిగ్గుచేటుగనున్నది. మీయీతపస్సు, తేజము, వేదాధ్యయనము మొదలగు శుభకార్యములు దేనికి పనికివచ్చును. మీరు బ్రహ్మ నిష్ఠులరు కావున మాకుగురువుకండు. మీ తేజః ప్రభావముచే మా శత్రువులగు నసురులను జయించుటకై మేము మిమ్ము నుపాధ్యా యునిగాఁ జేసికొనఁ దలఁచుచున్నాము."

ఇది విని విశ్వరూపుఁడు మిక్కిలి నమ్రతతో నిట్లనెను :- "దేవతలారా! మీరు తలక్రిందులు చేయుచున్నారు. మీరందఱును నాకు గురువులు. మీకు నేనెట్లు గురువును గాఁగలను? నేను మీ పిల్లవాడను. నేనాచార్యపీఠమధిష్ఠించుచో మీ రందఱును నాకుఁ బ్రణామమును గావించెదరు. ఇది అనుచితము కాఁగలదు."

అంత దేవతలిట్లనిరి :- "అట్లుకాదు. తమ ప్రయోజనము నెఱవేరునప్పుడు తనకంటెఁ జిన్నవారికి నమస్కరించుట నిందింపఁ బడదు. కార్యసిద్ధియొక్క విశేషావసరమును బట్టి సమస్తకార్య ములు నెఱవేర్చవలసియుండును. అదియునుగాక బ్రాహ్మణులలో జ్యేష్ఠత్వము వేదజ్ఞాన కారణమునఁ గలుగును. ఎవ్వఁడు గొప్ప జ్ఞానియో వాఁడే జ్యేష్ఠుఁడు. కేవలము వయో జ్యేష్ఠత్వమును బ్రాహ్మణులలోఁ జూడఁబడదు. ఈ విషయములో మీకు మేమొక వైదిక గాథనుజెప్పెదము వినుఁడు. ఒక గొప్ప విద్వాంసుఁడగు

ద్యువేక ముని యుండెను. ఆతఁడు సర్వశాస్త్రపారంగతుఁడు. ఆతనికడఁ జదువుకొనుటకు ఆతని తండ్రి, తాత పితృవ్యులు ఇంకను జాలమంది వృద్ధమునులు వచ్చుచుండెడివారు. ఆతఁడంద ఱను వత్సా! అని సంబోధించెడువాఁడు. అప్పుడు వారికి పితృ పితామహులను 'వత్సా' యని పిలుచుటేమిటను శంక కలిగెను. అప్పుడు ఋషులు జ్ఞానియే అందఱకంటె జ్యేష్ఠుఁడనియు, వాని కడకు జదువుకొనుటకు వచ్చువారి నందఱను వారెంత పెద్దవారై నను జిన్నవారే ననియు, జ్ఞానవృద్ధుఁడే నిజమగు వృద్ధుడనియు సిద్ధాంత మొనర్చిరి. కావున తమరు మా కుపాధ్యాయులుగనుండుట కంగీకరింపుఁడు. మమ్మీ ఘోరసంకటమునుండి మీ తపోబలమున నుద్ధరింపుడు."

శుకుఁడిట్లనెను :- "రాజా! దేవతల యీ ప్రార్థనమును విని విశ్వరూపుఁడు లోలోన మిక్కిలి యానందమును జెందియు, స్థూణానిఖనన న్యాయమున దీనిని బుష్టికావించుటకును, దేవతల కుత్సాహము నినుమడింపఁ జేయుటకును నిట్లనెను :- "పౌరోహిత్య కర్మ చాల నీచమైనది. ఇందులో యజమానుని పాపములన్నిటిని పురోహితుఁడు గ్రహింపవలసి యుండును. దానమొసంగునప్పుడు ఈజన్మమందును నన్యజన్మలందునను జేసిన పాపములీదానమున శాంతించుఁగాక" యని చెప్పబడును. ఈ పాపములెచ్చటకుఁ బోవును? దానగ్రహీతుఁడగు బురోహితునకుఁ బోవును. ఇట్టి దృష్టాంతములు చాల కలవు. ఒకానొక పురోహితుఁడు తన యజ

మాని హితము కొఱకు ఆతని పుత్రుని రాణివడలోనుండి తీసికొని హవనము కావించెను. రాజునకు మేలే కలిగెను; కాని నరకమందు వజ్రతుండములను జీవులు ఆతనినిఁ దమ దీర్ఘతీక్ష్ణములగు ముక్కులతోఁ బొడుచుచుండుటను రాజు కాంచెను. కావున దేవతలారా! మీరింత తెలిసినవారయ్యును నాచే నీచకర్మలనేల చేయించెదరు."

దేవతలిట్లనిరి :- బ్రాహ్మణులందఱు నిట్లనుకొనిన నీ కార్యమును జేయునదెవరు? బ్రాహ్మణులకు జీవనమెట్లు జరుగఁ గలదు? దానములను గ్రహించి జీవనమును జరుపుకొనుటయే బ్రాహ్మణవృత్తిగ నేర్పఱుపఁబడినది. దానములను గ్రహింపకున్న బ్రాహ్మణులకు ధనమెచ్చటనుండి రాఁగలదు? ధనము లేకున్న గృహస్తకార్యములెట్లు నడచును?

ఇది విని విశ్వరూపుఁ డిట్లనెను :- "దేవతలారా! మీరింతటి ధర్మాత్ములకు సత్వగుణులయ్యును నిట్లు మాటలాడు చున్నారు. నిష్కించనులగు బ్రాహ్మణులకుఁ బవిత్రమును, ముఖ్యజీవికయగు వృత్తి కపోతవృత్తి. కపోతమువలెఁ జేలలోని పరిగె మొదలగు గింజల నేరుకొని వచ్చుటయు, దంపుడుచోట పడిన గింజలనేరుకొనుటయు బ్రాహ్మణులకు బ్రధాన వృత్తి. అట్టి పవిత్రాన్నముచే దేవర్షి పితృదేవతలకును అతిథులకును సత్కారముగావించి గృహస్థోచిత కర్మల నొనర్చవలయును. లోభులు, దుర్మతులు, సుస్వాదు, స్నేహయుక్తములగు మధుర పదార్థములను దినఁదలఁచినవారు పురోహితవృత్తి నవలంబించెదరు. వారికి పదియిండ్లు

పౌరోహిత్యము దొఱకెనా మిక్కిలి యానందమునుజెంది యుబ్బి పోయెదరు. ఫలానివాఁడు మాకాశ్రయుఁడు, ఫలానివానికి మేము పురోహితులమని గర్వముతోఁ జెప్పుకొనుచుందురు. దేవతలారా! మీరిట్టి ప్రస్తావమును నాకడ నెత్తకుఁడు. నన్ను మీ పిల్లవాడను కొని క్షమింపుఁడు. ఇప్పుడు నేను శాస్త్ర సిద్ధాంతమును జెప్పితిని. దీనివలన మీరు కోపపడకుఁడు. మీ యాజ్ఞ నుల్లంఘించితినను కొనకుఁడు. చిన్నవాఁడగుట గొప్ప అపరాధము. చిన్నవారు పెద్దవారివద్ద నణఁగిపోవలసియుండును. పెద్దవారి ఆజ్ఞలను, ఉచితముకానిండు, అనుచితముకానిండు. వానిని జిన్నవారు శిరసావహింపవలసినదే తర్వాత మీ రెట్లుచెప్పిన నట్లు చేసెదను."

దీనివలన దేవతలకు ఆశకలిగెను. విశ్వరూపుఁడీ పరమ ప్రతిష్ఠారూపమగు పదవిని సంతోషముతో నంగీకరించెననియు, కేవలము మర్యాద ననుసరించి కాదనుచున్నాఁడనుకొని యిట్లనిరి :- "నీవు మా వాఁడవు. ఉచితమో, అనుచితమో నీవు చేసితీరవలెను నీవు మమ్ములను శత్రువులనుండి రక్షింప సమర్థుడవు."

అంత గంభీరముగ విశ్వరూపుఁ డిట్లనెను :- "పరమ పూజనీయులగు దేవతలారా! నా కిప్పుడు ధర్మసంకటము సంభవించినది. ఒకప్రక్క పౌరోహిత్యము నిషిద్ధకర్మ, ఇంకొకప్రక్క లోకేశ్వరులగు మీరు నా యాశ్రమమునకు వచ్చి నన్నాజ్ఞాపించుట. మీరు చెప్పినది అంగీకరింపకుండుటయు, మీ యాజ్ఞను దిరస్కరించుటయు ఘోరాపరాధములు, నేను మీ పుత్రుఁడను, శిష్యుఁ

డను. గురుజనుల ఆజ్ఞలను ఉచితానుచితములను బాటింపక ఆలస్య మొనర్పక నెఱవేర్చుటయే శిష్యులకు ముఖ్య కర్తవ్యము. సరియే, నేను ఆజ్ఞను బాలించెదను. యథాశక్తిగ సేవయొనర్చెదను. నేను మీ కందఱకు నుపాధ్యాయుఁడనై నా పని నెఱవేర్చెదను."

శుకుఁడిట్లనెను :- రాజా! దేవతలతో నిట్లుపలికి మహాతపస్వి యగు విశ్వరూపుని తమ పురోహితునిఁగా వరింపఁగా నాతఁడు మిక్కిలి ప్రయత్నముతో దేవతలకుఁ బౌరోహిత్యము చేయ సాగెను."

## దేవతా పురోహితుఁడుగ విశ్వరూపుఁడు

శ్లో॥ తేభ్య ఏవం ప్రతిశ్రుత్య విశ్వరూపో మహాతపాః ।
పౌరోహిత్యం వృతశ్చక్రే పరమేణ సమాధినా ॥

శ్రీభాగ. ౬ స్కం. ౭ అ. ౩౮ శ్లో॥

"......ఆ॥ అనుచు విశ్వరూపుఁడనియెడి ముని ప్రతి
జ్ఞోక్తిఁబలికె వారి నూఱడించి
మహితమైన తత్సమాధిచే గురుభావ
మమరఁజేసె దేవసమితి కపుడు॥

శ్రీమదాంధ్ర భాగవతము

పురోహితుఁ డెల్లప్పుడును యజమాని హితమును జూడ వలెను. యజమానికి శ్రీవృద్ధియు, యశోవిస్తారమును, శత్రువిజయమును, ఇహలోక పరలోక సుఖప్రాప్తియుఁ గలుగు కార్యములను దత్పరతతో నవ్యగ్రభావముతోఁ జేయుచుండవలెను. రాజు యొక్క ఉన్నతి, అవనతి అధికాంశము పురోహితునిపై నాధారపడి యుండును. పురోహితుఁడు చెప్పినప్రకారము రాజు కార్యములొనర్చును. శుభమగు సలహాయిగుచో శుభము కలుగును, అశుభమగు సలహాయగుచో నశుభపరిణామము కలుగును. కావునఁ బురోహితుఁడు యోగ్యుఁడగుట రాజునకును, బ్రజలకును శ్రేయస్కరము.

శుకుఁడిట్లనెను :- రాజా! దేవతలకు స్థానాపన్న పురోహితుఁడు విశ్వరూపుఁడుకాగానే దేవతలకు మిక్కిలి హర్షము కలిగెను. మందరాచలమందు గుప్త స్థానమునఁ గూర్చుండి దేవతలిప్పుడేమి చేయవలయునని ఆలోచించుచుండిరి. శతక్రతువగు దేవేంద్రుఁడు తన నూతన గురువగు విశ్వరూపునకుఁ బ్రణామము కావించి యిట్లు డిగెను :- "గురుదేవా! ఇప్పుడేమి చేయవలయునో శెలవిందు. అసురులను జయించునట్లొనర్పుఁడు. పోయిన రాజ్యలక్ష్మిని శత్రువులనుండి మరల యిప్పింపుఁడు. గతించిన యైశ్వర్యమును మరలఁ బొందఁగలుగు జప, తప, మంత్రానుష్ఠానములేమైన నుండిన మాకుచెప్పుఁడు.

ఇది విని విశ్వరూపుఁడు గంభీరముగ నిట్లనెను :- "దేవేంద్రా! నీవు దేనికినిఁ జింతింపకుము నీకుగతించిన రాజ్య

ము, ఐశ్వర్యము మరల నిప్పించెదను. అసురులకడ నాసురీ బలముకలదు. వారాసురీవిద్యచే మిమ్ముల జయింపఁగలరు. నేను మీకు వైష్ణవీవిద్యనొసంగెదను. వైష్ణవీవిద్యముందు ఆసురీవిద్య యేమియును జేయఁజాలదు. మీపై శత్రువులెట్టి అస్త్రశస్త్రములను బ్రయోగించినను మీకవి హానికలుగఁజేయ కుండునట్లు తమకొక కవచము నొసంగెదను.''

దేవేంద్రుఁ డిట్లనెను – "స్వామీ! ఆకవచమే వస్తువుచేఁ జేయఁబడినది? మావద్ద ననేకరకములగు కవచములు కలవు; కాని మంత్రములద్వారా వదలఁబడిన అమోఘ బాణములచే గొప్ప గొప్ప కవచములు వ్యర్థమగుచున్నవి. తమరు నాకెట్టి కవచ మొసంగెదరు."

అంత విశ్వరూపుఁ డిట్లనెను – "అమరాధిపా! నేను నీకు ధాతుమయకవచము నీయను. నీకు నేను మంత్రమయమగు నారాయణ కవచము నొసంగెదను. దానిని ధరించినచో తమకు సమస్త ప్రాణులు నమస్కరించెదరు. తమ రెవరికిని నోడరు. ఈ కవచమును ధరించి మీ రసురులతో యుద్ధ మొనర్చినచో నవశ్యము మీరు పోఁగొట్టుకొనిన రాజ్యలక్ష్మిని శత్రువులనుండి సుఖముగ గ్రహింపఁగలుగుదురు."

అంత మిక్కిలి సంతోషమును బ్రకటించుచు నాకపతి దేవేంద్రుఁడిట్లనెను – ''స్వామీ! ఇప్పుడు తమరే మా కాధారము. తమ కెట్లు ఉచితమని తోఁచిన నట్లు మమ్ముద్ధరింపుఁడు. మమ్ముల మరల స్వర్గసింహాసనమునఁ గూర్చుండఁబెట్టుఁడు.''

శుకుఁడిట్లనెను – "రాజా! ఇంద్రుఁడిట్లు ప్రార్థింపఁగా విశ్వరూపుఁ డాతనికి విధివిధానముననుసరించి సాంగోపాంగముగ నారాయణ కవచము ఉపదేశించెను. దీనినిఁ బొంది వారసురులపైఁ దండెత్తిరి. అసురుల రక్షించుటకు అసురాచార్యుఁడగు శుక్రుఁడు తన విద్యాబలముచే నసురులోడ కుండునట్లు రక్షించుచున్నను వైష్ణవీవిద్యముందు అసురీవిద్య అధికకాలము నిలువఁజాలదుకదా! నారాయణ కవచము ధరించి దేవేంద్రుఁడు యుద్ధమునకుఁబోఁగానే అసురులందరు దమతమ అస్త్రశస్త్రములను రణరంగముననే వదలి పారిపోయిరి. వారు తమకుఁదామే స్వర్గసింహాసనము వదలిపోయిరి. దేవేంద్రునకు విజయము లభించెను. ఆతనిని మరల స్వర్గరాజ్య లక్ష్మివరించెను. విశ్వరూపుని కృపచే నాతఁడసురుల నోడించెను. ఉదారబుద్ధిగలిగిన విశ్వరూపుఁడు తన యజమానుఁడగు ఇంద్రుని మేలుకొఱకు దైత్యసంహారార్థము అత్యంత గుప్తమగు విద్యను ఆతనికొసంగెను."

ఇది విని పరీక్షిన్మహారాజిట్లనెను – "స్వామీ! ఇది గొప్ప చమత్కారపూర్ణమగు విషయము. శుక్రాచార్యునిచే రక్షింపఁబడుచున్న అసురుల అఖండమగు చతురంగబలము నిమిషములో లీలగా దేవేంద్రుఁడు నేవైష్ణవవిద్యచే జయించెనో ఆవిద్య అమోఘమైనది కావచ్చును. ఆ నారాయణ కవచమేది? దానినెట్లు ధరింపవలెను? ఎప్పుడు ధరింపవలెను? దానిని ధరించు విధానమెద్ది? దయచేసి నా ఈ ప్రశ్నలన్నిటికిని ప్రత్యుత్తర మీయవలెను. నా మనస్సుత్తికుతూహలపడుచున్నది."

సూతుఁడిట్లనెను- "మునులారా! పరీక్షిన్మహారాజు నాగురు దేవుఁడగు శుకుని యీవిధముగఁ బ్రశ్నింపఁగా వ్యాసనందనుఁడు, బరమహంసచూడమణియునగు శుకుఁడాతనికి నారాయణ కవచ మును విధ్యుక్తముగఁ జెప్పెను. దానిని విని పరీక్షిన్మహారాజు మిక్కిలి సంతోషమును జెందెను. ఈనారాయణ కవచము మిక్కిలి శక్తిశాలియైనదనియు అమోఘమైనదనియుఁ జెప్పబడినది."

అంత శౌనకుఁడిట్లడిగెను- "మహాభాగా! సూతా! ఆ నారా యణ కవచమును మాకును నుపదేశింపుఁడు, దానిని ధరించు విధా నమును మాకును జెప్పుడు. మేమును దానిని ధరించి మాశత్రువు లను బారఁద్రోలవలయును."

అంత నవ్వుచు సూతుఁడిట్లడిగెను- "తమరు సమదర్శ నులు, అజాతశత్రులు. తమరెవరితోడను విరోధమును బెట్టు కొనరు. తమరేశత్రువులఁ బారద్రోలెదరు?"

అంత గంభీరముగ శౌనకుఁడిట్లనెను- "సూతా! మాకు బాహ్య శత్రువులు లేనిమాట నిజమే; కాని కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరాది షట్శాత్రవులు లోపలగలరు. వీరందరును మహాపరాక్ర మశాలురు. అమిత వేగవంతులు. వీరు మాయంతఃకరణమును క్షోభపెట్టుచున్నారు. మేమందరమును నారాయణకవచమును ధరించి యీశత్రువులను సంహరింపఁ గలుగుచున్నాము, నారాయణ కవచ మును ధరించక యీశత్రువులను జయింపఁ గలుగుదుమా?"

ఇదివిని నవ్వుచు సూతుఁడిట్లనెను- "స్వామీ! భగవత్కథాకీర్తనము నాశ్రయించినవారును, హృదయమందు సదా సర్వదా దానిలోనే ఉండఁగోరువారును, కామక్రోధాది శత్రువులకు లోఁబడరు. ఈనారాయణ కవచమందును నారాయణుఁడగు శ్రీవిష్ణునామములు తప్ప వేరులేవు. ఇది నామసారమే. అందులోనే సమస్తమును గలదు. అంగన్యాసకరన్యాసాదులతోఁ జేయఁదగినది. నేనీ భాగవత కథాప్రసంగమున నీవిద్యనుష్ఠానముగూర్చి వర్ణింపఁదలఁచలేదు. కావున దీనియొక్క విస్తార వర్ణనము ప్రసంగానుసారముగ నింకొక చోటఁ జేయఁబడును. ఈసమయమున నేను తమకు విశ్వరూపుని కథను జెప్పుచున్నాను. తర్వాత తమయిష్టము. చెప్పుమనిన నారాయణ కవచ విధినిగూర్చియే చెప్పెదను."

ఇదివిని శౌనకుఁడిట్లనెను- "వలదు సూతా! మాబలవంతమేమియును లేదు. ముందు నీవు కథనేచెప్పుము. మంత్రానుష్ఠాన ప్రసంగమున దీనినిఁ జెప్పవచ్చును."

శౌనకుఁడిట్లు పలుకఁగా సూతుఁడు విశ్వరూపుఁడెట్లు దేవతాదులతోఁ గపటమున మోసగించినదియుఁ జెప్పుటకుద్యుక్తుఁడయ్యెను.

## దేవేంద్రుండు విశ్వరూపుని జంపుట

శ్లో॥ స ఏవ హి దదౌ భాగం పరోక్షమసురాన్ప్రతి ।
యజమానో వహద్భాగం మాతృస్నేహ వశానుగః ॥
తద్దేవహేలనం తస్య ధర్మాలీకం సురేశ్వరః ।
ఆలక్ష్యతరసా భీతస్తచ్ఛీర్షాణ్యాచ్ఛినద్రుషా ॥
శ్రీభాగ. ౬ స్కం. ౯ అ, ౩౪ శ్లో॥

సీ॥ భూపాల యీవిశ్వరూపున కరుదైన తలలు మూఁడను
వొందఁ గలిగియుండు
సొరిది సురాపాన సోమపానంబులు నన్నాదమనఁగను
నమరవతుల
తోఁగూడి భుజియించి తూకొని వారితో యజ్ఞభాగంబు
ప్రత్యక్షమొంది
కైకొనుచుండి దుష్కర్ముఁడై యా యజ్ఞభాగంబు
రాక్షసప్రవరులకును

ఆ॥ దల్లిమీఁదఁ గలుగు తాత్పర్యవశమున
దివిజవరుల మొఱఁగి తెచ్చియిచ్చు
నది యెఱింగి యింద్రుఁడతి భీతచిత్తుఁడై
తనకుఁగాని యతని తలలు ద్రుంచె॥

శ్రీమదాంధ్రభాగవతము

స్వార్థమునకు వశీభూతులై చేసిన భక్తి, ప్రేమ మొదలగు సంబంధాదులు ఆ స్వార్థము పూర్తియైన తర్వాతను, స్వార్థమున కాఘాతము కనిగినను నశించును. ఒక్కొక్కప్పుడు మనము ధనికులను ప్రేమించుచుందుము ఎందులకు? అప్పుడప్పుడు మనకు ధనముద్వారా సహాయము చేయగలరని అట్లు ప్రేమింతుము. దైవ యోగముచే వానికాధనముపోయి నిర్ధనుఁడైనప్పుడు మన మైత్రి దానితోడనే అంతమగును. లేక మనమేదియో ఆశనుబెట్టుకొని, ఆ యాశ నెఱవేరకున్నను, ఆతఁడు కృపణతావశమున ద్రవ్యమీయ కున్నను జెడును. ఏలయనఁగా నాతఁడు మైత్రిచేసిన దతనితోఁ గాదు, ఆతని ధనముతో ధనము పోయినప్పుడు మైత్రియు సమాప్తి కాఁగలదు. స్వార్థమునకు వశీభూతులైన మానవులు ఘనిష్ఠాతి ఘనిష్ట సంబంధముగల తల్లి, దండ్రి, గురుపత్ని, పుత్ర, మిత్ర, గురువులనైనను జంపుచుందురు. తమ స్వార్థమునకు వ్యాఘాతము సంభవించినచో మనుష్యుఁడేమైనను జేయును.

శుకుఁడిట్లనెను :- "రాజా! త్వష్టతనయుఁడగు విశ్వరూపుఁడు దేవతలకు ధర్మాచార్య పురోహితుఁడయ్యెను. నారాయణ కవచ ప్రభావముచే నాతఁడు దేవతలకు పోయిన రాజ్యమునిప్పించెను. అందువలన నాతనికి దేవతలలోఁ బ్రతిష్ఠ కలిగెను. దేవతలందఱును నాతని నత్యధికముగ సన్మానించుచుండిరి. ఆతఁడు స్వర్గమునఁ బరమ గౌరవ ప్రతిష్ఠితపదము నధిరోహించెను. రాజా! మనము సంబంధించినవాఁ డెవఁడైన నధికారపదవియందుండుచో మనము వానిమీఁద నుచితా నుచితములగు నాశలు పెట్టుకొందుము. ఆతఁడును లజ్జావశమున శీలసంకోచముచే మన మాట నంగీకరింప

వలసి యుండును. తమ పిల్లయొక్క కుమారుఁడు దేవతలకు సర్వస్వమనియు, దేవతలందఱు నాతని కథనులనియు నసురులు తెలిసికొని వారు కుతంత్రములు పన్నుటకారంభించిరి. వారు త్వష్ట మునిదగ్గఱ నుండి విశ్వరూపుని తల్లిని మిక్కిలి ఆదర సత్కార ములతోఁ బిలిపించి మిక్కిలి ఆదరసత్కారములొనర్ప మొదలిడిరి. రాజా! ఏదైన సంబంధముచేఁ గొంచెమాశ యుండెనా మనమును దేవతలవలెఁ బూజింతుము. స్వార్థసిద్ధికి ఆశలేకున్న వానిని జూడఁగానే ముఖమును ముడుచుకొని లోలోన నిట్లనుకొందుము :- "ఏదియో రోజులు గడుపుకొనుచుంటిమి. ఇచ్చట నుండి వెళ్లు టెప్పుడో ఒకటి రెండు దినములుండిన నిఁక వెళ్ళి స్వంతపని చూచుకొనవలయునని చెప్పివేయవచ్చును. ఇట్లూరక కూర్చుండిన నేమిలాభము?"

అసురులు విశ్వరూపుని తల్లికి మిక్కిలిగ స్వాగతసత్కారములొనర్చి యిట్లనిరి :- "అమ్మాయీ! నీ కుమారుఁడు దేవతలకుఁ బురోహితుఁడగుట చాల సంతోషింపవలసిన విషయము; కాని వాని వలన మా కనిష్టము సంభవింపనున్నది. కొంచెము మమ్ములనుగూడ కనిపెట్టియుండవలసినదని నీవు చెప్పవలయును మేనమామలకుగూడ కొంచెము హిత మొనర్పవలయును."

ఇది విని పైతృక స్నేహమునకు వశీభూతయై విశ్వరూపుని తల్లి ఈ విషయము నంగీకరించి, ఆతఁడీసారి వచ్చినపుడాతనితో గట్టిగాఁ జెప్పెదనని మాటయిచ్చెను. అసురుల మనోరథము సిద్ధించెను. కొంతకాలమునకు త్వష్టమునికడకు వారందఱును వచ్చిరి.

ఒక దినమున విశ్వరూపుఁడు దేవగురువుయొక్క పరమ వైభవమగు దివ్యవిమానమునఁ గూర్చుండి, తన తల్లిదండ్రులను దర్శించుటకు వచ్చెను. తమ కుమారుఁడిట్లైశ్వర్యవైభవములతో నుండుటనుగాంచి తల్లిదండ్రులానందమును జెందిరి. పాదములపైఁ బడిన తమ పుత్రుని వారు లేవఁదీసి కౌఁగలించుకొని, శిరమును మూర్కొని అనేకాశీర్వచనముల నొసంగిరి. కుశల క్షేమానంతరము తల్లి అతనికి కొంచెమల్పాహారమును బెట్టుటకు లోనికిఁగొని పోయెను. అల్పాహారమును బెట్టుచు తల్లి యిట్లడిగెను :- "నాయనా! నీ విప్పుడక్కడేమిచేయుచున్నావు.''

విశ్వరూపుఁ డిట్లనెను :- "అమ్మా! నే నచ్చట యజ్ఞము చేయించుచున్నాను. దానిలో దేవతలకు హవిర్భాగము లిప్పించుచున్నాను. దానిని దిని వారు పుష్టిచెందెదరు."

తల్లి యిట్లడిగెను :- "నీ వసురులకు భాగములనిచ్చుట లేదా? విశ్వరూపుఁడదిరిపడి యిట్లనెను :- "లేదమ్మా! అసురులకు నే నెట్లిచ్చెదను. అసురులు దేవతలకు శత్రువులుకదా!."

తల్లి మిక్కిలి ప్రేమతో యిట్లనెను :- "నాయనా! వారు దేవతలకు శత్రువులేమో కాని నీకు శత్రువులు కారు గదా! వీరు నీకు మాతృవంశమువారు. మేనమామలు. దేవతలు నీ తండ్రి వంశమువారు. నీ విద్దరను గనిపెట్టియుండవలెను. తమకు సంబంధించినవారు ఉత్తమపదవియందు ప్రతిష్ఠితులైనచోఁ దమకు మేలుకలుగవలయునని అందఱును గాంక్షించుచుందురు."

నోటిలోముద్ద నోటిలో నుండగాఁనే విశ్వరూపుఁడిట్లనెను :- "అమ్మా! అదిసత్యమే కాని నేనంధర్మమెదుట భాగము లొసంగవల

యును. నేను వారి శత్రువులకుగూడ భాగములొసంగుచున్న సంగతి తెలిసినచో విరోధము సంభవింపఁగలదు. ఇంకను నాపదవి శాశ్వత మైనదికాదు. నేనిప్పుడు స్థానాపన్న దేవగురువును మాత్రమే."

తల్లియిట్లనెను- "అందరయెదుట నొసంగవలసిన అవసమే మున్నది? ఒకపని చేయవలయును. ఉచ్చైశ్వరముతో దేవతలకు నెట్లీయవలయునో అట్లిమ్ము. మధ్యమధ్య నింద్రుని మనస్సటుని టుఁబోయినపుడు మెదలక అసురులకును భాగములీయవలయును."

శుకదేవుఁడిట్లనెను- "రాజా! మంచి చెడ్డలను జెప్పువారును, శుభాశుభ సంస్కారములను గలిగించువారును దల్లులే. పుత్రులకు వారెట్లుచెప్పిన నట్లు చేయుచుందురు. మాతృభక్తిచే విశ్వరూపుఁడీ విషయము నంగీకరించి, తల్లి దండ్రులకు నమస్కరించి. ఆతఁడు స్వర్గముననుఁబోయెను.

ఇప్పుడాతఁడు యజ్ఞభాగము లొసంగుటతో ధూర్తత్వ మైన ర్పసాగెను, యజ్ఞము చేయించునప్పుడు దేవతలకు ఉచ్చైశ్వర్య ముతో విధివిధానము ననుసరించి సత్కారపూర్వకముగ హవిర్భాగము లొసంగుచుండును.

అందరును వినునట్లు "ఇంద్రాయస్వాహా, వరుణయస్వాహా, కుబేరాయస్వాహా" అని పలుకుచుండును. దేవతలేమరుపాటులో నుండఁగాఁ జాటుచాటుగా మెదలకుండ నెమ్మదిగా "ప్రహ్లాదాయ స్వాహా" "బలయే స్వాయానముచయే స్వాహా'' అనుచుండును. పదునైదు దినములిట్లు నడచెను. కాని పాపపుణ్యము లెంతోకాలము దాగవు. తమ పురోహితుఁడు పక్షపాతి యనియు, శత్రుపక్షము

నుండి వచ్చినాఁడేమో ననియు దేవతలు గ్రహించిరి. రహస్యముగఁ గానుకలు బహుమానములు వారినుండి గ్రహించుచున్నాఁడనుకొనిరి. ఏమిచేయవలయునో దేవతలకు తోఁచలేదు. దేవతలలో నందరకును లోలోన నసంతుష్టి వ్యాపించెను. అందరును నూతన పురోహితునకు విరోధులైరి, ఇంద్రుఁడిట్లనుకొనెను- "ఈతని ప్రవర్తన మిట్లే యుండినచో నీదైత్యులబలము వృద్ధిబొంది మన నాశనమునకుఁ గారణము కాఁగలదు." అప్పుడింద్రుఁడు ఈతని ప్రక్కలోని పాము వలె నపాయకరుఁడై దేవగురువుయొక్క ప్రాచీనమర్యాదను బోనాడినాఁడనుకొనెను."

విశ్వరూపుఁడు గొప్ప తపస్వి; కాని కొంచెము దోషము కలదు. ఆతనికి మూఁడు ముఖములు. ముని పుత్రుఁడగుటచే నాతనికొక ముఖము మానసీయముఖము. దానితో నాతఁడన్నాది మానవ భోజ్యపదార్థములను స్వీకరించును. దేవతాగురువగుటచే నాతనికొక ముఖము దేవతలముఖమువలెనుండును. ఆముఖముతో నాతఁడుయజ్ఞములందొసంగబడిన సోమామృతములను బానము చేయుచుండును. అసురుల పక్షమువాఁడగుటచే నాతని ముఖమొకటి అసురులకు వలెనుండెను. దానితో నాతఁడు సురాపానముగూడ చేయుచుండును. ఈ కారణములచే నాతఁడు దేవగురుఁడగుటకు సర్వథా అయోగ్యుఁడు అతఁడిట్టి ధూర్తతను బ్రదర్శింపకుండినచో నేదోవిధముగ దేవతలు సరిబెట్టుకొనెడువారే; కాని ఈతడింటివాసములే లెక్కించుచుండెను. శత్రువుల బలమూ వృద్ధియగుఁ బ్రయత్నము నొనర్చుచుండెను. దీనిని దేవేంద్రుఁడు సహింపఁజాలకపోయెను. అందు

వలన నాతఁడొక దినమునఁ గూర్చుండి ధ్యానము చేసికొనుచుం డఁగా, ఇంద్రుఁడు వెనుకగా మెదలకుండావచ్చి క్రోధోద్రిక్తుఁడై ఆతని శిరస్సులను మూఁడింటిని ఖండించి వైచెను. విశ్వరూపుని శిరస్సులు మొండెమునుండి వేరయ్యెను. ఆమూఁడు తలలనుండి పక్షులుద్భవించెను. సురాపీథ ముఖముచేఁ గలవింక పక్షియు, సోమపీథ ముఖమున కపింజల పక్షియు, అన్నాద శిరమునఁ దిత్తిరి పక్షియు నుద్భవించెను.

శుకదేవుఁడిట్లనెను– "రాజా! ఈవిధముగ స్వార్థవశమున నింద్రుఁడు తన ధర్మాచార్యుఁడగు బురోహితుని హత్యకావించెను. విశ్వరూపుఁడును దన కపట వ్యవహారమునకుఁ దత్కాలమునసే యాథోచిత ఫలమును బొందెను."

## ఇంద్రునకు బ్రహ్మహత్య

శ్లో॥ బ్రహ్మహత్యామంజలినా జగ్రాహ యదపీశ్వరః॥
సంవత్సరాంతే తదఘం భూతానాం స విశుద్ధయే॥
భూమ్యంబుద్రుమయోషిద్భ్యః శ్చతుర్థా వ్యభజద్ధరిః॥

శ్రీ భాగ. ౬ స్కం. ౯ అ. ౬ శ్లో॥

వ. "... ... ... త్రిలోక నాయకుండైనను దానిం దప్పించుకొనంజాలక యంజలి యొగ్గి యమ్మహాదోషంబుఁగైకొని తద్దోషం బొక్క సంవత్సరం బనుభవించి యంతం బాపుకొను

వాఁడై భూజల వృక్ష స్త్రీలం బ్రార్థించి మద్దురితంబు చతుర్విధం బులం బుచ్చి కొనుండు......"

శ్రీ మదాంధ్ర భాగవతము.

పాపమును ధనవంతుఁ డొనర్చిన, నిర్ధనుఁ డొనర్చిన, సమర్థుఁడొనర్చిన, అసమర్థుఁడొనర్చిన, బలవంతుఁడొనర్చిన, బలహీనుఁడొనర్చిన, ఫలము నందఱు ననుభవింపవలసినదే. అసమర్థుఁడును, నసహాయుఁడు తమ దుఃఖముల తా నొక్కఁడే సహించును సమర్థుఁడైనను దప్పించుకొనఁగలిగిన దానుజేసిన పాపపుణ్యముల ననుభవించితీరవలసినదే కాని తన దుఃఖము నితరులకు బంచిబెట్టి భోగించును, తన దుఃఖమునఁ దన యాశ్రితులు దుఃఖించెదరు. కొంత దుఃఖము సహానుభూతివలన తగ్గిపోవును. అందువలననే సంబంధులు రోగియెడల సమవేదనను బ్రకటింప వెళ్లుచుందురు. భార్యా పుత్రులు, సోదరులు, బంధువులు, కుటుంబములోనివారు సేవా సహానుభూతుల ద్వారా దుఃఖము, బాపము బంచుకొనుచుందురు;

శుకమహర్షి యిట్లనెను - "రాజా! ఇంద్రుఁడు తన స్వార్థమునకు వశీభూతుఁడై విశ్వరూపుని జంపెను గాని బ్రహ్మ హత్య తగుల్కొనెను. అసావధానముగఁ గూర్చుండిన వేదజ్ఞుఁడగు బ్రాహ్మణుని వెనుకకుండవచ్చి మెదలకుండఁ జంపివేసెను. నేను నీపైకి వచ్చుచున్నానని బ్రహ్మహత్య యెదుటకువచ్చి వలికెను. ఇంద్రుఁడు దానిని స్వీకరించెను. ఆతఁడంజలిని బంధించి యిట్లనెను - "దేవీ! నేను స్వార్థవశమున బ్రాహ్మణునిఁ జంపితిని. నేనట్లు తప్పనిసరిగ జేయవలసివచ్చినది. నేనట్లుచేయకుండినచో దేవతలందరును మరల శ్రీహీనులై స్వర్గభ్రష్టులు కాఁగలరు.

బ్రహ్మహత్యను నేను జేయలేదనను. నేను బ్రహ్మహత్యనుజేసితిని గావున నా శరీరమున కంటుకొనుము." ఇది వినగానే ఇంద్రుడు సమర్థుడైనను బ్రహ్మహత్య ఆతనికంటుకొనెను."

ఇది విని శౌనకుడిట్లడిగెను – "సూతా! అహంకారము లేనివానికిని, బుద్ధి కర్మయందు లిప్తము కానివానికిని వాడెంతటి హత్యనొనర్చిన పాపము లంటవని వినియున్నాము. ఇంద్రుడు జ్ఞాని, గొప్ప గొప్ప ఋషులతోడ మునులతోడ సత్సంగములో మునిగినవాడు, త్రిలోకాధీశుడు. అట్టివాడు బ్రహ్మహత్యను స్వేచ్ఛగా నేలగ్రహించినాడు ? నేను జంపువాడనుగానని చెప్ప గుణములు గుణములలో ప్రవర్తించును. విశ్వరూపుడు చావ వలసియుండెను. చచ్చినాడు. ఖడ్గమున నాతనికి మృత్యువున్నది గనుక ఖడ్గమున మృత్యువు సంభవించినది."

ఇది విని సూతుడు నవ్వి యిట్లనెను – "మహాభాగా! కేవలము వేదాంత వాక్యములచేతనే యెవ్వడు జ్ఞానికాడు. జ్ఞాన వాక్యముల వల్లించి, పుస్తకములను త్రిప్పిన జ్ఞానమానులు – మిథ్యాజ్ఞానులగుదురు. వారి కంతమున దుర్దశయే కలుగును. మహాభాగా! జ్ఞాని దృష్టిలో జయాపజయములు, సుఖదుఃఖములు, జీవన మృత్యువులు, స్వపరభేదములు మొదలగు ద్వంద్వములుండవు. ఆతడు నిర్ద్వంద్వుడగును. దేవేంద్రుడు తన ప్రయత్నముచే గర్మలొనర్చి స్వర్గైశ్వర్యమును మరల బొందినపుడు, ఆకర్మను స్వీకరించినపుడు బ్రహ్మహత్యనుగూడ స్వీకరింపవలసియుండును మంచిచేసినప్పుడు తాను జేసితిననియు, చెడ్డజేసినప్పుడు ప్రకృతి పక్షమున గుణములలో గుణములు ప్రవర్తించినవి కావున ఫల

మెట్లనుభవించెదననుట మధురమిడిన మాయముచేసి, చేదుపెట్టిన ఛీఛీ యనునట్లుండును. ఈ విషయమున నీ వొక చక్కని దృష్టాంతమును వినుము. దానివలన నీ విషయము నీకు బాగుగా నర్థము కాఁగలదు."

పంచనదప్రదేశమున నొక జ్ఞానమోని యుండెను. ఆతఁడు కొన్ని వేదాంతగ్రంథముల జదివి అద్వైతవాక్యముల బలుకుచుండెడివాఁడు. దీనివలన నాతఁడు జీవన్ముక్తుఁడను కొనుచుండెను. ఆతఁడింటిపనుల నన్నిటినిఁ జేయుచుండెడువాఁడు. మంచిపని జరిగినచో నది తన పురుష ప్రయత్నముచే నెఱవేఱినదని చెప్పును. చెడ్డపని జరిగినచో నిట్లనును - "నేను గర్తనుగాదు భోక్తనుగాదు. నేను కర్మలకు సాక్షీమాత్రుఁడుగ నున్నాను. శుద్ధ బుద్ధుఁడను. నాకును గర్మఫలములకును నేమి సంబంధము ?"

సూతుఁ డిట్లనెను - "మునులారా ! అజ్ఞునకును జెప్పవచ్చును, చదువనివానికిఁ జదువుచెప్పవచ్చును, గాని వాస్తవమున నజ్ఞుఁడైయ్యు దాను గొప్ప జ్ఞానిననుకొను మూర్ఖునకు జ్ఞానలవ దుర్విదగ్ధునకు చదివిన మూర్ఖునకుఁ జెప్పుటకు బ్రహ్మతరము కాదు. భగవంతుఁడనుగ్రహించిన వానికుద్ధారము కలుగును. ఏల యనఁగా నాతఁడు స్వయముగ స్వయంభువుడు కాఁగలఁడు. నిద్రించినవానిని లేపవచ్చునుగాని మేల్కొని నిద్రనటించువానినెట్లు లేపఁగలుగుదురు. ఇట్టివాఁడే జ్ఞానమాని.

ఆతఁడు చక్కని తోఁటను నిర్మించెను. ఆ తోఁటమీఁద నాతని కత్యంతాసక్తి. దానిని వివిధ విధముల నలంకరించుచుండును. దూరదూరములనుండి వివిధ వృక్షములను దెచ్చి

దానిలో నాటుచుండును. సాయంకాలములందు పది పండ్రెండు మందిని దీసికొనిపోయి జ్ఞానచర్చచేయుచుండును. తానాచార్యుఁ డననుకొని బ్రహ్మసత్యమ్ జగన్మిథ్యాది శ్రుతి వాక్యములను జిలుక పలుకులవలెఁ బలుకుచుండును. మునులారా! స్వార్థపరులు ఊసర విల్లికి తోఁబుట్టువులు. వారి స్వార్థమును సాధించుకొనుటకు దాని కనురూపముగ రంగులను మార్చుచుందురు. సమర్థుఁడును బ్రభావ శాలియునగు వ్యక్తినిగాంచి, వాని కుపదేశములనువినవలయునను వ్యసనమున్నట్లును, వారివద్ద నాలుగు గవ్వలు దొరకగలవనియుఁ దోఁచినదో నచ్చట నీ దేవతలు జిజ్ఞాసువులుగ నటించెదరు. ముందుగా నుపదేశములను వినుటకుఁ జేరుదురు, తర్కవితర్కము లొనర్చెదరు. ఎవ్వరైనను గీర్తన మొనర్చుచుండిన నచ్చట భక్తు లగుచుందురు. సంకీర్తనముచేయుఁచు దొర్లుచుండెదరు. భావ సమాధిని నటించుచుందురు, ఇంతకు సారాంశమేమనఁగా నే రూప మున స్వార్థసిద్ధియగునో అట్టి రూపమును ధరించుచుందురు. అట్టి మహాశయునికడకు పది పదునైదుగురు వచ్చి వారినిఁ బొగడు చుందురు. "అబ్బో! మీరు జనకులవంటి విదేహులు. మీరింక జేయ వలసిన దేమున్నది? మీరంతయును లోక సంగ్రహార్థము చేయు చున్నారు." అను నిట్టి స్తోత్రములను వినివిని, యింకను నుబ్బి పోయి తనను దాను జ్ఞానియనుకొనుచుండును.

ఆతఁడొకానొక దినమునఁ దన తోటలోఁ దిరుగుచుండెను. యింతలో నొక ముసలి ఆవు క్రొత్తగాఁ దెప్పించిన ఖరీదుగల మొక్కలను దినివేసెను. ఆ మొక్కల నాతఁడెంతో కష్టపడి ఖరీదుపెట్టి కొని తెచ్చెను. అందువలన దానిని ద్రోలవలయునని

వరువిడెను. అచ్చటనే ఒక కఱ్ఱపడియుండెను. ఆతఁడు క్రోధో ద్రిక్తుఁడై కఱ్ఱనుదీసికొని నాలుగైదుసారులు గట్టిగా బాదెను. గోవు బలహీనమైనదగుటచే దెబ్బలు తగులగానే అచ్చటనేపడి చచ్చి పోయెను. ఇప్పుడు హత్య భయంకరరూపమును దాల్చి ఆతనిపైఁ బడెను.

హత్య తనవైపునకు వచ్చుటగాంచి మిథ్యాజ్ఞాని యిట్లడి గెను - "నీ వెవరవు ? ఏల నాశరీరమున కంటుకొనుచున్నావు?"

హత్య యిట్లనెను - "నేను హత్యను నీ విప్పుడే గోవ ధను గావించితివి. కావున నేను నిన్నుఁ బట్టుకొనుచున్నాను."

ఆతఁడిట్లనెను - "గోవును జంపినది నేనుగాదు, ఈ దండము. దీనినిఁ బట్టుకొనుము."

హత్య యీ మాటను విని దండముకడకుఁ బోయెను. అప్పుడు దండము వినయముగ నిట్లనెను - "నేను జడవస్తువును నేను చేయిలేక యేమియును జేయఁజాలను. నాచేఁ జేయి చేయిం చెను. కావునఁ జేతిని బట్టుకొనుము. ఇది విని హత్య చేతికడకుఁ పోయెను. చేయి యిట్లనెను- "నే నేమియును జేయను. హస్తమున కధిష్ఠాత ఇంద్రుఁడు. ఆతని ప్రేరణ చేతనే చేయి ఆ దాన ప్రదా నాదిక్రియల నొనర్చుచుండును. కావున నాతనిని బట్టుకొనుము. అప్పుడు హత్య ఇంద్రుకడకుఁ బోయెను. ఇంద్రుఁడంతయును విని యిట్లనెను - "మే మేది చేసిన బ్రహ్మయొక్క ఆజ్ఞ ననుస రించి చేయుచుందుము. కావున నీవు బ్రహ్మకడకుఁబొమ్ము."

హత్య బ్రహ్మకడకుఁ బోయెను. అంతయును విని బ్రహ్మ యిట్లనెను - "నేను స్వతంత్రుఁడనుగాను. జనార్దనుడు నన్నెట్లు

ప్రేరేపించిన నట్లు చేయుదును. నీ పాతని శరీరమునకుఁ దగు లొంకానుము.''

హత్య ఇంతదూరము తిరిగి తిరిగి అలసిపోయెను. కాని దానిపని హత్యచేసినవాని శరీరమున కంటుకొనవలయును. అందు వలన నది సొక్కుచు సోలుచు జనార్దనునికడకుఁబోయి యిట్లనెను- "స్వామీ ! నేను మీ శరీరమున కంటుకొందును."

భగవానుఁ డిట్లనెను - "నీవు నా శరీరమున కెందులకంటు కొనెదవు ?" హత్య యిట్లనెను - ''స్వామీ ! గోవును జంపిన వాని శరీరమున కంటుకొనవలయును."

భగవానుఁడు నవ్వి యిట్లనెను - "వహ్వా ! బాగున్నది. చంపినవాఁడొకఁడు, నీ వంటుకొనినదింకొకని శరీరమునకా ? ఆ గోవును జంపినవాని శరీరమునంటుకొనుము."

హత్య యిట్లనెను - ''స్వామీ ! ఆతఁడు తాను గర్తను గాను భోక్తనుగానను చున్నాఁడు ఎటుల ?"

ఇది విని భగవంతుఁడు నవ్వి యిట్లనెను - "ఆహా, ఆతఁ డిట్లనుచున్నాడా ? రమ్ము నా వెంట వెంట.''

ఇంకేమున్నది ? ముందు వృద్ధబ్రాహ్మణ రూపము ధరించి భగవంతుఁడు ముందు వెళ్ళుచుండెను. వెనుక నీలివస్త్రము, భయంకర కరాళముఖము, కఱకు వెంట్రుకలతోఁ జింపిరితలతో హత్య వెళ్ళుచుండెను. ఇద్దరు నాతోటలోఁ బ్రవేశించిరి. ఆ మిథ్యాజ్ఞాని ఇటు నటు దిరుగుచుండెను. కఱ్ఱ పోటు వేసికొనుచు, దగ్గుకొనుచు వృద్ధబ్రాహ్మణుఁడచ్చటికిఁ జేరను, చూడఁగానే యిట్లనెను- ''ఆహా హా ! ఎంత చక్కని తోట దీనిని వేసినవాఁడు ధన్యుఁడు, ఎంత

తెలివిగలవాఁడు, వేసినాఁడోగదా ? ప్రపంచములోనున్న మంచి మంచి వృక్షముల నన్నిటిని దీసికొనివచ్చి దీనిలో వేసినాఁడు. ఇట్టి పుణ్యపురుషుని నెంతగాఁ బ్రశంసించిన తనవి తీరదు.

సూతుఁ డిట్లనెను – "మునులారా ! తనను గూర్చిన ప్రశంస కలకండకంటె కమ్మదనము. పాయసముకంటె స్వాది ష్టము. హలువాకంటె హృద్యముగ నుండును. ఆ మిథ్యాజ్ఞాని వినఁగానే ఆ బ్రాహ్మణుని సమీపమునకు వచ్చెను. అతఁడు వృక్ష ముల విషయము తెలిసినవాఁడనుకొనెను. కళాకోవిదుఁడెవఁడైనఁ దన కళను గూర్చి ముక్తకంఠముతోఁ బ్రశంసించినచోఁ గళాకారు నకు అత్యధిక హార్దికప్రసన్నత కలుగును. కావున నాతఁడు ప్రశంసను వినఁగానే ప్రణామమొనరించి నమ్రతతో సమ్ముఖమున నిలుచుండెను. తన కణ్ణను గట్టిగా నాని భగవంతుఁడు కన్నులను దెరచి యిట్లనెను – "ఈ వనమున కధికారులు మీరేనాయేమి?"

అతఁడు నమ్రత నటించుచు నిట్లనెను – "అయ్యా ! స్వామీ ! ఏమి అధికారిని నేను మీ సేవకుడను."

వృద్ధ బ్రాహ్మణుడు బోసినోటితో నవ్వెను. మిక్కిలి స్నేహముతో నిట్లనెను – "మంచిది, సాధు సాధు మంచి చక్కని తోటను వేసినారు. మీరు దీనిని మీ బుద్ధిచేతనే వేసినారా లేక అనుభవముగల తోటమాలిని అడిగి చేసితిరా ? సాధారణ బుద్ధిని వినియోగించి మానవుఁడింత అందముగ వృక్షములను నాటలేరు."

ఇప్పుడు మిథ్యాజ్ఞానికి తన చాతురిని జూపింపవలసిన అవసరము లభించెను. అతఁడు దృఢతలా స్వరమున నిట్లనెను – "స్వామీ ! ఈ తోటమాలివాండ్రకేమి తెలియును, నేను రాత్రింబ వళ్లు పరిశ్రమచేసి దీనిని వేసితిని."

బ్రాహ్మణుఁడానందము బ్రకటించుచు నిట్లనెను - "అవు నవును మీరు గొప్ప బుద్ధిమంతులుగఁ గనఁబడుచున్నారు. ఈ కమలా వృక్షము లెక్కడనుంచి తెచ్చినారో ?"

అంత మిథ్యాజ్ఞాని యిట్లనెను - "అయ్యా! ఈ కమలా లకు చాల శ్రమ చేయవలసియుండును. మాదీఫలవృక్షపు వేరున కంటు కట్టవలయును. పైకొమ్మ యెండిపోయిన తర్వాత వేఱునుండి అంకురము బయలుదేరును అప్పుడు దానికి కమలాలు కాయవు. మాదీఫలములు కాయును. ఎండకాలములో మట్టినిదీసి వ్రేళ్ళకు బూడిదను బోయకున్నచో బాగుగా ఫలింపవు. నీరు పోయకున్నచోఁ జిన్నచిన్నవి, పుల్లనివి కాయుచుండును. వీనిలో నొకవిధమగు సాలిగూళ్లు పెట్టును. వాటిని దొలిగింపఁకున్నచో నసలు పిందే పుట్టదు. వీనికి చాల శ్రమచేయవలయును. ఈ యంట్లు నాగ పురమునుండి తెప్పింపబడినవి."

బ్రాహ్మణుఁ డిట్లనెను - "అయ్యా, నీవు చాల తెలివిగల వాడఁవు. తోట పెంపకమునందు నీ వందెవేసిన చేయివి. ఈ సపోటా లెచ్చట తెచ్చితివి."

మిథ్యాజ్ఞాని యిట్లనెను :- "స్వామీ! నేను చాల శ్రమచేసి వీనిని కొంత క్రింద ద్రోణపురమునుండి తెప్పించితిని. ఇవి పెద్దవి గను, చాల తియ్యఁగ వుండును, వీనికెల్లప్పుడు జలము కావల యును. నీరుపోయకున్న నివి ఫలింపవు. కొంచెము ముందునకుఁ బోయి బ్రాహ్మణుఁ డిట్లనెను - "ఈ మామిళ్ళు దేశీయమైనవా? అంటుమామిళ్లా ?"

మిథ్యాజ్ఞాని యిట్లనెను - "స్వామీ! నేను వీటిని కాశీ నుండి తెచ్చి నాటితిని. వీనికిని చాల శ్రమచేసితిని. నడుములోతు

భూమినిఁ ద్రవ్వి దానిలోని రాళ్ళు, అప్పల దొలిగించి ప్రాతయెరువును వైచి వీనిని నాటి క్రింద తడియారకుండుటకై కొంచెముగ నిసుకను గూడ పోయవలయును. బుంగకు అడుగున నొక రంధ్రమొనర్చి మొదటిలో బెట్టినచో నెమ్మది నెమ్మదిగ వేరువఱకు నీరందును. సర్వదా చల్లగనుండును. ఇట్లు నేనెంతో చేసితిని."

బ్రాహ్మణుఁడు కొంచెము ముందుకుఁబోయెను. ఆమహాశయుఁడు తనకుఁ దానే ఆవేశమునకి వచ్చి యిట్లనెను- "ఈ యెఱ్ఱ గులాబిని నేను తూర్పునుండి తెప్పించివేసితిని ఈ పసుపుపచ్చని గులాబియు నేనువేసినదే, ఈనీలపుగులాబి ఎచ్చటను దొరకదు. నేను చాల శ్రమచేసి తెప్పించితిని. ఈయడవిమల్లెను నాటినది నేనే. ఈజాజి, ఈసంపెంగ, నేనుతెచ్చినదే. ఇంతలోనే వెళ్లుచు వెళ్లుచు వృద్ధబ్రాహ్మణుఁడు గోవుచచ్చిన స్థలమువద్దకుఁ బోయెను. బ్రాహ్మణుఁడు ముసలితనములోవచ్చు సరళస్వరములో నిట్లనెను- "ఈ గోవును జంపినదెవరు?"

ఇది విని మిథ్యాజ్ఞాని యిట్లనను- "స్వామీ! గోవును జంపినది దాని ప్రారబ్ధమ "గుణాగుణేషు వర్తంతే."

ఇదివిని బ్రాహ్మణుఁడుచ్చైస్స్వరమున నవ్వుచు నిట్లనెను- "మొక్కలు వేసినది నీవు, గులాబులను దెప్పించినది నీవు. మామిళ్లు నాటినది నీవు, గోవునుంజపినది నేనా? తీపి తీపి మామిడికాయలను నీవు మ్రింగెదవా? గోహత్యను నాదగ్గరకుఁ బంపెదవా" అని పలికి భగవానుఁడు గోహత్యతో నిట్లనెను- "హత్యా! నీవు వీని శరీరమునకు దగుల్కొనుము."

---

సూతుడిట్లనెను- ''మునులారా! భగవదాజ్ఞకాఁగానే హత్య వాని శరీరమునకంటుకొనెను." కావున ఋషులారా! శుభకర్మలకు కర్తయు నుభోక్తయు నెవఁడో, ఆతఁడొనర్చినసశుభ కర్మలకును ఫలము ననుభవింపవలసియుండును. ఇంద్రుఁడొక సంవత్సరము వరకు బ్రహ్మహత్యను ధరించెను."

అంత శౌనకుఁడిట్లడిగెను- "సూతా! తర్వాత నేమైనది? దేవేంద్రుని బ్రహ్మహత్య యెట్లు వదిలినది."

ఇది విని సూతుఁడిట్లనెను- "మహాభాగా! ఇంద్రుఁడు బ్రహ్మహత్య నేవిధముగ వదలించుకొనెనో ఆకథను నేను నీకుఁ జెప్పెదను. మీరందఱును దత్తచిత్తులరై వినుడు."

## ఇంద్రుని బ్రహ్మహత్యను బంచుట

శ్లో॥ భూమిస్తురీయం జగ్రాహ ఖాతపూరవరేణ వై।
తుర్యచ్ఛేదవిరోహేణ వరేణ జగృహుర్ద్రుమాః॥
శశ్వత్కామవరేణాం హస్తురీయంజగృహుః స్త్రియః।
ద్రవ్యభూయోవ రేణాపస్తురీయం జగృహుర్మలమ్॥

శ్రీ భాగ. ౬ స్కం. ౯ అ. ౮. ౯ శ్లో॥

వ........భూమి తనయందుఁ జేయంబడిన ఖాతంబు తనంతన పూఁడునట్టి వరంబును, జలంబు సర్వంబు దనయందుఁ బ్రక్షాళితంబైనం బావనంబగునట్టి వరంబును, వృక్షంబులు ఛేదింపంబడి పునః ప్రరోహంబు గలుగు వరంబును స్త్రీలెల్లప్పుడుం

దమకుఁ గామసుఖంబు గలుగునట్టి వరంబును గోరిన నతండట్లకానా సంగిన నతని దుష్కృతంబు దరిణియిరిణవిధంబునను నుదకంబు బుద్బుదఫేన రూపంబునను మహీరుహంబులు నిర్యాసభావంబునను నింతులు రజోవికారంబునను నిట్లు చతుర్భాగంబులం బంచికొని రంత. శ్రీమదాంధ్రభాగవతము.

ప్రపంచములో నన్నిటిలో నన్నియునుండవు. మనకను కూలములగు వస్తువులు ఇతరులందుగలవు. మనకనుకూలముకానివి మనలోఁ గలవు. అందుకనియే ప్రపంచములో నాదాన ప్రధాన ప్రథకలదు. ఆత్మానంద ప్రవేశములో తప్పమిగిలినవానిలోఁ గొంచెముగనో గొప్పగనో వణిగ్వృత్తికలదు. అందఱును వ్యాపారులే. మన యిండ్లలో బియ్యము కలవుగాని, చక్కెర, ఉప్పు, నూనె వస్త్రములును లేవు. అందువలన మనము బియ్యము నమ్మకొని దానికి బదులుగా నితరవస్తువులను గొనుచున్నాము. మనకు పాలు కమ్మని వస్తువైనప్పటికి మనకు ధూమపానము అలవాటుపడినది అందువలన మనము పాలనమ్ముకొని పొగాకును గొనుచున్నాము తాము కష్టపడి యితరులకు దుఃఖములను బోగొట్టి సుఖమును గలిగించుచుండు పరోపకారులు కొందరుందురు ఇతరుల కష్టములను దాము స్వయముగ సహించుచుందురు. స్వేచ్ఛచేఁ గాని పరేచ్ఛచేఁ గాని యెవనికైన నేదైన నొసంగినచో వానికట్టి ఫలము లభించియే తీరును. ఇచ్చినది వ్యర్థముగఁబోదు. దాని ఫలము లభించును. ఇదియును వ్యాపారమే కాని ఉచ్చతమమగు వ్యాపారము.

సూతుఁడిట్లనెను – "మునులారా! దేవరాజగు ఇంద్రుఁడు బ్రహ్మహత్య నెట్లువదలించుకొనెనని అడిగితిరి. ఆ విషయమును

గూర్చి మీకు నేను జెప్పుచున్నాను. బ్రహ్మ హత్యను గైకొని అమరాధిపుఁడగు నింద్రుఁడు ముల్లోకము లందును దిరుగుచుండెను. తన బ్రహ్మ హత్యా పాతక మెట్లైనను దొలగి పోవలయునని ఇంద్రుఁడు కాంక్షించుచుండెను. కాని చేసిన పాపము ననుభవించి తీరవలసినదే. ఇంద్రుఁడు సంవత్సరమువరకు తిరుగుచునేయుండెను. ఒకసారి దేవేంద్రుఁడు ఋషులకడకుఁబోయి దీనుఁడై చేతులు జోడించుకొని యిట్లు ప్రార్థించెను - "మునులారా! నాకు బ్రహ్మహత్య వదలిపోవు నుపాయమేదైన నుండినఁ జెప్పుడు."

అంత ఋషులిట్లనిరి - "దేవేంద్రా! గొప్ప వారియొక్క కీర్తి యెట్లు అజరామరమై యుండునో అట్లే అపకీర్తియును సదా నిలిచియుండును. అట్టివారివలన నేదైనఁ జెడ్డపని జరిగినచో నదియు శాశ్వతముగ నుండును. నీ యీ బ్రహ్మహత్య శాశ్వతముగ వుండును. అయితే, ఒక ఉపాయమున్నది దీని నెవరైన స్వేచ్ఛచే గ్రహించుచో నిది నీశరీరము వదలిపోవును; కాని ఆ తీసికొనినవాని శరీరమున శాశ్వతముగ నిలిచిపోవును."

అంత దుఃఖితుఁడై యింద్రుఁడిట్లనెను- "స్వేచ్ఛచే నా బ్రహ్మహత్య నెవరు గ్రహింపగలరు? ప్రపంచమున దెలిసి తెలిసి శాశ్వతముగ బ్రహ్మహత్యా తాప దుఃఖము నెవరు గైకొందురు?"

అంత మునులిట్లనిరి- "మహేంద్రా! నీవిట్లనకుము. పరుల సుఖముకొఱకు గొప్పగొప్ప తమ ప్రయోజనములను గూడ పరిత్యజించు సత్పురుషులెందరో పరోపకార పారీణులు కలరు. నీవు వెళ్లి ముల్లోకములందు వెదుకుము."

మునుల వాక్యములను విని దేవేంద్రుఁడు త్రిలోకములందు దిరుగుచుండెను. తన బ్రహ్మహత్యను గ్రహింపుఁడని అందఱినడిగెను. కాని తెలిసితెలిసి శాశ్వతముగ బ్రహ్మహత్య నెవరు గ్రహించెదరు? ఇంద్రుఁడు హతాశుఁడై మరలఁ దిరిగివచ్చి ఋషులతో నిట్లనెను- "ఋషులారా! మీరును నన్ను వ్యర్థముగఁ ద్రిప్పించితిరి. ప్రపంచములోఁ దెలిసి తెలిసి బ్రహ్మ హత్యవంటి మహా పాతకము నెవరు గ్రహించెదరు?"

అంత మునులిట్లనిరి- "స్వర్గాధిపా! అమరేశా! పరోపకార పారీణులకు అసంభవమేమియునులేదు. అశక్యమును గాదు. నీ పాపము గొప్పది. దీనిని గ్రహించుటకొక్కరుగ సమర్థులుకారు. వారినిగూర్చి చెప్పెదము. నీవు, బ్రహ్మహత్యను నాలుగు భాగములుగ నొనర్చి వారికి సమానముగఁ బంచుము."

ఇది విని దేవేంద్రుఁ డిట్లనెను- "మహానుభావులారా! పరోపకార పారీణులగు నా నల్గురి పేర్లను జెప్పుఁడు."

అంత వృద్ధుడును ననుభవజ్ఞానమునుగల ముని యిట్లనెను- "అమరాధిపా! లోకములో నెక్కువమంది స్వార్థపరులనుట నిక్కవమే అయినను బరోపకారపారీణులు పెక్కురింకను గలదు. పృథివినిఁ జూడుఁడు. పృథివికి మించిన పరోపకారి లోకమున నెవ్వరున్నారు? ప్రాణుల నందరను బృథివి ఉత్పన్నము కావించును. ఆ పృథివియే ధరించుచున్నది. అమెయే జీవులన్నిటికిని నన్నాదుల నుత్పన్నము కావించుచున్నది. ఈమెమీఁద మలమూత్రత్యాగము గావించినను నేమియు ననదు. త్రవ్వినను, దున్నినను గోపపడదు సరికదా అన్నపానీయముల నధికముగ నొసంగును. పృథివికి పరో

పకారులింకెవరున్నారు? నీవు బ్రహ్మహత్యలో నాల్గవవంతును భూదేవి కొసంగుము ఆమె లోకకల్యాణముకొరకు దానిని స్వీకరింపగలదు."

పృథివి సమీపముననే నిలుచుండి యుండెను. ఇంద్రుఁ డిట్లడిగెను - "భూదేవీ! నా బ్రహ్మహత్యలో నాల్గవవంతును నీవు గైకొందువా?"

అంత నానందమును బ్రకటించుచుఁ భూదేవి యిట్లనెను- "త్రిలోకాధిపతివగు నీవు నిష్పాపుఁడవగుచో లోకమునకు మేలు గలదు. నేను బ్రహ్మహత్యను సహర్షముగ నాపై ధరియింపగలను."

శుకుఁడిట్లనెను.- "రాజా! ఇట్లువలికి భూదేవి బ్రహ్మ హత్యలో నాల్గన భాగమును దాను ధరియించెను. మొదట భూమి సర్వత్ర ఉర్వరగనుండెడిది అప్పటినుండి భూమి అచ్చటచ్చట ఊస రముగనుండెను. అనఁగా జవిటిభూములేర్పడెను. భూమికిచవుడేర్ప డుట. బ్రహ్మహత్యకు గుర్తు కావున నట్టిభూములందు యజ్ఞయాగా దులొనర్పరాదు. భూదేవియొక్క పరోపకారవృత్తికి ఇంద్రుఁడు సంతసించెను: అప్పుడు అతఁడు ప్రసన్నుఁడై పృథివికి వర మొసం గెను- నీమీఁద నెన్నటనైన గుంటపడినచోఁ గాలాంతరమున నది దానికదియే పూడిపోవుఁగాక!"

భూమి ఒక్కభాగమును గ్రహింపఁగా నింక మూఁడు భాగములుండెను.

అంత నింద్రుఁడు మునులతో నిట్లనెను :- "మునులారా! బ్రహ్మహత్యలో నొకభాగము పోయినను నింకను మూఁడు భాగము లున్నవి. వీనినెవరికొసంగెదను?"

అంత నా వృద్ధమునియే యిట్లనెను :- "దేవేంద్రా! భూదేవి వలెనే ఈ వృక్షములును జాల ఉపకార మొనర్చుచుండును. అవి ఎన్నో మంచి మంచి ఫలము లొసంగును. వీనిలో నొక్కటియు నొక్కఫలమునైనను దినవు. ఇతరులకే యొసంగును. చెడ్డ యెరువులను దిని యెంత కమ్మని పుష్పముల నొసంగునో చూడుఁడు. దీనివట్టయు, వ్రేళ్లు, కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పూవులు, పిందెలు, కాయలు, పండ్లు మొదలగునవన్నియు మనకుఁ బనికివచ్చునవే. యెండిపోయిన తర్వాత మానవులకు వంటచెరకుగాఁ బనికివచ్చును. ఇండ్లు కట్టుకొనుటకు, అనేకములగు నస్త్రశస్త్రములను, పాత్రలను జేసికొనవచ్చును. దాని కట్టెలు కాలిన తర్వాత బొగ్గగును. బొగ్గును వంటకుఁ బనికివచ్చును. దానివలన నేర్పడిన బూడిదయు నెరువగును. ఆకులను బశువులు తిని జీవులకు జీవనాధారమగు పాలొసంగును. చచ్చినతర్వాత దీనికట్టెలువర్ణాశ్రములకు దహనమునకుఁ బనికివచ్చును. ఎంతవఱకు జెప్పఁగలను? వృక్షముయొక్క ఒక్కొక్క ఆకు, వేయేల సమస్త ద్రవ్యములు పరోపకారమునకు బనికివచ్చునవియే, వృక్షమునకు మించిన పరోపకారజీవి యింకొకటేమికలదు,ఒక పాతిక భాగము వీనికొసంగుము."

ఇంద్రుఁడు వృక్షములయొక్క అధిష్ఠాతృదేవతలనిట్లడిగెను "ఏమయ్యా! మీరేమందురు? నా బ్రహ్మహత్యను స్వీకరించెదరా?"

వృక్షములిట్లనెను :- "స్వామీ! మేము జడములము. మీరు త్రిలోకాధిపతులు మీ విశుద్ధిచేఁ ద్రిలోకములు విశుద్ధములగును. కావున మాకు ఋషులయొక్కయు మీ యొక్కయు ఆజ్ఞలు పరమ సమ్మతములు."

శుకదేవుఁడిట్లనెను :- "రాజా! వృక్షములిట్లు పలుకఁగా నింద్రుఁడు తన బ్రహ్మహత్యలోఁ బావు భాగమును వృక్షముల కొసంగెను. పూర్వము వృక్షములకు నిర్యాసద్రవము అనఁగా బంకలేదు. ఆ దినమునుండి వృక్షమునకు గోదు పట్టుచుండెను. ఆ గోదే వృక్షములు బ్రహ్మహత్యకు చిహ్నము. కావున బుద్ధిమంతులగువారీ బంకను దినరాదు. ఇఁక నౌషధముల విషయమందుమా అది వేఱు విషయము."

వృక్షములు బ్రహ్మహత్యలోఁ జతుర్థాంశమును గ్రహింపఁగా దేవేంద్రుఁడు మిక్కిలి సంతోషించి యిట్లు వరమునొసంగెను ;- "మీ కొమ్మలను గొట్టినప్పటికిని మరలఁ జిగిరించుఁగాక! ఎవరైనఁ గొట్టివేసినను మీరు మరల వేరునుండి పుట్టుదురుగాక."

శుకదేవుఁడిట్లనెను :- "రాజా! మానవుని కాలు, చేయి నఱికినచో మరలఁ బెరుగదు. పూర్వము వృక్షములస్థితియు నంతియే. నఱికిన మఱలఁ జిగిర్చెడివికావు. కాని దేవేంద్రుఁడు వరమొసంగిన తర్వాత గోయఁబడిన లేక నఱకబడిన కొమ్మలు మరల జిగిర్చుచుండెడివి."

సగము బ్రహ్మహత్య పోయినది. ఇంక మిగిలిన సగము కొఱకు దేవేంద్రుఁడు చింతించుచుండెను. అతఁడు మునుల నిట్లడిగెను ;- "స్వామీ! ఈ సగమునకును స్థానమేమైన నున్నఁజెప్పుఁడు. పరోపకారులును, సేవావృత్తిగలవారునగు వారిని మఱి యిద్దరను జూపింపుఁడు. అంత నా వృద్ధమునియే యిట్లనెను :- "దేవేంద్రా! జలమునకు మించిన పరోపకారులీప్రపంచమున నెవరుండగలరు? జలము జీవములకు జీవమని చెప్పఁబడినది. జీవుఁడన్నము లేకు

న్నను నుండఁగలఁడు గాని జలము లేక జీవనము దుర్లభము. అందఱను బవిత్రమొనర్చునది జలమే. జలమున స్నానమాడిన మానవుఁడు పవిత్రుఁడగును. సృష్టిస్థితులు జలముమీఁదనే ఆధార పడియున్నవి. ఈ పృథివి నౌకవలె జలములమీఁదనే తేలుచున్నది. అన్నిటిని ధరించుటచే భూమికి ధరణి యను పేరు వచ్చినది. అట్టి పృథివిని ధరించు జలము నారాయణుఁడే. కావున నొక పాతిక భాగమును నీవు జలములకీయవచ్చును"

ఇంద్రుఁడు దగ్గఱనే నిలుచుండిన జలాధిష్ఠానదేవునితో నిట్లనెను :- "నీవు నా బ్రహ్మహత్యలోఁ చతుర్థాంశమును గ్రహింపఁ గలవా?"

అంత జలమిట్లనెను- "మహారాజా! నేనత్యంతపవిత్రముగా భావింపఁబడుచున్నాను; కాని పరోపకారముకొఱకు మీ ఆజ్ఞను శిరసావహించెదను."

జలముల అంగీకారమును బొంది దేవేంద్రుఁడు బ్రహ్మహత్యలో నాల్గవభాగమును జలములకొసంగెను. జలములందు ముఖ్యముగ వర్షాకాలములో నుండు జలబుద్బుదములును, నురుగును బ్రహ్మహత్యా స్వరూపములే, కావున జలములను ద్రాగునపుడు బుద్బుదములును, నురుగును లేకుండఁ ద్రాగవలెను.

జలముపైఁ బ్రసన్నుఁడై శచీపతి శతక్రతువిట్లు వరము నొసంగెను :- "నీకు వృద్ధికలుగుఁగాక! పావుశేరు పాలలో మూఁడు పావులు నీటిని జేర్చిన శేరు పాలగును. నీవే వస్తువులోఁ గలిసినను దానిలో గలిసిపోయి నది పెరుగునుగాక! ఇంకను బావినుండి నీటిని తోడినకొలఁది పెరుగుగాక!"

ఇంకను బ్రహ్మహత్యలో నొక పాతిక భాగముండుటచే నింద్రుఁడిట్లనెను :- "ఋషులారా! ఇంకొక పాతిక భాగము పాప మున్నది. పరోపకారులెవరైన నుండినఁ దెల్పుఁడు. అట్టివారు నిరంతరము సేవయందే సంలగ్నమైయుండి, సేవించుటయే జీవిత చరమలక్ష్యముగ నుండవలెను."

దేవేంద్రుని వాక్కులను విని అనుభవముగల వృద్ధముని యిట్లనెను :- "శచీపతీ! పురుషులు స్వార్థపరులు. స్త్రీలకు మించిన పరోపకార పారీణులింకెవరు నుండరు. సమస్త సృష్టియు స్త్రీల కారణముననే జరుగుచున్నది. స్త్రీలులేకున్న ప్రపంచము వృద్ధి చెందనే చెందదు. అందువలననే స్త్రీని లోకమాతయనిరి. అత్యంత స్వార్థపరుడును, రూక్ష స్వభావముకలవాఁడైనను స్త్రీలు సుఖము నొసంగువారని వారినిఁ గోరుచుందురు. ప్రపంచములోఁ గల సుఖములన్నియును కామినీ కమనీయాంగములందున్నవి. స్త్రీ జీవ నము మొదటి నుండి చివరవఱకును పరోపకారమయమే. పుట్టఁ గానే వారు పరోపకారమందే నిమగ్నులగుదురు. కొంగెము పెద్దది కాఁగానే పనులలోఁ దల్లులకు సహాయపడుదురు. తల్లి వంటచేయు నపుడు తన కూఁతురితో నిట్లనును :- "అమ్మాయీ! పట్కారు తీసికొనిరా. తప్పేలను దీసికొనిరా. శాకమును గలియఁ బెట్టుము. మసాలాను నూరుము. కొంచెము పెద్దదైన మీఁదట వంటను దయారుచేయును. చిన్నపిల్లలందఱకును నా పిల్లయే అన్నమును బెట్టును. వడిలోఁ గూర్చుండఁబెట్టుకొని ఆడించును. ఇంటిలోని వారందఱును నామెకే పనులు చెప్పుచుందురు. వృద్ధులువచ్చి యిట్లందురు :- "అమ్మాయీ! మీఅమ్మనడిగి అదితీసికొనిరా, నీరు-

తీసికొనిరా! చేయికడుగు" ఇట్లన్నను మొదలక పనుల నన్నిటినిఁ జేయును. ఈ విధముగ బాల్యమున నామె యింటిలోని వారంద అకును సేవ జేయుచుండును. పెద్దది కాఁగానే ఆమె పుట్టినింటిని వదలిపెట్టును. అప్పుడొక యపరిచితునితోఁ దన సంబంధమును బెట్టుకొనును. ఇంటింటికిని వెళ్ళి సేవద్వారా ఇంటిలోని వారంద అను వశపరచుకొనును. అత్తమామలు. బావలు. మఱఁదులు వీరి పని యంతయును జేయుదురు. తన సర్వసుఖమును, శరీరమును అర్పించి పతి ప్రసన్నతను సంపాదించును. గర్భధారణమొన ర్చును. తొమ్మిది నెలలు బిడ్డను గడుపున బెట్టుకొని తిరుగును. వానికొఱకు ఉప్పు మిరపకాయ మొదలైనవి తినదు. శరీరము వచ్చఁబడును. ప్రాణము విసిగినట్లుండును. తర్వాత సహింపరాని ప్రసవవేదనను సహించి పిల్లను గనును. ఆ పిల్ల ముఖమును జూచుకొని సమస్త బాధలను మఱచును. ప్రాణప్రదముగ దానినిఁ బోషించును. రాత్రింబవళ్ళు దానిచింతలోనే మునిఁగియుండును. దాని మలమూత్రములను శుద్ధమొనర్చును. పిల్లలెల్లప్పుడును మల మూత్ర త్యాగమొనర్చిన తన గుడ్డల నన్నిటిని నపవిత్రమొన ర్చుదురు. ఆమె విసుగుకొనదు. పిల్లను నీ యపరాధమునకు గొట్టదు. దానిని ప్రక్కన బెట్టుకొని పరుండును. నిద్రించునపుడు ఆమె పక్కమీఁద నది మూత్రమును విడిచి తడుపును. ఆ తడి గుడ్డలలోఁ దాను బరుండి పొడిగుడ్డలలోఁ బరుండబెట్టును. ఇట్లు ఒకదానితర్వాత నింకొకటి, దాని తర్వాత మూఁడవపిల్ల ఈ విధ ముగ బిల్లలు పెరుగుచున్నకొలఁది, అందఱను సమాన భావముతో మనస్సులో నే భేదమును లేకయే పోషించును. పెద్దవారుకాఁగానే యింటిలోని ద్రవ్యమును వ్యయపఱచి వారికి వివాహాదులనొనర్చి

సంతోషించును. అన్నవస్త్రముల నేర్పాటు కావించును. ఆమెకు రాత్రింబవళ్ళితరుల చింతయే యుండును. నారీజీవనము పరుల సుఖముకొఱకే స్త్రీ ఊరకే కూర్చుండదు. ఆమె కొంచెమో గొప్పయో యితరుల సుఖముకొఱకు పనినిఁజేయుచునే యుండును. గుడ్డలు కుట్టుటయు, రాట్నమును వడుకుటయు, చెట్లు చేమలను బెంచుటయు మొదలగునవి చిన్న చిన్న కార్యములు మొదలు పెద్ద పెద్ద కార్యములవఱకు చేయుటకువ్విళ్లూరుచుండును. పనులు చేయుటయే ఆమెకు సహజ స్వభావము. కథలోఁ గూర్చుండినను నచ్చుటను భగవంతునికొఱకు పూలు గ్రుచ్చుటయు, హారములను గట్టుటయు, భగవన్నివేదన వస్తువులను శుభ్రమొనర్చుటయు మొదలగు పనులను జేతులతోఁ జేయుచుండును. ప్రేమతో భగవత్కథలను వినుచుండును. స్త్రీ తన జీవితములో నొకే మంత్రమును నేర్చుకొన్నది. అది పరోపకారము. ఈ ప్రపంచము స్త్రీల వలననే సుచారురీతిని నడచుచున్నది. కాకున్న నీ మానవుఁడను జంతువు చాల క్రూరుఁడును, అత్యంత శుష్కప్రకృతికల నీరస ప్రాణియై యున్నాఁడు. వీనిలో సరసతా సంచారము పరోపకారిణి యగు నారియే చేయుచున్నది. స్త్రీలకు పురుషులకంటె సేవా భావము, లజ్జ, సౌందర్యము, సుకుమారత, కోమలత, లావణ్యము, ఆకర్షణ, మధురత, సరసత, మొదలగు సద్గుణము లత్యధికముగ నున్నవి. ఆమెనుగాంచి లక్ష్మీదేవి యీసు జెందును. ఏయింట స్త్రీల కాదరము లేదో ఆయింటఁ జిరకాలము లక్ష్మీదేవి యుండజాలదు. తమ జాతినిఁజూచిన నందఱకును బక్షపాతముండి తీరును. లక్ష్మీదేవి స్త్రీ యగుటచే స్త్రీలయెడల నామెకు సత్యధిక

పక్షపాతము కలదు. అమరేశా! నీవు చూచియే యుందువు. గొప్ప గొప్ప సంపన్నుల యిండ్లలో స్త్రీ లెంతటి యాదరముం డునో, స్త్రీని యడుగక పురుషుఁడేపనియును చేయనేచేయఁడు. ధనికుల యిండ్లలో సాధారణముగా సమస్తములగు తాళపుచేతులు గృహిణివద్దనే యుండును. అందువలననే అచ్చట లక్ష్మి నిలు చును. ఏ దరిద్రుఁడు మాటిమాటికి స్త్రీలను గద్దించి కోపపడుచు, తిట్టుచుఁ గొట్టుచుండునో, ఆమె నాదరింపక పైసపైసకు లెక్క చూచుకొనుచుండునో వానికెన్నటికిని గడుపునిండ నన్నము పుట్టదు. పురుషుఁడింటికి బయట ధనము సంపాదించు స్వామి. స్త్రీ యింటికి స్వామిని యగుటచే నామెకు గృహిణి యను పేరు వచ్చినది. ఆమె తన యింటిని ఆవుపేడతో నలికి లక్ష్మీదేవి నాహ్వానించును. ఏలయనఁగా గోమయమున లక్ష్మి నివాసము చేయుచుండును. లక్ష్మీదేవి యెల్లప్పుడును నలంకారముతో నుండును. ఆమెకు ప్రాతవి, చినిఁగినవి యిష్టముండదు, పురాణ పురుషోత్తముని ప్రియురాలుకదా! అందువలన నామె స్వచ్ఛత్వ మునకు మిక్కిలి యాదరమును జూపించును. ఏ స్త్రీ శరీరమును వస్త్రములను, యింటిని స్వచ్ఛముగ నుంచుకొనునో పురుషుల వలన సత్కృతయై సదా నవ్వుచుండునో అట్టిదానిని లక్ష్మీదేవి స్వీకరిం చును. స్త్రీల నవమానించుట సాక్షాన్నారాయణుని భార్యయగు లక్ష్మీదేవి నవమానించుటయే. ప్రపంచములో స్త్రీలకు మించిన పరోపకార ప్రాణులెవరునుండరు. కావున నీవు బ్రహ్మహత్య దోష మున నాల్గవవంతు పాపమీమెకిమ్ము."

అమరేశుఁడగు శచీపతి స్త్రీమహిమను విని భయపడి, జంకుచు స్త్రీలతో నిట్లనెను – "మీరీ బ్రహ్మహత్యను స్వీకరించెదరా?"

స్త్రీలిట్లనిరి:– "దేవేంద్రా! మాజీవితమితరులకొఱకే. త్రిలోక నాథుఁడవగు నీవలన మాకేదైన నుపకారముండించో దానిని స్వీక రించుటకు మాకేమియు నభ్యంతరము లేదు."

ఇదివిని యింద్రుఁడు తన బ్రహ్మహత్యలోఁ జతుర్థాంశ మును స్త్రీలకొసంగెను. స్త్రీలకు ప్రతిమాసముబహిష్టుకలదే. ఇది బ్రహ్మహత్యాభిచిహ్నమే. అందువలన నా సమయమున రజస్వలా స్త్రీస్నానము చేయరాదు ఇంటిలోని సామగ్రిని దేనినిఁ దాఁకరాదు. ఎవరికినిఁ గనఁబడరాదు. పురుషులును రజస్వలా స్త్రీతో సంప ర్కము కలిగియుండరాదు. వారితో సంపర్క మొనర్చినచో నట్లొనర్చిన వారికిని బ్రహ్మహత్యా సంసర్గ పాతకము లభించును.

స్త్రీల యీ త్యాగమును గాంచి యింద్రుఁడిట్లు వరము నొసంగెను – "మీలోనిరంతరము సంభోగించుటకు శక్తి యుండుఁ గాక! దానికే సమయమును నిర్దిష్టముగ నుండదు."

శుకమహర్షి యిట్లనెను "రాజా! పశువులలో గర్భధారణ సమయముననే ఒక్కసారి మాత్రమే కామ ముత్పన్నమగును. గర్భవతికాఁగానే పశువులలో మరలఁ గామవాసన యుండదు ఇది పఱకు స్త్రీలకును నిట్లేయుండెడిది. సంవత్సరమున కొక్కసారి మాత్రమే కోరిక కలుగును. దేవరాజగు నింద్రుఁడు వరమీయఁగానే వీరిలో నిరంతరము కామవాసన యుంటుండెను. ఎప్పుడు బుద్ధికలి గిన నప్పుడు సమాగము మొనర్పవచ్చును.

అంత శౌనకుఁ డిట్లడిగెను - "సూతా! స్త్రీలకిది వరదానమా లేక శాపమా ?"

ఇది విని సూతుఁడు నవ్వి యిట్లనెను - "స్వామీ! ఇప్పుడు మీకేమి చెప్పుదును ?

ఈ ప్రశ్నను మీరడుగ కుండుటయే మంచిది, ఈ విషయమును నేనీ ఋషిమండలములలో నెట్లు చెప్పఁగలను? కొన్ని విషయములను స్పష్టముగఁ జెప్పవచ్చును, కొన్నిటిని సంకేత మాత్రముగనే చెప్పవీలగును. స్వామీ! కథలు చెప్పువృత్తి చాల చెడ్డది దీనిలో మంచి, చెడ్డ, యోగ్యాయోగ్య విషయముల నన్నిటినిఁ దెలుపవలసి యుండును. దేవేంద్రుఁడు స్త్రీలను సంతోష పఱచుటకే వారికి మనోనుకూల వరముల నొసంగినాఁడు ఈ విషయమున నేను మీకొక అత్యంక ప్రాచీన పౌరాణిక దృష్టాంతమును జెప్పెదను. మీరందఱును బుద్ధిమంతులు. బుద్ధిమంతులకు సంకేతమే చాలును. దాని మూలమున నూహించుకొనుఁడు."

ప్రాచీన కాలమున నొకరాజుండెను. ఆతనికి నూర్గురు పుత్రులు, ఒకసారి ఆతఁడు బయటకు పోయెను. ఇంద్రుని శాపమున ఆతఁడు స్త్రీ యయ్యెను. ఒక పురుషునితో ఆతనికి వివాహమయ్యెను ఇప్పుడు రాజు రాణియయ్యెను. స్త్రీ శరీరముచే నీమెకు నూర్గురు పుత్రులు పుట్టిరి. ఇంద్రుఁడీమెకడకు వచ్చి యిట్లనెను :- నీకు పుట్టిన నూర్గురును బిల్లలుగనే యుందురు. నేను నీకు వరము నొసంగి పురుషునిగఁ జేయుదును. ఇప్పుడు నీవు రాజులుగనున్న నూర్గురు పుత్రులను వదలివేయుదువా లేక నీవు రాణివై నూర్గురను

గంటివే వారిని వదలి వేయుదువా? ఎవరు మిగిలెదరో వారుతప్ప మిగిలిన వారు చచ్చెదరు. నీవు పురుషుఁడుగ నుండగోరెదవా? లేక స్త్రీగానే యుండఁగోరెదవా?"

అంత రాణియైన రాజిట్లనెను :- "దేవేంద్రా! నీవు నాపైఁ బ్రసన్నుఁడవైనచో నేను స్త్రీనైయుండి కనిన పుత్రులను జిరంజీవులుగ నొనర్పుము."

అంత నాశ్చర్యముతో నింద్రుఁ డిట్లడిగెను :- "ఇట్టి వరమును నీవేల కోరితివి?"

అంత రాణియైన రాజిట్లనెను :- "స్వామీ! తండ్రికంటెఁ దల్లికి పుత్రులందధిక ప్రేమ యుండును. పుత్రులపైఁ దల్లికున్న మోహము తండ్రికుండదు కావున నేను మాతృరూపమునఁ గనిన పుత్రులను మొదటి పుత్రులకంటె నధికముగఁ బ్రేమింతును."

అంత నింద్రుఁడు మరల నిట్లడిగెను :- "అయితే నీవు పురుషుఁడవు కాఁగోరుచున్నావా లేక స్త్రీగానే యుందువా?"

మిక్కిలి లజ్జించుచు నిట్లనెను :- "దేవేంద్రా! ఇప్పుడందఱ ముందు నన్నేల నవమానించెదవు? ఈ యెగతాళి మాటలు కట్టిపెట్టుఁడు. నేనిప్పుడెట్లున్నానో అదే బాగున్నది."

ఆశ్చర్యముతో నింద్రుఁడిట్లనెను :- నీవు రవిక చీర కట్టుకొని, ముక్కు చెవులు కుట్టించుకొని పురుషుఁడుగఁగాక స్త్రీగా నుండుట కేలఁగోరుచున్నావు? నట్టి సుఖమేమున్నది?"

మిక్కిలిగ సిగ్గుపడుచు నామె కాళ్ల గోరులతో నేలను ద్రవ్వుచు నెమ్మదిగ నిట్లనెను :- "ఇప్పుడు మీరు స్పష్టముగఁ

జెప్పనిది అంగీకరింపరు. ఇంతకు యథార్థ విషయమేమనఁగాఁ బతిసతులయందు వీరిద్దరిలోఁ బతికంటెఁ బత్నికే రతిసుఖ మందత్యధికానందానుభవముండును. కావున నిప్పుడు నేను గడ్డములు మీసములు పెట్టుకొని పురుషుఁడుగ నుండఁగోరను" కావున మునులారా! గోవిందాయ నమోనమః మీకు మీ రాముఁడు శుభము కలుగఁజేయునుగాక, ఇప్పుడు మీరింకొక విషయము నడుగుఁడు.

అంత శౌనకుఁడిట్లడిగెను:- "అయితే సూతా! విశ్వరూపునిఁ జంపఁగానే ఆతని తండ్రియగు త్వష్టమహామునికి మిక్కిలి కోపమువచ్చి యుండవచ్చును. ఆతఁడు దేవతల మీఁదఁగసి తీర్చుకొనుట కేమైనను బ్రయత్నించలేదా? విషయముదాఁటి పోయినది"

అంత సూతుఁడిట్లనెను :- "స్వామీ! అసమర్థులగువారే మెదలక కూర్చుండి యుండెదరు. సమర్థులగువారు కసితీర్చుకొనక యూరకుండరు. కొందఱు బ్రహ్మజ్ఞానుల విషయములో నట్లుకాదు. కాని సాధారణముగ సమర్థు లీవిధమగు ఘోరావమానమును సహింపఁజాలరు. విశ్వరూపుని వధకారణమున గొప్పకాండ జరిగినది. దేవాసురులకు చాల కాలము వఱకు గొప్ప ఘోరమగు నైతిహాసిక మహాయుద్ధము జరిగెను. దాని సంక్షిప్త వర్ణనమును నేను మీకుఁ జెప్పెదను. మీరు దీనిని సావధానులరై శ్రవణము చేయుఁడు."

... ...

భాను ప్రింటింగ్ వర్క్స్, తిలక్‌నగర్, హైదరాబాద్ - 500044.